

# ప్రస్తావన

ప్రతిజీవియు ఆనందము కొరకు పాటుపడుచున్నది తుట్టతుదకు క్షణికమైన విషయానందమునే పొంది తృప్తిపడుచున్నది శాశ్వతానందము తెలియుటలేదు కాని బ్రహ్మానందము కొఱకే యత్నించినచో రారాజు భవించు సుఖముకంటె గొప్పసుఖము లభించుటయే కాక బంధములన్నియు తొలగిపోగలవు అట్టి అపూర్వ బ్రహ్మానందమే ప్రతిజీవియొక్కయు లక్ష్యము అద్దానినెట్లు సాధించవలెనో ఆ వివిధ పద్ధతులు ఈ గ్రంథమున చక్కగ తెలుపబడినవి ముముక్షువులు వానిని గూర్చి తెలిసికొని సాధించి మహత్తరమైన బ్రహ్మానందము యొక్క ఫలితమును ఈ జీవితమునందే పొంది ధన్యులగుదురు గాక!

ఇట్లు

ప్రకాశకులు

తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఈ గ్రంథముద్రణకు రు 5000 00 లు (అయిదు వేలరూపాయలు) సహాయము చేసిరి వారికి మా కృతజ్ఞతలు

ఇట్లు
ప్రకాశకులు

ఓమ్

# బ్రహ్మానంద వైభవము

## 1 బ్రహ్మానందమే జీవితలక్ష్యము

### బ్రహ్మానందముయొక్క మహిమాతిశయము

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి

బ్రహ్మానంద స్వరూపుడును పరమ సుఖము నొసంగు వాడును కేవలము జ్ఞానమూర్తియు ద్వంద్వములకు అతీతుడును ఆకాశమువలె సర్వవ్యాపకుడును సూక్ష్మరూపుడును తత్త్వమసి మున్నగు మహావాక్యములకు లక్ష్యమన్న అద్వితీయుడును, నిత్యుడును, నిర్మలుడును నిశ్చలుడును సమస్త ప్రాణికోట్లయొక్క బుద్ధులకు సాక్షియై యుండువాడును భావాతీతుడును, త్రిగుణరహితుడును అగు పరమాత్మ యను సద్గురువునకు నమస్కరించుచున్నాను

జీవుడా! ఏల దుఃఖించెదవు! ఈ సంసార కూపమున బడి పెక్కు యిడుముల నొందుచున్న నీకు విముక్తిమార్గము లేదా! దుఃఖము తొలగుటకు ఉపాయము గోచరించుట లేదా! ఆనందమున కేల నీకు కొఱత కలిగినదో విచారింపకుంటివేల! విచారణ చేయకుండుటయే ఈ దుఃఖమున కంతటికిని కారణము ఆనందమున కే మాత్రము నీకు లోటు కలుగ నేరదు ఆనందమే నీ స్వరూపము నీపైన క్రింద ప్రక్కల బయట లోపల ఆనందమే పొంగి పొరలుచున్నది ఆనంద సాగరములో నీవు మునకలిడుచున్నావు వెయ్యేల ఆనందమే నీవు ఆ పరమరహస్యమును తెలిసికొనకపోవుటయే నీ దుఃఖములన్నిటికిని మూలకారణము రాత్రి గాఢనిద్రబోవు చున్నపుడు నీకు కలిగిన ఆనందము ఎచటినుండి వచ్చినది! ఒక వస్తువును నీ వపుడు తినలేదే, త్రాగలేదే, చూడలేదే అనుభవించలేదే అయినను అంత సుఖ మెట్లు కలిగినది! అది బయటనుండి వచ్చిన సుఖముకాదు లోపల ఊరిన సుఖము మేలుకొని మనస్సును లయముచేసి అట్టి అవిచ్ఛిన్నసుఖమును అనుభవించుటను అభ్యసించవలెను. అదియే సమాధిస్థితి తురీయము (Super conscious state) అట్టి స్థితిని బాగుగ అభ్యసించి నీ జన్మహక్కైన బ్రహ్మానందమునొక్క అనుభూతిని బడయుటచే సర్వదుఃఖవిచ్ఛేదము సంభవించును.

కావున జీవుడా! దీనిని తెలిసికొని ఇక నీ వెన్నటికిని దుఃఖపడవలదు

and free అని వివేకానందస్వామి ఉద్ఘోషించినట్లు నీవు దుఃఖలవశుడవు కావు దుఃఖితుడవు కాదు పరమానందరూపుడవు

ఇక జీవుని నిజస్వరూపమగు బ్రహ్మానంద మెట్టిదో విచారించెదము—బ్రహ్మానందము వర్ణించుటకు అలవికానిది అది అనుభవైకవేద్యము అయియున్నది. అది యెట్టిదో ఎవరైనను వర్ణించగలరా ? అట్టి బ్రహ్మానందమునుగూర్చి

సమాధి నిర్ధూతమలస్య చేతసో
నివేశిత స్యాత్మని యత్సుఖం భవేత్
న శక్యతే వర్ణయితుం గిరా తదా
స్వయం తదన్తఃకరణే న గృహ్యతే

ధ్యానముయొక్క అభ్యాసముచే మన మాలిన్యము రహితము కాగా ఆత్మయందు స్థితిని బొందిన మహనీయులు ఎట్టి నిర్వికల్పసుఖమును అనుభవించెదరో అద్దానిని వాక్కుతో ఎవరును వర్ణింపజాలరు అది వారివారిచేత స్వయముగ అనుభవింపవలసినదియే అయియున్నది ఎంతదూరా ఆసక్తితో తల్లిపాలు త్రాగుచున్న దూడను మెల్లగా పట్టుకొని లాగినను అది విడిచి వచ్చునా ? అట్లే యోగనిష్ఠయందు నిశ్చలులైన బ్రహ్మానందమును గ్రోలుచుండు మహాత్ములు అట్టి అనంతమైన స్థితిని విడనాడుటకు ఇచ్చగింపరు. పిలువనిది ఆయాసంపదము త్రెంపులేనిది దుఃఖము ఎవలేశమైనను లేనిది దేవేంద్రసుఖముకూడ ఆ బ్రహ్మానందముయొద్ద తీసికట్టే యగును

న సుఖం సురేంద్రస్య న సుఖం చక్రవర్తినాం
యత్సుఖం వీతరాగస్య మునేరేకాన్తవాసినః

రాగద్వేషరహితుడై ఏకాంతముగ ధ్యాననిష్ఠుడగు బ్రహ్మానంద మనుభవించుచుండువానికి కలుగు సుఖము దేవేంద్రునకుగాని చక్రవర్తులకుగాని కలుగనేరదు

యస్యాంశలేశలవ విస్ఫురణేన విశ్వ
మానందతి ప్రచురసౌఖ్య వదావించిం
తద్బ్రహ్మ పూర్ణసుఖమాత్మతయోపలభ్య
కస్త్వత్ర విభ్రమితు మిచ్ఛతి శూన్యకల్పే

ఏ బ్రహ్మానందముయొక్క లవలేశపు స్ఫూర్తిచేత ఈ ప్రపంచమందలి సమస్త ప్రాణులు ఆనందము ననుభవించుచున్నవో, అట్టి ఆనందమే తన ఆత్మయని గ్రహించిన ఏ తత్త్వవేత్త ఇక మిథ్యాభూతమగు దృశ్యసౌఖ్యము ననుభవించుటకు ఇచ్ఛగించును ?

శ్రీ శంకరాచార్యులవారు తమ మనీషా పంచకమున బ్రహ్మానందముయొక్క చక్కటి వివరణమును ఈ ప్రకారముగ గావించినారు —

యత్సౌఖ్యాంబుధి లేశలేశత ఇమే శక్రాదయో నిర్వృతాః
యచ్చిత్తే నితరాం ప్రశాన్తకలనే లబ్ధ్వా మునిర్నిర్వృతః

యస్మిన్నిత్యసుఖాంబుధౌ గళితధీర్బ్రహ్మైవ హి బ్రహ్మవిత్
యః కశ్చిత్సురేంద్రవందితపదం నూనం మనీషా మమ

ఏ బ్రహ్మానంద సముద్రము యొక్క వలేశమును గ్రహించి ఇంద్రుడు మొదలైనవారు పరమానంద పడుచున్నారో దేనిని తమ హృదయమం దనుభవించుచు మునీశ్వరులు పరమశాంతిని బొందుచున్నారో నిత్యమైన ఏ సుఖసాగరమున తమ బుద్ధిని లయింపజేసి బ్రహ్మవేత్త సాక్షాత్ పరబ్రహ్మమే యగుచున్నాడో దేవేంద్రునిచే కూడ వందనీయమైన అట్టి నిరతిశయ బ్రహ్మానందము నిక్కముగ దేవుని ఆత్మస్వరూపము.

బ్రహ్మానంద మనునది ఒక నిధిగా నిక్షేపముగా శాస్త్రముల వర్ణింపబడియున్నది లోకములో ధననిక్షేపమును జనులు బహు జాగ్రతగ రక్షింపగల్గు కాపాడుచుందురు. అట్లే బ్రహ్మానందమను నిధి అహంకారమను సర్పముచే సంరక్షింపబడుచున్నదనియు ఆ యహంకారమును తొలగించినచో మాత్రమే దివ్యానందానుభూతిని జనులు పొందగలరనియు ఏ బుద్ధిశాలి ధీరుడో అట్టి కార్యమును సాధించి పరమానంద మనుభవించుచున్నాడనియు ఈ క్రింది శ్లోకముద్వారా స్పష్టముగ బోధపడుచున్నది

బ్రహ్మానంద నిధిర్మహాబలవతాఽహంకార ఘోరాహినా
సంవేష్ట్యాత్మని రక్ష్యతే గుణమయైశ్చండైస్త్రిభిర్మస్తకైః

జ్ఞానాత్మమహాసినా ద్యుతిమతా విచ్ఛిద్య శీర్షత్రయం
ర్మూల్యాహిమిమం సుఖకరం ధీరోను భోక్తుం క్షమః

(వివేక చూడామణి)

బ్రహ్మానంద రసానుభూతిని బడసిన మహనీయుల యొక్క అనుభవ వాక్యము లన్నియూ ఉపనిషత్తులందును భాగవతమున దును తదితర శాస్త్ర గ్రంథములందును గ్గఁగ పేర్కొనబడినవి వానిని పఠించినచో ఆత్మ సాక్షాత్కారముచే జీవు డెట్టి మహదానందమును పొందుచు డునో స్పష్టముగ తెలియగలదు పఠితయు జీవుని అంతరంగమున ఎట్టి మహోన్నత ఆనందముయొక్క అస్తిత్వము కలదో నులు గుర్తెఱిగి పరమాశ్చర్యము నొందుచుందురు ఆహా! మానవజన్మ ద్యక్షం దిట్టి సమస్త ఆన దములయొక్క పరాకాష్ఠ యగు బ్రహ్మానందమును అనుభవించుటకు చక్కటి అవకాశ మొసగినది కదాయని మహనీయులు లోలోన సంతోషించు దురు

అట్టి అపారమైన ఆనందమే మానవుని స్వరూపము అయినను అజ్ఞానముచే అతడు తాను జడమగు దేహమని పంచభూతాత్మకమైన ఒకానొక భిన్నవస్తువని (దేహమని) భావించి దానిపై మమత్వము కలిగి ఇంద్రియసుఖములే పరమసుఖములనియు ప్రాపంచిక వైభవములే జీవిత లక్ష్య మనియు తలంచి అమూల్యమైన మానవజీవితమును దురుప యోగము చేయుచున్నాడు దృశ్య వ్యామోహములోపడి

బ్రహ్మానందముయొక్క వైభవమును ఎంత గణింపగలవాడు? కాని మహనీయులు శాశ్వతమగు సచ్చిదానందముయొక్క విలువను వైభవమును గుర్తెఱిగి దానిని అనుభవించు నిమిత్తం రాజ్యములనుకూడ వదలివైచిరి. బుద్ధుడు సర్వసంపత్పరిపూర్ణమగు రాజ్యవిభవమును తృటిలో త్యజించివైచి నిర్వాణసుఖముకొఱకై యత్నించి సఫలుడయ్యెను. అట్లే భగీరథుడు అరిష్టనేమి మొదలగు రాజులున్ను విషయానందమయములగు రాజ్యాదులను విడనాడి బ్రహ్మానందముకొఱకై తీవ్రతరసాధనలనుచేసి లక్ష్యమును పొంది కృతార్థులైరి. ప్రాపంచిక వైభవము ఎచట? బ్రహ్మానందవైభవ మెచట?

తస్మిం పరానంద రసానుభూతి
ముత్సృజ్య శూన్యేషు రమేత విద్వాన్
చన్ద్రే మహాహ్లాదిని దీప్యమానే
చిత్రేన్దు మాలోకయితుం క ఇచ్ఛేత్

మహత్తరమైన బ్రహ్మానందానుభవమును విడిచి శూన్యములైన (మిథ్యాభూతములైన) ప్రాపంచిక విషయములందు ఏ వివేకవంతుడు ప్రీతి గొనును? మహదానందమొసంగు చంద్రుడు వెలుగుచుండగా చిత్రమందలి చంద్రుని ఎవడు చూడగోరును?

శ్రీ వాల్మీకిమహర్షి తమ యోగవాసిష్ఠ మహాగ్రంథమును ప్రారంభించుచు బ్రహ్మానందస్వరూపుడగు పరమాత్మకు నమస్కారము చేసెను—

స్ఫురన్తి శీకరా యస్మాదానందస్యాంబరేఽవనౌ
సర్వేషాం జీవనం తస్మై బ్రహ్మానందాత్మనే నమః

ఏ ఆనందసాగరమునుండి వెలువడిన చిన్నతుంపరలే సమస్త ప్రాణికోట్లయొక్క జీవనమై యలరుచున్నవో అట్టి బ్రహ్మానంద రూపుడగు పరమాత్మకు నమస్కారము.

బ్రహ్మానందముయొక్క నిర్వచనమును గావించుచు బృహదారణ్యకోపనిషత్తు ఈ క్రింది విధముగ పేర్కొనినది.

స యో మనుష్యాణాం రాద్ధః సమృద్ధో భవత్యన్యేషా మధిపతిః సర్వైర్మానుష్యై ర్భోగైః సంపన్నతమస్స మను ష్యాణాం పరమ ఆనందోఽథయే శతం మనుష్యాణా మాన న్దాస్స ఏకః పితౄణాం జితలోకానామానందోఽథయే శతం పితౄణాం జితలోకానామానందాస్స ఏకో గంధర్వలోక ఆనందోఽథయే శత గంధర్వలోక ఆనన్దాః స ఏకః కర్మ దేవానామానందో యే కర్మణా దేవత్వ మభిసంపద్యన్తే అథయే శతం కర్మదేవా నామానందాస్స ఏక ఆజానదేవా నామానందో యశ్చశ్రోత్రియోఽవృజినోఽకామహతోఽ థయే శతం ప్రజాపతిలోక ఆనందాస్స ఏకో బ్రహ్మలోక ఆనంద యశ్చ శ్రోత్రియోఽవృజినోఽకామహతోఽథైష ఏవ పరమ ఆనందః ఏష బ్రహ్మలోక స్సమ్రాడితి హోవాచ యాజ్ఞవల్క్యః

ధనధాన్య సంపన్నుడును సర్వులకు అధిపతియు సమస్తమానవభోగములతో కూడియున్నవాడును అగు

చక్రవర్తియొక్క ఆనందము ఒక మనుష్యానందము దానికి నూఱురెట్లు ఒక పితరుల ఆనందము దానికి నూఱురెట్లు ఒక గంధర్వానందము దానికి నూఱురెట్లు ఒక కర్మదేవతల ఆనందము దానికి నూఱురెట్లు ఒక అజానదేవతానందము దానికి నూఱురెట్లు ఒక ప్రజాపతిలోక ఆనందము దానికి నూఱురెట్లు ఒక బ్రహ్మలోక ఆనందము దానికి అనేకరెట్లు పరమానందము బ్రహ్మానందము

లోకములోగల సమస్త ఆనందములును బ్రహ్మానందమునం దిమిడి యున్నవి. కావున అద్దానిని మహనీయులు సౌఖ్యాంబుధి అనగా ఆనందసముద్రము అని వర్ణించిరి అట్టి మహోన్నతసుఖము అట్టి అనంతబ్రహ్మానందము జీవుల స్వరూపమే అయియుండ ఇక ఏల అద్దానికొఱకై ప్రయత్నించరాదు? క్షణికమై దుఃఖమిశ్రితమై మిథ్యాభూతమై కల్పితమైనట్టి విషయసుఖసంపాదనమందే ఏల జీవితమును ధారపోయవలెను విజ్ఞులగువా రట్లున్నటికిని చేయరు ప్రతిబింబమునకై వారు ప్రాకులాడరు బింబస్వరూపమైన సద్వస్తువు కొఱకే బ్రహ్మానందరూపస్వస్వరూపాత్మ సాక్షాత్కారము కొఱకే వారు ప్రయత్నించుదురు అట్లు ప్రయత్నించి బ్రహ్మానందానుభూతిని బడయుటయే సమస్తజీవులయొక్క లక్షణ కర్తవ్యమై యున్నది

యాజ్ఞవల్క్యుడు అష్టావక్రుడు సిద్ధులు మొదలైన వారివలన ఆత్మజ్ఞానమును బడసి జనకమహారాజు మహోన్నత సుఖ ఆనందానుభూతిని బడయుచు ఈ విధముగ పలికెను.

ఆత్మయను మణిని పొంది అద్దాని నవలోకించుచు (ధ్యానించుచు) ఇతర చేష్ట లెవ్వియు లేని వాడనై ఏకాంతమున బ్రహ్మానంద మనుభవించుచు సుఖపూర్వకముగ నుండనగు ఓ చిత్తమా! ఈ చంచల సంసారము ఆత్మకు సుఖదాయకము కాదు కావున నీవు శమించుము నీవు శమించినచో నిశ్శేషవాతమై సారభూతమైనట్టి ఆత్మసుఖము బ్రహ్మానందము లభించును ఇక ప్రహ్లాదుడున్ను జ్ఞానోదయము పొందినమీదట ఈ ప్రకారముగ ఉద్ఘోషించెను— అనంతానంద దాయకమై పరమశాంతి ప్రదమైనట్టి ఈ శుద్ధచిన్మయ ఆత్మ దృష్టి దృష్టులన్నిటి యందును మేటియై యున్నది అట్టి ఆత్మానందము ననుభవించక వందలకొలది జగద్రాజ్యముల యొక్క సుఖముల ననుభవించినను ఒకింతైన సుఖమనుభవించలేనివాడే యగును. ఎవడు సర్వోత్తమమగు ఈ బ్రహ్మానందామృతమును అంతఃకరణమున బడయునో అట్టి రిపూర్ణునకు విషయసుఖము నొకింతైనను కోరిక యున్నప్పటికిని సమస్తసుఖములను పూర్ణముగ పొందినవాడే యగును.

ఈ ముల్లోకములందును వాస్తవసుఖ మొకటైనను లేదు ఏలయనగా రాజ్యమును పొందియు మనుజుడి కను గోరుచునేయున్నాడు సమస్త సుఖమున్ను చిదాత్మయందే లదు జనులు దానిని ఏల అనుభవించుట లేదు! మహాదాందప్రదమగు ఈ ఆత్మయను సోమబంధువు దర్శింపబడగా ద్వేషాదిపాశములన్నియు విచ్ఛిన్నములై పోవును. కామక్రోధాది శత్రువు లందరును పలాయించి పోవుదురు. ఆశ

లెన్నియు ఉన్నను ఛేదింపబడుచుండు. ఆహా! తెలిసి కొనదగిన ... నేనిపుడు తెలిసికొంటిని చూడదగిన దంతయును చూచితిని. దేనిని పొందినచో ఇక పొందదగిన దెద్దియు లేకుండునో అట్టి ఉత్తమ పదార్థమగు ఆత్మను, బ్రహ్మానందమును నేనిపుడు పొందితిని ఓ ఆత్మదేవా! నీకు నమస్కారము సర్వోత్తమునవును నిర్మలునవును అగు నీవు గ్రహింపబడిన పిదప ఈ దేహ భోగసమూహములు మనోహరములై యున్నను నాకిపుడు రుచించుటలేదు

సత్ చిత్ ఆనందములే పరమాత్మయొక్క స్వరూపము కావున ఆత్మ సాక్షాత్కారముచే కలిగెడు ఆనందానుభూతి జీవులకు తప్పక కలుగగలదు ఆనందమే సర్వుల జీవిత లక్ష్యమని తెలుపుటకు కాబోలు సన్యాసుల నామధేయముల చివర ఆనంద అను పదము విధిగ చేర్చబడుచున్నది (యోగానంద తురీయానంద ఈ విధముగ) అట్టి సుఖం ఆత్మానుభూతిని బ్రహ్మానందమును జీవు లెట్లు పడయగలరో ఆ పద్ధతులు, సాధనోపాయములు ముమ్ముందు ఈ గ్రంథమున తెలుపబడగలవు

ఏ ఆనందము కొఱకై విశ్వమందలి సమస్త ప్రాణులను తహతహలాడుచున్నవో ఏది సర్వులయొక్క జీవనమై మలయుచున్నదో ఎట్టివారియొక్క అనుభూతి బ్రహ్మాది స్థావరాంతముగాగల ప్రాణికోట్లన్నిటికిని ఎమన తృప్తిని తుష్టిని పుష్టిని ఉత్సాహమును ఉల్లాసమును కలుగజేయుచున్నదో

ఏది నిర్గుణ పరబ్రహ్మముయొక్క మూడు లక్షణములగు సత్ చిత్ ఆనందములలో మూడవదను బడుచున్నదో అట్టి బ్రహ్మానందము ఎంతటి మహోన్నతమైన పదార్థము! దానిని వాంఛింపని వ్యక్తి లోకములో ఎవడైన యుండగలడా? ఉదయము నిద్రలేచినది మొదలు మరల పండుకొనువఱకును, జన్మించినది మొదలుకొని దేహాంతమగు వఱకును ప్రతిజీవియు ప్రతిక్షణమును అట్టి ఆనందము కొఱకే అఱ్ఱులు చాచుచున్నాడు. అట్టి ఆనందమునకేదైన అవరోధము కలిగినచో దానిని తొల గించివేయుటకు ప్రయత్నించుచున్నాడు.

అయితే ప్రతిజీవి ఆనందమే వాస్తవమగు ఆనందమని భ్రమించి దానివెంట పరుగిడుచున్నాడు. అదియే అతని పొరబాటు. ఇంద్రియములద్వారా లభించు విషయానందము శాశ్వతమైనదికాదు. అవిచ్ఛిన్నమైనదికాదు. అది కొద్దిసేపు తిరల మాసిపోవును. అగాధమైన దుఃఖములోనికి దింపును.

సుఖమల్పం బహుక్లేశం విషయగ్రాహిణాం నృణాం
అనన్తం బ్రహ్మనిష్ఠానా మితి వేదాన్తడిండిమః

అని శ్రీ శంకరభగవత్పాదులు ఆత్మబోధ యందు లిఖిన చందమునను,

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః

అని శ్రీకృష్ణపరమాత్మ గీతయందు వ్యక్తమొనర్చిన విధముగను దృశ్యవిషయముల వలన లభించు ఆనందము పరిపూర్ణమైనదికాదు పైగా దుఃఖమిశ్రితమైనది దుఃఖము లోన గలిగి పైపైన ఆనందముగా తోచునది కావున అట్టి అల్పానందమునకై జీవితములో అమూల్యమైన ఘడియలను ధారపోయక బింబసుఖమగు ఆత్మానందమునకే బ్రహ్మానందమునకే విజ్ఞుడు ప్రయత్నించవలెను

ఆనందమే పరబ్రహ్మము ఆనందమే జీవుని నిజస్వరూపము ఆనందపరిపూర్ణుడగు జీవుడు తన స్వరూపమగు నిత్యానందమును మఱచి దుఃఖించుట హాస్యాస్పదమే యగును. భ్రాంతివలననే అట్టి వైపరీత్యము సంభవించినది కావున సద్గురూపదేశముచే తిరిగి తన యథార్థస్వరూపమును గుర్తెఱిగి అట్టి అవిచ్ఛిన్న బ్రహ్మానందమునందే స్థితిగలిగి చిదానందరూపః శివోఽహం శివోఽహమ్' అని ఎలుగెత్తి చాటుచు పవిత్రమగు మానవ జీవితమును సార్థకము చేసికొనవలెను అట్టి మహోన్నత ఆనందానుభూతియే జీవిత లక్ష్యము

ప్రతివారును తమధ్యేయము అట్టి అవిచ్ఛిన్న అక్షయ బ్రహ్మానందమేయని బాగుగ తెలిసికొని అద్దాని ప్రాప్తికొఱకై అనవరత కృషి సలుపవలయును ఆ యానందము నశించునదికాదు. తొలగిపోవునదికాదు తొలగింపబడుటకు వీలు లేనిది అది సర్వులయొక్క నిజస్వరూపము అందఱి

యొక్క ఆత్మయే ఆ ఆనందము. అది అవిచ్ఛిన్నమైనది క్రొంపులేనిది అవ్యయమైనది

వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి

అని గీతాచార్యుడు పేర్కొనిన చందమున ఆ ఆనందమునకు నాశము లేదు. అద్దాని వినాశమును ఎవరును చేయలేరు. తెలిసియో తెలియకనో సర్వజీవులును ఆ ఆనందమునే అపేక్షించుచున్నవి. అట్టి ఆనందోన్ముఖముగనే ప్రయాణము సల్పుచున్నవి. కాని తమ తమ హృదయాంతరాళమున వెలుగుచున్న ఆత్మ ఘనీభూతమైన ఆనందస్వరూపమని తెలియక, ఆనంద మహాసాగరమని యెరుగక చిన్న చిన్న అల్పసుఖములకొరకై విషయానందముకొరకై బయట అఱ్ఱులు చాచుచున్నారు

యస్త్వాత్మసుఖ ముత్సృజ్య సుఖం బాహ్య మపేక్షతే
కరస్థం పాయసం త్యక్త్వా స మూఢో లేఢి కూర్పరం

ఎవడు ఆత్మసుఖమును వదలి బాహ్యమందలి విషయ సుఖమును అపేక్షించుచున్నాడో అట్టివాడు అరచేతియందున్న పాయసమును వదలివైచి మోచేతిమీదుగా కారిన ఒకింత పాయసలేశమును నాకువాడే యగును — అని శ్రీ శంకరభగవత్పాదులు మహావాక్యదర్పణమునందు సెలవిచ్చియున్నారు.

ఆనందమును అపేక్షింపనివాడెవడును ఈ ప్రపంచమున లేడు. పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రతి ప్రాణియు

ఆనందమునే వాంఛించుచున్నది తన స్వరూపము ఆనందము కాబట్టియే అట్టి వాంఛ సర్వజీవులకును కలుగుచున్నది పోగొట్టుకొనిన తన ఆనందమును తిరిగి సంపాదింపవలెనని ప్రతి ప్రాణియు తబలాటపడుచున్నది మరచిన తన స్వరూపమును ఏనాటికైనను తిరిగి పొందవలెనని అభిలాష గలిగి యుండుచున్నది ప్రాణికోట్లయొక్క ఆనందాన్వేషణమునకు కారణ మిదియే అయియున్నది

పరిపూర్ణ సుఖము బయట వస్తువులందు లేదు ఆత్మయందే కలదు కనుకనే సమాధి స్థితి యందు జీవుడు బాహ్య పదార్థము లన్నిటిని వదలివైచి తనలో అవిచ్ఛిన్న సుఖానుభూతిని బడయుచున్నాడు ధ్యాననిష్ఠయందు నిలుకడ కలిగిన వాడు తన ఆత్మయందు పొందు సుఖము చెప్పనలవికాదు అట్టానిని మహాత్ములు వర్ణింపజాలరైరి అది అనుభవైకవేద్యమగు సుఖము

వాచా వక్తుమశక్యమేవ మనసా మన్తుం న వా శక్యతే
స్వానన్దామృతపూరపూరిత పరబ్రహ్మాంబుధేర్వైభవమ్
అంభోరాశి విశీర్ణవార్షికశిలాభావం భజన్మేమనో
యస్యాంశాంశలవే విలీనమధునాఽఽనందాత్మనా నిర్వృతమ్

వాక్కుచేత చెప్పుటకుగాని మనస్సుచేత తలంచుటకుగాని వీలుపడనిది ఆ ఆత్మానందానుభూతి ఆ ఆనందము అవధులు లేని సముద్రము వంటిది మనస్సను వడగండ్ల వంటిది. అబ్ధి

ఆత్మ యను సముద్రములో పడి విలీనమై ఆత్మారాముడై పరమ బ్రహ్మానంద మనుభవించుచున్నది అని శ్రీ శంకర భగవత్పాదులు వివేకచూడామణియందు ఆత్మసుఖమును వర్ణించిరి ... సామాన్యమైన నిద్రలోనే మనకెంతో గొప్ప సుఖమును బడయుచున్నపుడు ఇక సమాధి స్థితియందు వేరుగ చెప్పవలయునా? నిద్రయందు మనస్సు లయించినను అది జడస్థితి తమోగుణ స్థితి కాబట్టి అది అంత గొప్పస్థితి కాదు పశువులుకూడ నిద్ర పోవుచున్నవి కదా మేలుకొని మనస్సును లయము చేయవలెను అదియే మహోన్నత సమాధిస్థితి అదియే ఆత్మస్థితి బహుకాల ప్రయత్నము చేతను సాధనాభ్యాసముచేతను వైరాగ్యభావనచేతను అట్టి తురీయస్థితి తప్పక చేకూరగలదు

అది గొప్ప మహోన్నత స్థితి కాబట్టియే శ్రీకృష్ణ పరమాత్మ అద్దానిని పరమ లాభమని గీతలో వర్ణించెను.

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్‌స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే

దేనిని పొందినచో మరియేదియు గొప్ప లాభమును పొందినట్లగునో దేనియందు నిలుకడ కలిగియున్నచో ఎట్టి భయంకర దుఃఖమును చలింపజేయజాలదో అదియే ఆత్మస్థితి కావున విజ్ఞుడు అట్టి ఆత్మస్థితి కొఱకై ఇతోధికముగ యత్నమును సలుపవలయును

2)

ఒకింత విషయసుఖముకొఱకై దూరదూరముగ పోయి అవస్థలు పడుటకంటె నశ్వరములగు దృశ్యవిషయము లెప్పుడు లభింపగలవాయని కాచుకొనుటకంటె తన అతిసమీపమున నున్నదై తన స్వరూపమే అయి వెలయుచున్నట్టి పరిపూర్ణ ఆత్మసుఖము కొఱకై ఏల అన్వేషింపరాదు! చేతిలోనున్న పండు వదలి నీటిలో ప్రతిబింబించిన పండుకై ఆశించుట విజ్ఞత యగునా!

బాహ్యవస్తువులు ఒకింత సుఖమును కలుగజేసినను మరల కొంతకాలమునకు దుఃఖదాయకములై పరిణమించును. విషయసుఖము దుఃఖమునుకూడ తనవెంట గొనితెచ్చుచుండును. అది దుఃఖమిశ్రితమైన సుఖమనియే చెప్పవలెయుండును పైగా అది పరిచ్ఛిన్నమైనది మొదలు, తుది కలిగియున్నది తెలివి కలవారు అద్దానిని ఆశింపరని భగవానులు నుడివియున్నారు

విజ్ఞుడగువాడు త్రెంపులేని ఆనందమునే అపేక్షింపవలెను. అవిచ్ఛిన్నమగు ఆనందమునే కాంక్షింపవలెను అట్టి అంతులేని ఆనందము ఆత్మయందే కలదు దృశ్యవిషయములందు లేదు అందువలన ముముక్షువగువాడు ఇంద్రియార్థముల యెడల విరాగము గలిగి అంతర్ముఖుడై ఆనందసాగరమగు ఆత్మయొక్క దరికిజేరి అందు నిమగ్నుడై పరమానందమనుభవించుచు జీవితమును చరితార్థము చేసికొనవలెను

ప్రపంచములోని ఏ పదార్థమైనను జీవునకు త్రెంపు లేని ఆనందమును ఒనగూర్చుచున్నదా? ఒక గంట రెండుగంటలసేపైనను అవిచ్ఛిన్నమైన సంతృప్తిని సంతోషమును గలుగజేయుచున్నదా? లేదు. రాజాధిరాజులు అనుభవించు సుఖములైనను తాత్కాలికమైనవే. వెంటనే ఏదియోయొక దఃఖమువచ్చి ఆ సుఖములను ఆవరించి వేయుచున్నది. అట్టి చంచల సుఖములకు ఏమైన విలువ యుండునా? అది అంతములతో గూడిన ఆ యింద్రియ సుఖములకు శాస్త్రకారులు ఏమాత్రము విలువ ఇవ్వలేదు. అవి సుఖమును కలిగించినట్లు తోచినను లోన అపారమగు దుఃఖమును కలిగియుండును. కనుకనే గీతాచార్యుడు న తేషు రమతే బుధః — వానియందు తెలివిగలవాడు ఆసక్తి నుంచడు అని సెలవిచ్చెను.

యయాతి రెండు యౌవనముల కాలము అన్ని భోగములను పరిపూర్ణముగ అనుభవించి తుదకు వానిచే వాస్తవమైన శాంతిగాని పూర్ణసంతృప్తిగాని కలుగనే కలుగదని భేరిమ్రోగించి లోకమునకు చాటెను. ఏమియులేని దరిద్రుడు విషయభోగముల దసారము లేదని చెప్పినచో ఆమాటకు లోకము విలువ నొసంగకపోవచ్చును. అది అభావ వైరాగ్యమని త్రోసివేయవచ్చును. కాని ఒక మహారాజు సమస్త భోగభాగ్యములు సకల సంపదలు తన అధీనమందు గలిగియుండి ఒక యౌవనకాలముకాదు వసుగ

రెండుయామ ములకాలము నిరీక్షకుండు సమస్త ఇంద్రియ సుఖములు అనుభవించి తెలిసిన అభిప్రాయమునకు తప్పక విలువనొసంగవలె నను తలచి అతడు లోకమునకు చాటిన అంశమేమనగా— ఓ జనులారా! అనుభవించినకొలది కోరికలు పెరుగుచుండునేగాని తరగవు. నిప్పులో నెయ్యి వేసిన అగ్ని ఇంకను విజృంభించునే కాని తరగిపోదుగదా! అట్లే కోరికలున్ను ఎంత అనుభవించినను చాలు అని అనవే అనవు. ఎన్ని నదులు వచ్చి సముద్రములో పడినను సముద్రము తృప్తినొందనట్లు మనమున్ను ఎన్ని ప్రాపంచిక సుఖముల ననుభవించినను, తృప్తిని శాంతిని పొందజాలకే యుందుము."

కపిలగీతయందు నిర్వాణప్రకరణములో ఒక విద్యాధరునియొక్క ఉపాఖ్యానము చెప్పబడియుండెను. ఒకానొక విద్యాధరుడు వేలకొలది సంవత్సరములు రాజ్యమేలి శత్రువులను జయించి బ్రహ్మాది స్తంబపర్యంతముగల సమస్త సుఖములను కడుపార అనుభవించి తుదకు అసంతృప్తినే వెల్లడించెను. పరిపూర్ణశాంతి, పరిపూర్ణ సుఖము వానివలన తనకు కలుగనేలేదని అతడు బాహాటముగ వెల్లడించి శాశ్వతమగు ఆత్మసుఖమునకై తీవ్రముగ పరితపించెను

ప్రాప్తేన యేన నో భూయః ప్రాప్తవ్య మవశిష్యతే
తత్ప్రాప్తౌ యత్నమాతిష్ఠేత్కష్టయాపి హి చేష్టయా

దేనిని పొందినచో తిరిగి మరి దేనిని పొందవలసినదియు లేదో,

అట్టి శాశ్వత ఆత్మప్రాప్తికొఱకే నిజానందయత్నము చేసినాయ వశెను అని ఆ విద్యాధరునకు తత్త్వోపదేశము చేసిన అభిప్రాయమును లోకమునకు వెల్లడించెను

అట్లే భోగవిలాసములందు మునిగితేలిన భర్తృహరి ఎప్పుడెప్పుడు నేను గంగాతీరమందలి యిసుకతిన్నెలపై గూర్చుండి బద్ధపద్మాసనస్థుడనై దృష్టిని అంతర్ముఖమొనర్చి ఓ గౌరీనాథా! ఓ త్రిపురాంతకా! ఓ శంభూ! ఓ త్రినేత్రా!' అని ఆ పరమ శివుని ఆ ఆత్మారాముని ఏకాగ్రచిత్తముతో ధ్యానింతునో' అని తల్లడిల్లెను. ఈ ప్రకారముగ ఎందరో రాజాధిరాజులు మహాసంపన్నులు అగర్భ శ్రీమంతులు ఈ ప్రాపంచిక సుఖములను ఈ ఇంద్రియార్థములను ఈ విషయ భోగములను తనివితీర అనుభవించి అనుభవించి తుదకు విసుగునకు వచ్చి వానిచే పూర్ణతృప్తినిగాని పూర్ణసుఖమును గాని బొందజాలక వానియన్నింటికి ఒక నమస్కారము పెట్టి వైరాగ్యము నవలంబించి ఆత్మోన్ముఖులైరి ప్రాపంచిక సుఖములు సుఖాభాసములేకాని సుఖములుకావు ప్రతిబింబ సుఖములే కాని బింబసుఖములుకావు రాజస సుఖములే కాని సాత్త్విక సుఖములుకావు పయోముఖ విషకుంభము వలె అని పైకి సుఖముగ కన్పించినను లోన దుఃఖమునే కలిగి యుండును

ఇక్కారణమున [illegible] మహాత్ములందరున్ను ఎట్టి కేవలము బాహ్యదృష్టితో ప్రపంచమును [illegible] తమ తమ

ఇంద్రియములను అంతర్ముఖ మొనర్చి ఆత్మాన దమునకై తీవ్రతరకృషి సలిపిరి నిద్రయందు మనస్సు లయించినపుడు దృశ్యమును మఱచినపుడు జీవుడు ప్రతెంపులేని ఆనందమును అనుభవించుచున్నాడు అట్టి ధ్యానాభ్యాసముచే మనుజుడు అవిచ్ఛిన్నమైన ఆత్మసుఖమును అనుభవించగలడు అయితే నిద్రయందలిది జడస్థితి కాబట్టి బంధరాహిత్యమును గలుగ జేయజాలదు ధ్యానమందలిది చైతన్యస్థితి సమాధిస్థితి కావున బంధమును తొలగించివేయగలదు కావున మహనీ యులు వైరాగ్య విచారణాదులచేతను భక్తిజ్ఞానములచేతను తమ మనస్సును పవిత్రతమ మొనర్చి అతిసూక్ష్మముగజేసి అధిష్ఠానమగు ఆత్మయందు లయింపజేసి అట్టి సమాధిస్థితి యందు పరమానంద మనుభవించుచుందురు అదియే ఆత్మ సుఖము బ్రహ్మానందము అది ప్రతెంపులేనిది అంతులేనిది అదియే జీవుని స్వస్వరూపము అదియే జీవుని జన్మహక్కు. అద్దాని ననుభవించుటకై సర్వులును శీఘ్రముగ యత్నశీలురు కావలయును

చరిత్ర (History) లో అశోక చక్రవర్తిని గూర్చి జనులు వినుచుందురు ప్రతి జీవియు ఒక అశోకచక్రవర్తి యను పరమ సత్యమును ఉపనిషత్తులు ఉద్ఘోషించుచున్నవి దానిని అనుభూతి మొనర్చుకొనినచో ఇక శోకము, దుఃఖము క్లేశము ఆపదలు లవలేశమైనను జీవుని బాధించనేరవు మాశుచః శోకించవలదు అని గీతాచార్యుడు అర్జునునకు

పడే వాతబోధ గాని చి శోకసంవిగ్న మానసుడగు అర్జునుని పరమశాంతిని ప్రసాదించెను గీతాబోధ అర్జునుని శోకరహితుడుగా చేసినప్పుడు ఇక తక్కిన వారిని ఏల శోకరహితులుగా చేయకుండును! తప్పక చేయును ఆ బోధను వినిన చాలును గీతాచార్యుల అమృతోపమ లగు పలుకులను శ్రద్ధాన్వితు లొనర్చిన చాలును.

జీవులు శోకరహితమైన సచ్చిదానందాత్మను తమ స్వయముంద ంచుకొని యున్నప్పటికి పరితపించుచున్నారు. కారణము అజ్ఞానమేయగును బ్రహ్మానందను తమ నిజ స్వరూపమును జ్ఞానము లేకపోవుటయే యగును భగవద్గీతలో సందర్భమున జీవులు ఎందులకు శోకించుచున్నారు? ప్రశ్నకు శ్రీ కృష్ణ పరమాత్మ యిట్లు సమాధాన మొసంగెను

అజ్ఞానేనావృతం జ్ఞానం
తేన ముహ్యన్తి జన్తవః

మేఘముచే సూర్యుడు కప్పబడినట్లు అజ్ఞానముచే స్వరూపమగు ఆత్మ కప్పబడుట వలన జీవులు దుఃఖము పొందుచున్నారు కావున ఇపుడు ఈ భ్రమను తొలగించు కొనుటకు ఉపాయము విచారణచే వివేకముచే ఆ అజ్ఞానము తొలగించుకొనుటయే యగును —

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్

కావున శోకః । ద్రవమును కాటకను సోపాయము శోక వర్జితమగు ఆత్మ తానగాని టవే సుం కన శంకరాచార్యులు అశోచ్యాన్ అను చక్కని పదమును ప్రయోగించి ఓ జనులారా! మీరు వాస్తవముగ శోకి దగనివారు మీరు ఆనగ స్వభావ మీరు చావు పుట్టు కలు లేవు సంసార చక్రమునకు సాక్షియై గలసిల్లు నిత్య శుద్ధ బుద్ధముక్త ఆత్మయే మీరు మీరు దేహము కాదు మనస్సుకాదు దృశ్యవస్తువుకాదు క్షరము కాదు క్షేత్రజ్ఞ డగు ఆత్మయే మీరు అను ఘంటాపథముగ ఉద్బోధించెను ఈ బోధ సంసారదుఃఖపరిమగ్నులగు జనులందరికిని కను విప్పును కలిగించునదై యున్నది

తన శిష్యుడు తన్నుదు దఃఖించుచు తగా వివేకానంద స్వామి పలికి ఈ క్రింది వాక్యములు జనులకు పరమ ధైర్యమును చేకూర్చుచున్నవి

కిం నామ రోదిషి సఖేత్వయి సర్వశక్తిః
ఆమంత్రయస్వ భగవన్ భగదం స్వరూపమ్
త్రైలోక్యమేతదఖిలం తవపాదమూలే
ఆత్మైవహి ప్రభవతి నజడః కదాచిత్

నాయనా! ఎందుల కేడ్చుచున్నావు? నీవు దుఃఖించు వాడవుకాదు నీయందు అఖండమైన శక్తి ఇమిడియున్నది నీ నిజస్వరూపమగు ఆత్మను తెలిసికొని అద్దానిని ప్రకటిం

చుచు ము శ్లోకములున్ను నీ పాదములచెంతనే యున్నది. చైతన్యమగు ఆత్మవే నీవు కాని జడమగు దేహము నీవు కాదు

కాబట్టి జీవుడు దుఃఖరూపుడు కాడ అశోక చక్రవర్తి ఆనంద సామ్రాజ్యమునకు అధిపతి ఆన దచు వ శ్శివోఽహమ్, శివోఽహమ్ అని ఎలుగెత్తి పాడెద నవాడు తన స్వరూపమును మైమఱచి సంసార వ్యామోహములో పడి అనాదికాలమునుండి దుఃఖించుటయే పనిగా పెట్టుకొని జీవ యాత్రను గడుపుచున్నాడు జీవుడు దుఃఖము జీవునకు సహజముకాదు అది ఆగంతుకమ మధ్యలో వచ్చినది మఱి మధ్యలోనే (వివేకముచే) తొలగిపోవును దుఃఖము మనస్సువలన కలుగుచున్నది జీవుని స్వరూపము మనస్సు కాదు మనస్సునకు సాక్షియైన ఆత్మ కనుక దుఃఖము శోకము గినికి అవలనున్నవాడే జీవుడు సుషుప్తిలో మనస్సు లయించుటచే అవిచ్ఛిన్నమైన సుఖమును జీవు డనుభవించు చున్నాడు కదా అట్టి జడస్థితిలోనే అంత ఆనందమును అనుభవించుచుండ ఇక చైతన్యరూపమగు సమాధిస్థితియం దెంత ఆనందమును జీవు డనుభవించును !

కాబట్టి ప్రతి జీవియు తాను మనస్సునకు అవలనున్న ఆత్మవే యని నిరంతరము భావించ యశోధర్మమగు శోకమును పారద్రోలి అశోక చక్రవర్తియై విలసిల్లుచు జీవితమున వసంతమువలె ఆహ్లాదయుతముగ నొనర్చుకొనవలెను

సామాన్యముగ జనులు విషయభోగము లనుభవించి అంతకు మించిన సుఖము ఆనందము లేదని పరమానందపడుచున్నారు ఇంద్రియార్థములగు శబ్ద స్పర్శ రూప రసగంధముల ననుభవించి అవియే జీవితపరమావధిగ తలంచి తృప్తి నొందుచున్నారు కాని వాస్తవముగ వ్యక్తికి కావలసినది బింబ సుఖముగాని ప్రతిబింబ సుఖము కాదు బ్రహ్మానందముకాని విషయానందము కాదు ప్రతిబింబసుఖము ఎంత గొప్పగా కనుపించినను దానికి విలువలేదు స్వప్నమందలి రాజ్య సుఖము మేలుకొనిన పిదప ఎందుకును పనికిరాకయుండును గదా!

వాస్తవముగ జీవు డనుభవించు భోగములు భోగములేనా అను విషయము విచారించవలసియున్నది ఏ ప్రాపంచిక విషయసుఖములకై పగలనక రాత్రనక ఆదేపనిగ జీవుడు పరుగిడుచున్నాడో వాటి వాస్తవ తత్త్వమును ఒకింత పరిశోధించవలసియున్నది దృష్టాంతమునకు ఒకనికి ఆకలి చేసినదనుకొనుడు ఆ ఆకలికి తట్టుకొనలేక అతడు అన్నమును భుజించి పరమానందపడుచున్నాడు ఆ అన్నమును ఆ పిండి వ టలను ఆ ఫలహారములను ఎంతగనో స్తుతించుచున్నాడు గొప్ప భోగము ననుభవించితినని సంతృప్తి పడుచున్నాడు ఇది వాస్తవముగ భోగమేనా విచారించిచూతము ఆకలి అనునది ఒక వ్యాధి ఏ వ్యాధి అయినను కొంతకాలము వచ్చి మరల పోవుచుండును, కాని ఆకలి అను వ్యాధి జీవితపర్యంతము

ప్రాణిని విడిచిపెట్టదు. తక్కిన వ్యాధులు ఎప్పుడో ఒక పర్యాయము వచ్చును. కాని ఆకలివ్యాధి రోజుకు మూడు సార్లు వచ్చుచుండును. ఆ వ్యాధి వచ్చినపుడు దానికి అన్నము అను ఔషధము నొసంగి వ్యాధిని తొలగించుకొనుచుందురు. శ్రీశంకరాచార్యులవారుకూడ ఆకలిని ఒకానొక రోగముగను, భోజనమును తన్నివారణౌషధముగను సాధన పంచకము'న వర్ణించి యున్నారు—

క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం
ప్రతిదినం భిక్షౌషధం భుజ్యతామ్

కాబట్టి భోజన సుఖము వాస్తవముగ క్షుత్ (ఆకలి) రోగ నివారణ సుఖమే కాగలదు. అట్లే దాహము కలిగినవాడు నీటినో సోడానో ఇతర పానీయములనో సేవించి పరమానంద పడుచున్నాడు. ఇచట జరిగినదికూడ రోగనివారణమే. దాహ మను రోగమును పోగొట్టుకొనుటకు పానీయమను ఔషధ మును సేవించెను. అట్లే కామ మనునది ఒక రోగము. అది జీవుని ఆక్రమించినపుడు శృంగారచేష్టలను ఔషధమును సేవించి రోగమును చల్లార్చుకొనుచుండును. ఈ ప్రకారముగ ఆ యా రోగనివారణ కృత్యములు భోగములుగ చలామణి యగు చున్నవి. వాస్తవముగ అవి భోగములుకావు. రోగ నివృత్తి కార్యములే యగును. జనులు తాము భోగముల ననుభవించు చున్నామని సంతృప్తి నొందుచున్నారేకాని వారు వాస్తవముగ గావించునది రోగనివారణ కార్యములే.

ఈ రహస్యమును భర్తృహరి గమనించినవాఁడై —
రోగ శాంతికర కృత్యము భోగమనంగ జెల్లునే!

అని తన వైరాగ్య శతకమున లోకమును నిలదీసి ప్రశ్నించెను వారి గంభీర భావములు ఈ క్రింది శ్లోకమున చక్కగ ప్రస్ఫురించుచున్నవి

తృష్ణా శుష్యత్యాస్యే పిబతి సలిలం శీతమధురం
క్షుధార్తశ్శాల్యన్నం కబళయతి మాంసాది కలితమ్
ప్రదీప్తే కామాగ్నౌ సుదృఢతర మాలింగతి వధూం
ప్రకారం వ్యాధేస్సుఖమితి విపర్యస్యతి జనః

దప్పికచే బాధపడినపుడు మనుజుడు చల్లని మంచి నీరు త్రాగును ఆకలి కలిగినపుడు మంచి భోజన మారగించును కామాగ్ని ప్రజ్వలించినపుడు శృంగార చేష్టలను గావించును. ఈ ప్రకారముగ భోగమును నివారించుకొనుచు దానిని భోగముగ తలంచి పొరబడుచున్నారే జనులు!

కాబట్టి చంచల సుఖములను గొప్పగా తలంచరాదు రోగనివారణ కృత్యములను భోగములుగ భావించరాదు విషయ సుఖములను జీవిత పరమావధిగ నెంచరాదు. అక్షయమైన సుఖము ఆత్మయందే కలదు బ్రహ్మమందే కలదు బాహ్య పదార్థములందు లేద ఉన్నదని తలంచి మోసపోరాదు మహామహారాజులు ప్రాపంచిక సుఖమును అనుభవించి అనుభ

ధించి చివరికి పశ్చాత్తాపపడి పరిపూర్ణ సుఖము బయటలేదని తీర్మానించుకొని అంతర్ముఖత్వమును చేబట్టిరి

యోఽన్త స్సుఖోఽన్తరారామ
స్తథాన్త ర్జ్యోతిరేవయః

అని గీతాచార్యులు సెలవిచ్చినట్లు పరిపూర్ణ అక్షయ సుఖము లోపల ఆత్మయందే కలదు కావున విజ్ఞులగువారు విషయ భోగములకై అఱ్ఱులు చాచక బాహ్య విషయానుభవము నందే కాలము గడుపక శాశ్వత సుఖము ఆత్మయందే బ్రహ్మమునందే కలదని గ్రహించి ఆత్మధ్యానపరులై బ్రహ్మానంద మనుభవించవలయును ఏలయనిన అదియే అన్నిటి కంటెను గొప్పలాభము.

## 2 గొప్ప లాభము

ప్రతి జీవియు లాభమునే కోరుచుండును నష్టమును కాదు సుఖమునే కోరుచుండును. దుఃఖమునుకాదు వర్తకుడు శేరుతోగాని మానికతోగాని ధాన్యమును కొలుచునపుడు లాభం అని మొదలు పెట్టునేకాని ఒకటి అని అనడు అట్లే ఆరువరకు కొలిచి తరువాత ఆరున్నొకటి అని అనునేకాని ఏడు అని అనడు (ఏడవవలసి వచ్చునేమో యని) దీనినిబట్టి ప్రతివాడును తనకు లాభమే కలుగవలెననియు ఏదువు నష్టము కలుగకూడదనియు వాంఛించునట్లు స్పష్టమగుచున్నది. కా

అన్ని లాభములకంటె గొప్పలాభ మేదియో అతనికి తెలియ కున్నది అల్ప లాభముతోనే అతడు సంతుష్టిపడుచున్నాడు.

ప్రపంచవస్తువులు ఎన్ని ఉన్నను అది గొప్ప లాభము కానేరదు ఏలయనగా అవియన్నియు కాల గర్భమున నశించిపోవును. ఇంద్రపదవి చంద్రపదవి బ్రహ్మాండ పదవికూడ పరమార్థ దృష్టితో చూచినచో అల్పమైనవే ఏలయనిన అవియన్నియు కాలక్రమమున క్షయించిపోవునవే కాలముచే గ్రసింపబడని పదార్థము ప్రపంచమున లేనేలేదు

ఒకానొక వ్యక్తి ఒక మహానగరమున ప్రవేశించి దాని సౌందర్యముచే రమణీయత్వముచే ముగ్ధుడై ఆహా! ఈ పట్టణ మెంత శోభాయమానముగ నున్నది! రాజు ఎంత గొప్పవాడైయున్నాడు! రాజసభ ఎంత మనోహర ముగ నున్నది! —అని ఈ ప్రకారముగ స్తోత్రము చేయు చుండగా ఆ వాక్యములను విని ఒక సాధువుగారు ఈ మహానగరమంతయు కాలక్రమమున ఏ కాలముయొక్క కరాళవదనముచే గ్రసించివేయబడనున్నదో అట్టి కాలము నకు నమస్కారము! అని పలికెనట—

సారమ్యా నగరీ మహాన్ స నృపతిః సామంతచక్రం
చ తత్
పార్శ్వే తస్య చ సా విదగ్ధ పరిషత్తాశ్చన్ద్రబింబాననాః

ఉద్వృత్తస్య చ రాజపుత్ర విపదస్తే వర్ధినస్త్వాం కథాః
సర్వం యస్య వశాదగాత్ స్మృతిపథం కాలాయ తస్మై
నమః

కాబట్టి అశాశ్వతములైనవి ఎంత గొప్పగా కనిపించినను అవి అల్పమైనవే యగును ప్రపంచమున శాశ్వతమైనది ఒక్క పరమాత్మయే కావున అదియే అన్నిటికంటెను గొప్ప వస్తువు అట్టాని ప్రాప్తియే అన్నిటికి పెరు గొప్ప లాభము. అదియే గొప్ప ఐశ్వర్యము

గీతాచార్యుడు అర్జునకు బోధసల్పుచు ఓ ధనంజయా! సర్వజీవులయొక్క హృదయాకాశ తరములందు వెలుగు చుచ్చు దానద పరమాత్మయే అన్ని లాభములకంటెను గొప్ప లాభము దానిని పొందినచో ఇక మనుజుడు ఏ యితర లాభమును వాంఛింపడు అట్టి ఆత్మస్థితియందున్నవాడు ఎంతటి ఘోరవిపత్తు సంభవించినను లేశమైనను చలింప నేరడు

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే

అని సెలవిచ్చెను. కాబట్టి దైవదృష్టియందు ఆత్మ యొకటియే సర్వోత్తమలాభమని స్పష్టపడుచున్నది అట్టిచో అద్దానికొఱకై పేల యత్నము సలుపరాదు! సామాన్యలాభముల కొఱకై జీవితమంతయు ధారబోసి కర్మరాశిని పెంచుకొనుచు జనన

ము పత్రిమున ఎ రికల్కొని నానా రూపిలు అను
భవించుచు ఏ ఉత్కృష్ట లాభమైన పరమాత్మను బంధ
బంధరాహిత్యమును బొందకట శ్రేయస్కరము కదా!

ప్రపంచ వస్తువుల విలువకు పరమాత్మయొక్క విలువకు పోలికేలేదు. స్వప్నపదార్థములు ఎంత విలువైనవి అయియున్నప్పటికిని మేలుకొనిన వ్యక్తికి సౌఖ్యమును బడయలేవు. శ్రీకృష్ణతులాభారమందు ఒక్క తులసీదళము సువర్ణ రత్న వైడూర్యాదు లన్నిటికంటెను బరువైనదిగ తేలలేదా? కాబట్టి ప్రపంచ వస్తువేదియు ఆత్మతో సమానము కాజాలదు. అవి యన్నియు ఎంత గొప్పవైనను నశ్వరములగుటంబట్టి క్షుద్రములే యగును. అవివేకియే వానివెంట పరుగిడును గాని జ్ఞాని కాదు.

పరాచః కామాననుయన్తి బాలా
స్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్
అథ ధీరా అమృతత్వం విదిత్వా
ధ్రువమధ్రువేష్విహ న ప్రార్థయన్తే

అని కఠోపనిషత్తునందు యమధర్మరాజు నచికేతునకు బోధించిన చందమున బాలురే (అజ్ఞానులే) క్షణికములగు విషయ భోగముల వెంట పరుగెత్తి తుదకు మృత్యుదేవతయొక్క ప్రచండపాశమునకు వశులగుచున్నారు. ధీరులగు జ్ఞానులు శాశ్వతమగు పరమాత్మనుగూర్చి తెలిసికొని దానినే అన్వే

పించుచుదురు కాని అశాశ్వతములగు ప్రాపంచిక దృశ్య పదార్థములను గాదు

కావున లాభముకోరు ప్రతివారును అన్నిటికంటె గొప్ప లాభమేదియో శాస్త్ర సద్గురూపదేశమువలన చక్కగా తెలిసికొని పరమలాభమగు ఆత్మనుగూర్చియే అన్వేషించి ఆత్మప్రాప్తిచే జీవితమును ధన్యమొనర్చుకొనవలెను

ప్రపంచములో ఎన్నియో సుఖములు లాభములు కలవు కాని అవి యన్నియు శరీరముండునంతవరకే అవి దేహముతో సంబంధము కలిగియున్నవి కావున దేహవియోగముచే వాని వియోగమున్ను సంభవించుచున్నది. విజ్ఞుడగువాడు క్షణికసుఖములను తాత్కాలిక లాభములను ఆశింపడు శాశ్వత సౌఖ్యమునే అతడు కోరును అనంత పరమార్థ లాభమునే అతడు కాంక్షించును

యోగవాసిష్ఠమందు నిర్వాణప్రకరణమున ఒకానొక విద్యాధరుని గూర్చిన గాథ కలదు ఒక విద్యాధరుడు వేల కొలది సంవత్సరములు రాజ్యమును పరిపాలించి తుట్టతుదకు ఈ ప్రకారముగ తన అనుభవమును వెల్లడించెను

ఈ పాంచభౌతిక విషయభోగములన్నిటిని ఇంద్రియ సుఖములన్నిటిని, ఒక సంవత్సరముకాదు రెండు సంవత్సరములుకాదు వేలకొలది సంవత్సరములు అనుభవించితిని.

పిపీలికాది బ్రహ్మపర్యంతముగల భోగజాలమునంతను తనివితీర అనుభవించితిని కాని తృప్తి కలుగలేదు ఇంకను అనుభవించవలెనను కాంక్ష పెరిగిపోవుచున్నది బహుకాలము సామ్రాజ్యమునంతను పరిపాలించినను శత్రుసేనలన్నిటిని పరిమార్చినను అపూర్వమైన వస్తువును దేనిని నేను బడయలేదు తమకు చావులేనంత వరములను బొందినవారు ముల్లోకములను ఏకధాటిగ పరిపాలించినవారునుకూడ చివరకు బూడిదలో కలిసిపోయిరి కాబట్టి ఏది శాశ్వతమో అట్టి పదార్థమునే నేను పొందవలయును దేనిని పొందినచో ఇక పొందదగిన వస్తువేదియు మిగిలియుండదో దేనిని తెలిసికొనినచో ఇక తెలిసికొను వస్తువెయ్యది శేషించియుండదో అట్టి ఆత్మను గూర్చియే ప్రయత్నపూర్వకముగ నేను అన్వేషించవలెను

ఎన్ని కష్టములకోర్చియైనను, ఎన్ని ప్రయాసల నైదు రోర్చియైనను ఆత్మనే నేను పొందవలెను అట్టి ఆత్మనే జీవితాంతములోగా అతడు సాక్షాత్కరించుకొనవలెను

విద్యాధరుని ఈ వాక్యములు ముముక్షువులకు శిరోధార్యములు అవశ్యమాచరణీయములు ఎన్ని వేల సంవత్సరములు రాజ్యమును పరిపాలించి ఎన్ని సుఖములు అనుభవించి అనుభవించి తుదకు వానిలో సారము లేదనియు సారభూతమైనది శాశ్వత సచ్చిదానంద పరమాత్మయేయనియు అతడు చెప్పిన వాక్యములు ఎంతయో విలువగలిగినవై

న్నది కాబట్టి అన్ని లాభములకు కెల్ల గొప్పలాభము పరమార్థ లాభమేయని స్పష్టపడుచున్నది

పూజ చేయునప్పుడు ఈ క్రింది శ్లోకమును జనులు చదువుచుందురు—

లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః
యేషా మిన్దీవరశ్యామో హృదయస్థో జనార్దనః

ఎవరు తమ హృదయములందు జనార్దనుడగు పరమాత్మను ప్రతిష్ఠించుకొందురో అట్టివారికి లాభము జయము కీర్తి లభించును భగవంతునియందు మనస్సును లగ్నముచేయుటయే జీవునకు మహాలాభము దైవలాభమునకు మించిన లాభము ఈ ప్రపంచమున మరేది కలదు! సంజయులవారు గీతాబోధను సమాప్తముచేయుచు ఒక్క శ్లోకములో గీతాసారమునంతను ఇవ్విధముగ తెలియజేసిరి—

యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ

యోగీశ్వరుడగు శ్రీకృష్ణపరమాత్మయొక్క ఉనికి యెచ్చటనో ఎచట భక్తుడగు అర్జునునియొక్క ఉనికి సంభవించునో అచట ఐశ్వర్యము విజయము సంపదలు నీతిలగు నివియన్నియు వచ్చిచేరును కాబట్టి భగవత్సాన్నిధ్యము అన్ని సంపదలకు అన్ని ఐశ్వర్యములకు మూలమైయున్నది

ఒక భక్తుడు తన మనస్సును ఈ ప్రకారముగ సంబోధించుచున్నాడు—

చేతశ్చంచలతాం విహాయ పురతః సంధాయ కోటిద్వయమ్
తత్రైకత్ర నిధేహి సర్వవిషయానన్యత్ర చ శ్రీపతిమ్
విశ్రాన్తిర్హి కిమన్వయహో క్వనుతయో మధ్యే తదాలోచ్య
తామ్
యుక్త్యా స్వానుభవేన యత్ర పరమానందశ్చ తత్సేవ్య
తామ్

ఓ మనస్సా! నీవు నీచపలత్వమును విడనాడి ఒక త్రాసును తెచ్చి అందలి ఒక పళ్ళెమునందు ప్రపంచములోగల సమస్త విషయములను పెట్టుము మఱియొక పళ్ళెమందు పరమాత్మను పెట్టి తూచుము ఏది బరువుగానుండునో ఏది చావగలిగి యుండునో ఏది అతులిత ఆనందము నొసంగునో దేనియందు పరిపూర్ణ విశ్రాంతి నీకు లభించునో దానిని నీవు యుక్తి చేతను స్వానుభవము చేతను బాగుగ తెలిసికొని అట్టి ఆనంద ప్రదమగు పరమాత్మనే ఆశ్రయించి జన్మను కడతేర్చుకొనుము

కావున జనులు ఒకింతవివేకము నాశ్రయించి ప్రపంచములో సారభూతమైన వస్తు వెయ్యదియో చక్కగ గ్రహించి అన్నిలాభముల కంటె గొప్పలాభ మేదియో మహాత్ముల ముఖతః తెలిసికొని, శాస్త్రవాక్యములచే అర్థాని పరిపోషించుకొని స్వానుభవముచే అర్థానిని రూఢిపరచుకొని అట్టి ఆత్మరూప పరమార్థ లాభమునే పడసి బ్రహ్మానందమున

ఓ లాంటిదెను. అట్టి బ్రహ్మానంద మనే ప్రపంచములో అన్నిటి కంటెను చాల విలువైన వస్తువు

ఇండ్లలో విలువైన వస్తువులను ఎవరును బయట ఉంచరు. డబ్బు ఆభరణములు మొదలైన విలువగల వస్తువులను లోన ఇనుపపెట్టియందు భద్రపఱచుదురు. కుండలు చట్లు మొదలైన విలువలేని వాటిని బయట ఉంచుదురు. సముద్రములోన విలువైన రత్నములు ఉండును. సముద్రము బయట నత్తగుల్లలు మొదలైనవి ఉండును. అట్లే దేహము లోపల పంచకోశాంతర్గతమున మహా విలువగల ఆత్మ వెలయుచున్నది. దేహము బయట నశ్వరములగు నామరూపములు నివాసమేర్పరచుకొనినవి. కనుకనే మహాత్ములు బాహ్యదృశ్య వస్తువులయెడల విరాగముగలిగి అంతర్ముఖులై లోనగల పరమాత్మయందు మనస్సును కేంద్రీకరించి అద్దానిని బడసి ధన్యులగుచున్నారు.

ఆత్మ విలువైన వస్తువగుటవలననే అద్దాని ప్రాప్తి కొఱకై కొందరు రాజ్యములనుగూడ తృటిలో త్యజించి వేయుచున్నారు. అలనాడు సిద్ధార్థుడు భగీరథుడు అరిష్టనేమి మొదలైన మహనీయులు తామేలుచున్న గొప్ప సామ్రాజ్యము నుగూడ క్షణములో వదలివైచి ఏకాంతమునకేగి మనస్సును అంతర్ముఖమొనర్చి ధ్యాననిమగ్నులైరి. రాజ్యసుఖమే అన్నిసుఖములకంటె గొప్పదైనచో, అదియే అన్ని లాభముల కంటె గొప్పలాభమైనచో వారు దానినే అంటిపెట్టుకొని

యుండెడివారు వారు దానిని త్యజించివేయుటలోని ఉద్దే
శ్యము దానికంటె గొప్పవస్తువును అన్వేషింపదలంచుటయే
యగును తెలివిగలవారు వృథాగా ఒక వస్తువును పోగొట్టు
కొనరు దానికంటె విలువైన వస్తువు మఱియొకటి ఉన్న
దను కామిా లభించినపుడే వారు దానిని త్యాగమొనర్చివేయు
దురు గీతలో శ్రీకృష్ణపరమాత్మ ఓ అర్జునా! అన్ని లాభ
ములకంటె గొప్పలాభము ఆత్మలాభమే యని చెప్పి ని
యుండెను కనుకనే విజ్ఞులగువారు ప్రపంచములోని సారా
సారములను చక్కగ వివేచించి సారమైన ఆత్మనే గ్రహించి
అనాత్మ వస్తువులకు నామరూపములందు వ్యామోహమును
తొలగించివేయుదురు

పూర్వము పాండవులకు కౌరవులకు యుద్ధము ప్రారం
భము కానున్న సందర్భమున ఒకరోజున అర్జునుడు, దుర్యో
ధనుడు సహాయ మర్థించుటకై ఒకే సమయమున
శ్రీకృష్ణుని యింటికి వెళ్లిరి అప్పుడు శౌరి పరుండియుండుటచే
నిద్రాభంగము కలుగజేయకూడదని తలంచి దుర్యోధనుడు
శ్రీకృష్ణుని శిరస్సువద్ద అర్జునుడు పాదముల చెంత ఆసీనులై
యుండిరి శ్రీకృష్ణుడు లేచి కూర్చొని మొదట పాదముల
యొద్దయున్న అర్జునునిచూచి అర్జునా! ఏల వచ్చితివని
ప్రశ్నించెను. యుద్ధమున దు సహాయమును అర్థించుటకై
వచ్చితినని అర్జునుడు పలికెను. అంతట శ్రీకృష్ణుడు నేను
కావలెనా నా సైన్యము కావలెనా ఏదియోయొకటి కోరు

కోనుమని చెప్పగా పాండవమధ్యముడు కృష్ణునే కోరుకొనెను వెనుకకు తిరిగిచూచి దుర్యోధనుడు కానుకింప దుర్యోధనా! ఏల వచ్చితివని ప్రశ్నింప నీవు సహాయము కొఱకని బదులు చెప్పగా శ్రీకృష్ణుడు నా సైన్యమును తీసుకొందువా అని యడుగ మహదానందముగ నతడు సమ్మతించెను. చైతన్య మూర్తిని అర్జునుడు కోరుకొనెను. జడస్వరూపులను దుర్యోధనుడు గైకొనెను దుర్యోధనుడు కైలుపట్టెలను తీసుకొని వెళ్లెను అర్జునుడు ఇంజనును స్వీకరించి వెళ్లెను తుదకు విజయ మెవరిని వరించినదో చరిత్రయే స్పష్టముగ తేల్చి చెప్పినది కాబట్టి విజ్ఞుడగువాడు ప్రపంచములో సారభూతమైన ఆత్మనే పొందుటకు యత్నించవలెనుగాని అనాత్మవస్తు సంపాదనమునందు కాలమును వ్యర్థము చేయరాదు

సున్నలు ఎన్నియున్నను వానిప్రక్కన ఒకటి అనునది లేనిచో వాటికి విలువయుండునా? అట్లే కాలగర్భమున అంతరించిపోవునవియు ప్రకృతికి అధీనములును, కాలచక్ర కర్మ చక్రములందు తగుల్కొని గిరగిరతిరుగుచున్నవియునగు ప్రాపంచిక దృశ్యపదార్థములకు ఏమాత్రము విలువలేదు చైతన్యమగు ఆత్మయే విలువైన వస్తువు దాని సాన్నిధ్యమందే ఈ ప్రకృతి కదలుచున్నది మెదలుచున్నది కనుకనే బృహదారణ్యకోపనిషత్తునందు ఆత్మా వాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యః మన్తవ్యః నిదిధ్యాసితవ్యః ఆత్మనే చూడవలెను,

వినవలెను మననము చేయవలెను నిదిధ్యాసనము చేయవలెను అని అసందిగ్ధముగ చెప్పబడినది

ఈ ప్రకారముగ ఈ ప్రపంచమున మహా విలువైన వస్తువు ఆత్మయేయని బ్రహ్మమేయని స్పష్టమగుటచే ముముక్షువు లద్దానినిగూర్చి ప్రయత్నము చేసి తమ హృదయమందు దానిని సాక్షాత్కరించుకొని అట్టి దివ్యానుభూతిచే పరమానందమయులై వర్తించవలెను. హృదయమున ఆత్మదీపమును జ్ఞానజ్యోతిని వెలిగించవలయును

## 3 ఆనంద జ్యోతి

దీపమునకు ఒక మహత్తర శక్తి గలదు ఆశక్తి ప్రపంచములోని మరి ఏ యితర పదార్థమునకును లేదు. అంధకారమును పటాపంచలు చేయుటయే ఆశక్తి చీకటిని పోగొట్టగల అపూర్వమైన సామర్థ్యము ఏ వస్తువునకు కలదు! కనుకనే దీపమును జనులు పూజించుచున్నారు దీపమునకు నమస్కరించుచున్నారు దీపమునకు ప్రదక్షిణములు సలుపుచున్నారు దీపములను వెలిగించి పండుగలను జరుపుకొనుచున్నారు దీపమునకు ఎంతయో ప్రాముఖ్యత కలదు కనుకనే ఏ పుణ్యకార్యము ప్రారంభించినను ముందుగా దీపమును వెలిగించియే తరువాతను దీపారాధన చేయక ఏ పూజాకార్యమును ఉపక్రమింపబడదు

దీపమునకు మరియొక విశేషమున్ను కలదు సదా ఊర్ధ్వదృష్టి కలిగియుండుటయే ఆ విశేషము అధోదృష్టి

దానికి తీసేలేదు ఎచ్చోట దీపము వెలిగించినను జ్వాల పైకి పోవునేకాని క్రిందికి దిగదు ఓ జనులారా! ఊర్ధ్వదృష్టి జ్ఞానదృష్టి దైవదృష్టి కలిగియుండుడు! అధోదృష్టిని అజ్ఞాన దృష్టిని పాపదృష్టిని పారద్రోలుడు అని దీపము బోధించు చున్నది

ఈ ప్రకారముగ తనున్నను పారద్రోలుట ఊర్ధ్వ దృష్టిని కలిగియుండుటయను రెండు అనుపమ గుణములను స్వాభావికమైయుండుటచే దీపమునకు పూజ్యభావము ఏర్పడి నది దీపమునుండి మానవుడు గ్రహించవలసిన దీ రెండు పాఠములే. అజ్ఞానమను చీకటిని పోగొట్టుట పాపదృష్టిని విడ నాడుట అను ఈ దివ్యగుణములను చేబట్టినచో ఇక మానవుడు మానవుడుగా నుండడు మాధవుడుగా పరిణమించును. దీపజ్యోతివలె పూజ్యత్వము నొందును. దివ్యప్రకాశమును నలువైపుల వెదజల్లును

అయితే దీపము బయటి చీకటిని పోగొట్టగలదేకాని లోని చీకటిని (అజ్ఞానమును) పోగొట్టలేదు అజ్ఞానమను గాఢాంధకారము జనుల లోతొట్టతొలది జన్మలనుండియు హృదయమునందు పేరుకొని గడ్డకట్టుకొనియున్నది దాని ప్రభావమువలననే ప్రాణులకు చావుపుట్టుకలు భరింపరాని దుఃఖము సంసారయాతనలు కలుగుచున్నవి ఆత్మజ్ఞానమును సంపాదించి ఆ లోని చీకటిని తొలగించుకొనవలసియున్నది

ఆంజనేయులు లంకాపట్టణమును కాల్చివైచినపుడు అర్ధరాత్రి లంకయందంతయు అగ్నిజ్వాలలచే పట్టపగలుగా వెలుగొందినను రావణుని హృదయమందలి చీకటి మాత్రము పోలేదట. కారణము అది బయటి చీకటి కాక లోని చీకటి కా[illegible] మశే ఆ చీకటి దేహాభిమానమే ఆ చీకటి ఆ చీకటిని పోగొట్టుకొనని కారణముచేతనే రావణునకు అధోగతి సంభవించినది

జాతో బ్రహ్మకులేఽ గజో ధనపతిర్భ్రాతా కుంభకర్ణానుజః
పుత్రః శక్రజితః స్స్వయం దశశిరః పూర్ణాభుజా వింశతిః
స్వేచ్ఛః కామచరో రథాశ్వవిజయీ మధ్యే సముద్రం గృహం
సర్వం నిష్ఫలితం తథైవ విధినా దైవే బలే దుర్బలే

బ్రహ్మదేవుని వంశమందు జన్మించినను కుబేరుడు అన్నగా గలిగియున్నను కుంభకర్ణుడు బలశాలి తమ్ముడుగా నున్నను ఇంద్రుని జయించి ప్రతిభాశాలియైన ఇంద్రజిత్తు కుమారుడుగా నుండినను పదితలలు ఇరువది చేతులు గలిగి యున్నను ఆకాశగమనాది సిద్ధులు పొందియున్నను దుర్భేద్యమైన లంకాపట్టణమునకు అధిపతియైయున్నను గొప్ప గొప్ప రథములు గుఱ్ఱములు అస్త్రశస్త్రములు గలిగియున్నను చిత్తశుద్ధిలేని కారణముచేతను, మనో మాలిన్యము తొలగని కారణముచేతను. కామాదులకు హృదయమున ప్రశ్రయ

మొసంగినందుచేతను లోని చీకటిని పోగొట్టుకొనవలనందుచేతను రావణుడు తన జీవితమును నిష్ఫలమొనర్చుకొనెను.

కాబట్టి అజ్ఞానమను పోద్రిక తిమిస్సును పారద్రోలగల జ్ఞాన జ్యోతి మానవునకు ఆవశ్యకమై యున్నది. బాహ్యదీపము అట్టి జ్ఞానజ్యోతికి ప్రతీకమాత్రమే అయియున్నది. బాహ్య దీపమును వెలిగించి అంతటితో పరితృప్తినొందరాదు. జీవితముయొక్క ప్రధానలక్ష్యము హృదయమున జ్ఞానదీపమును వెలిగించుటయే యగును. అట్లు వెలిగించుటయే వాస్తవమగు దీపావళి కాగలదు. ఇక అజ్ఞాన దీపమును ఆనంద జ్యోతిని ఎట్లు వెలిగించవలెనో వెలిగించు పద్ధతి యేదియో తెలిసి కొందము.

దీపమును వెలిగించుటకు నాలుగు వస్తువులు ఆవశ్యములై యున్నవి. అవి ప్రమిద నూనె వత్తి అగ్గిపెట్టె. ఈనాలిగింటిలో ఏది లేకున్నను దీపము వెలుగదు. అట్లే వైరాగ్యమను ప్రమిద భక్తియను నూనె చిత్తైకాగ్రతయను వత్తి తత్త్వవిచారణయను అగ్గిపెట్టె యున్నచో జ్ఞానమను దీపము చక్కగ వెలిగి అజ్ఞానమను అంధకారమును పటాపంచలు చేసి వేయగలదు. సామాన్యదీపము నిలుచుటకు ప్రమిద యెట్లు మూలాధారమైయున్నదో అట్లే జ్ఞానదీపము వెలుగుటకు వైరాగ్యమనునది మూలాధారమైయున్నది. మనస్సు ఏవిధమైన వైరాగ్యభావనలేక ప్రాపంచిక విషయభోగములకై

బహిర్ముఖముగ పరుగిడి పోవుచున్నచో అది దైవమం దెట్లు నిలకడ కలిగియుండగలదు ?

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృత చేతసాం
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే

భోగైశ్వర్యములందు ఆసక్తిగలిగి వానిచే అపహృతమగు మనస్సు గలవారికి ఆత్మధ్యానమందు ఏకాగ్రత కుదరనే కుదరదని గీతాచార్యుడు ఘంటాపథముగ చెప్పియెను.

కాబట్టి జ్ఞానదీపము చక్కగ వెలుగుటకు వైరాగ్యాది సాధన సామగ్రిని ముముక్షువు తప్పక సంపాదించుకొనవలెను. ప్రమిదలో దీపము వెలుగుచున్నను ద్వారములగుండా లేక కిటికీలగుండా గాలి లోనికి వీచినచో అది ఆరిపోవుటకు అవకాశమున్నట్లును దీపమును సంరక్షించుకొనదలచినవారు ఆయా ద్వారములను మూసివేయునట్లును జ్ఞానదీపమును సంపాదించుకొనినవారు ఇంద్రియములగుండా విషయవాయువులు లోన ప్రవేశించకుండ బహుజాగరూకులై యుండవలెను. లేకున్న ఎంతో ప్రయాసతో సంపాదించిన జ్ఞానము క్రమక్రమముగా అదృశ్యమైపోగలదు. ఈ విషయమును శ్రీకృష్ణ పరమాత్మ గీతయందలి స్థితప్రజ్ఞ లక్షణములను వివరించునపుడు స్పష్టముగా పేర్కొనియుండెను.

ఈ ప్రకారముగ జ్ఞానదీపమును వెలిగించుటయే వాస్తవముగ దీపావళి అర్థమును గూర్చి ఏమాత్రము పరిజ్ఞానము

లేక దృశ్యప్రపంచమే సత్యమనుకొని అజ్ఞానసముద్రమున మునకలిడుచుండు జనులు పరిపూర్ణ శాంతిసుఖములను బడయవలెనన్న ఏనాటికైనను జ్ఞానజ్యోతిని వెలిగించియే తీరవలెను

తమసో మా జ్యోతిర్గమయ

తమస్సు (చీకటి) నుండి జ్యోతిలోనికి నన్ను తీసుకొని పొమ్ము అను ప్రార్థనయొక్క అంతర్యమిదియే. ఎన్ని కోట్ల జన్మలనుండియో జ్ఞానగంధ మేమాత్రములేక ఈ జననమరణ ప్రవాహమునబడి ఈ ఘోరసంసృతియందుబడి సుడిలో చిక్కుకొనిన పురుగువలె నానాయాతనలు పొందుచు చీకటిలో కొట్టుమిట్టాడుచుండు జీవుడు ఈ మానవ జీవితమందు ఆత్మప్రకాశములో ప్రవేశించి పూర్ణసుఖమును బడయుట బాధాకరమగు జన మరణ సంసృతికి భరతవాక్యము పలుకుట భావ్యమైయున్నది

కాబట్టి బయటి చీకటి పోవుటకై దీపమును వెలిగించు విధమున లోని చీకటిని (అజ్ఞానమును) పోగొట్టుటకై జ్ఞానదీపమును వెలిగించవలెను. ఎంతకాలమునుండియో హృదయక్షేత్రమున కామాదిరాక్షసులు గూడుకట్టుకొని కాపురముండియున్నారు. ఇప్పుడు పరమాత్మను లోనికి ఆహ్వానించి ఆ రాక్షసులను తరిమివేయవలెను. ప్రకాశమున్నచోట చీకటియుండుటకు సాహసింపదు పలాయనము చిత్తగించును. అట్లే దైవప్రకాశముచెంత అజ్ఞానాంధకారము నిలవనే నిలవదు క్షణము పారిపోవును.

ఆగమార్థంతు దేవానాం ।
గమనార్థంతు రక్షసాం

ఓ దేవతలారా! రండు! ఓ రాక్షసులారా! పొండు అని పూజాశాలయందు వ్రాసిన మంత్రము చాలా సముచితముగ నున్నది కాబట్టి శాంతికాముకులైన మన ముముక్షువులు పరమాత్మను తమ హృదయములోనికి ఆహ్వానించవలెను ఈ సందర్భమున ఒకానొక భక్తుడు చెప్పిన ఈ క్రింది శ్లోకము ఉల్లేఖింపదగియున్నది

క్షీరసార మపహృత్య శంకయా ।
స్వీకృతం యది పలాయనం త్వయి
మామకే మమ ఘనాంధతామసే ।
నందనందన కథం న లీయసే

ఓ బాలకృష్ణా! వెన్నదొంగిలించుట మొదలైన చిలిపి చేష్టలు చేయునపుడు యశోద నిన్ను కొట్టవచ్చిన సమయమున ఆమెకు చిక్కకుండా పారిపోయి ఎక్కడో చీకటి ప్రదేశములో నీవు దాగుకొన ప్రయత్నించుచుందువు ఆ చీకటి చోటు ఎక్కడ ఉన్నదాయని నీవు ఆలోచించ నక్కరలేదు. నా హృదయమున బహు జన్మలనుండియు చీకటి (అజ్ఞానము) కాపురముండుచున్నది కృష్ణా! రమ్ము! దయచేయుము! నా హృదయపీఠము నధిష్ఠింపుము! అట్లు చేసినచో నీకు

మకోరద దెబ్బలు తప్పిపోవును నాకు పట్టిన తిమిస్ర వదలి పోవును (నా హృదయమందలి చీకటి తొలగిపోవును)

భగవంతుడు ప్రకాశస్వరూపుడు వారి సాన్నిధ్యమందు చీకటి ఉండుటకు అవకాశమే లేదు కాబట్టి ప్రతివారును ప్రయత్నపూర్వకముగ తమ హృదయమందు జ్ఞానదీపమును వెలిగించుకొనవలెను మానవజన్మయొక్క చరమలక్ష్యమిదియే

నూనె లేనిచో ప్రమిదలోని దీపము ఆరిపోవును కరెంటు లేనిచో ఎలక్ట్రిక్ దీపము ఆరిపోవును ప్రళయకాల మేతెంచినచో సూర్యుడు చంద్రుడు నక్షత్రములు అను జ్యోతులు ఆరిపోవును. మరి ఈ ప్రపంచమున ఆరిపోని దీపమేది? నిరంతరము ఏకధాటిగ ప్రకాశించునదేది? ఎన్ని ప్రళయములు సంభవించినను ఎన్ని అవాంతరములు తటస్థించినను అవిచ్ఛిన్నముగ అప్రతిహతముగ నిత్యతేజోవిరాజితంబై వెలుగునదేది? అదియే ఆత్మ అదియే బ్రహ్మప్రకాశము అదియే పరంజ్యోతి దానికి ఆది లేదు అంతములేదు దానిని వెలిగించువారు లేరు ఆర్పగలవారు లేరు. అది ఏనాటికిని ఆరునదియు కాదు ఆ జ్యోతి ఉన్నందువలననే ఈ సూర్యాది జ్యోతులన్నియు ప్రకాశించుచున్నవి

తమేవభాన్త మనుభాతి సర్వం
తస్యభాసా సర్వమిదం విభాతి

అని ఉపనిషత్తులు ఈ సత్యమునే ఉద్ఘాటించుచున్నవి వేదము లన్నియు ఈ అఖండ దీపమునే వేనోళ్ళ సంస్తుతించు చున్నవి అదియే జీవుని వాస్తవ స్వరూపము దాని నెఱుంగుటయే జీవిత లక్ష్యము దానిని సాక్షాత్కరించుకొనుటయే జీవిత పరమావధి ఆ పరమాత్మ దీపములకు దీపము

లోకము జాగ్రత్తులో ఉన్న దీపము స్వప్నమున ఉండదు స్వప్నములో ఉన్న దీపము సుషుప్తిలో ఉండదు కాని ఈ ఆత్మదీపము ఈ పరంజ్యోతి జాగ్రత్స్వప్న సుషుప్తు లందింటియందును నిర్వికారముగ అవిచ్ఛిన్నముగ వెలుగొందుచున్నది అట్టి చైతన్యదీపము నాశ్రయించినచో అదియే తన నిజస్వరూపమను యనుభూతి కలుగుటతో ఇక జీవునకు దుఃఖము లవలేశమైనను ఉండదు అఖండానందము యొక్క అనుభవము కలుగును మానవజీవిత మేర్పడినది అట్టి దివ్యానుభవము కొఱకే యగును

తృటిలో మోక్షము కలుగజేయుడని ప్రార్థించిన ఒక వృద్ధునకును శ్రీ శంకరాచార్యులకును మధ్య జరిగిన ఈక్రింది సంభాషణము ఈ సందర్భమున పేర్కొనదగియున్నది

శంకరులు  ఏ ప్రకాశముచేత నీ వీ దృశ్య వస్తువుల నన్నిటి తెలిసికొనుచున్నావు ?

వృద్ధుడు  పగలు సూర్యుని ప్రకాశముచేత రాత్రి చంద్రుని యొక్కయు, నక్షత్రములయొక్కయు దీపాదుల యొక్కయు ప్రకాశముచేత

ఆ సూర్యాదులను దేనిచే తెలిసికొనుచున్నావు?

నేత్రములచే

ఆ నేత్రములను దేనిచే తెలిసికొనుచున్నావు?

బుద్ధిచే

ఆ బుద్ధిని దేనిచేత తెలిసికొనుచున్నావు? (ఆ బుద్ధిని ప్రకాశింపజేయుచున్న దేది?

ఆత్మవలన

ఆ ఆత్మయే సర్వప్రకాశకము అదియే నీ యథార్థ స్వరూపము అదియే నీవు. అట్టి నీ నిజస్వరూపమందు నిలకడ కలిగియుండుము. సమస్తదుఃఖములు తొలగి పోగలవు అదియే దుఃఖరహితమగు పరమానందస్థితి అదియే మోక్షము.

ఈ ప్రకారము శ్రీ శంకరాచార్యులవారు కాటికి కాళ్లు జాపుకొనియున్న ఆ వృద్ధుని కనికరించి సూక్ష్మములో మోక్షమును తెలియజేసిరి

జ్యోతిషామపి తజ్జ్యోతిః
తమసః పరముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం
హృది సర్వస్య ధిష్ఠితమ్

అని గీతాచార్యులు సెలవిచ్చినట్లు జ్యోతులకు జ్యోతియై దీపములకు దీపమై తమస్సునకు పరమై జ్ఞానమూర్తియై జ్ఞేయస్వరూపమై ప్రతి ప్రాణియొక్క హృదయకోశమున విరాజిల్లుచుండు ఆత్మజ్యోతిని గూర్చి చక్కగ తెలిసికొని భక్తి వైరాగ్య విచారణాది సాధనల ద్వారా అద్దానియందు నిలకడ కలిగియుండుటయే జీవుల కర్తవ్యము జను లీసత్యమును ఎంత శీఘ్రముగ గ్రహించిన అంత శ్రేయస్కరమై యుండగలదు

భారతీయులు జరుపుకొను పండుగలలో దీపావళి చాల ప్రముఖమైనది ఆనాడు జనులు శుచిర్భూతులై దీపములను వెలిగించి పూజించెదరు దీపమును పూజించుటలోగల అంతరార్థమేమియో యోచించెదము చీకటిలో సామాన్యముగ ప్రతివారును అనేక బాధలు పడుచుందురు ఏ వస్తువు ఎక్కడున్నదో తెలియక పొరపాటువలన తికమక పడుచుందురు. ఇటునటు వెతకుటలో కాలునకు ఏదైనా బల్లగాని కుర్చీగాని కిటికీగాని కొట్టుకొనవచ్చును తలకు గోడ తగలవచ్చును. ఇట్టి పరిస్థితిలో ముందుగా దీపమును వెలిగించుటకే ప్రతివాడును ప్రయత్నముచేయును. ఇతర పనులన్నిటిని ఆపివైచి దీపమును వెలిగించు కార్యమందే అత్యంత దత్తచిత్తుడై యుండును ఏలయనగా ఆ ఒక్క కార్యముచేతనే అంధకారజనితములైన బాధలన్నియును సమసిపోవును

వాస్తవముగ చీకటి అనునదొక్క వస్తువుకాదు, వెలుగు యొక్క అభావమే చీకటి. కాంతియొక్క రాహిత్య మేచీకటియొక్క ఉనికి. కావున చీకటిలో కల్గుచు ప్రతిబంధకములు ఆపదలు దుఃఖములు బాధలు అన్నియు తొలగిపోవలె ననిన ఇతరములగు ఏ ఉపాయములున్న పనికిరావు. దీప సాధన ఒకటియే శరణ్యము. ఆ ఒక్క కార్యముచే దీపాభావమువలన కలుగు బాధలన్నియు నశించిపోవును.

అట్లే ప్రపంచములో జీవు డనుభవించుచున్న బాధలన్నిటికిని కారణము అజ్ఞానమే అయియున్నది. అజ్ఞానమనగా నేమి? తాను కాని పదార్థము తానని తలంచుటయే అజ్ఞానము. తాను వాస్తవముగ దేహముకాదు, ఇంద్రియములు కాదు, మనస్సుకాదు. తాను కాని ఉపాధిని తానని తలంచుట ఒకదోషము. తాను అయియున్న ఆత్మను విస్మరించుట మరియొక దోషము. వీనినే విపరీతభావన, అసంభావన అనియు అందురు. ఈ రెండిటియొక్క సమ్మేళనమే అజ్ఞానము. అనగా తన స్వరూపమగు ఆత్మను విస్మరించుట, తానుకాని దేహామును తానని తలంచుట—ఇదియే అవిద్య అజ్ఞానము.

ఈ అజ్ఞానముయొక్క ప్రభావముచేతనే జీవునకు అగణితములైన సాంసారిక దుఃఖములన్నియు దాపురించుచున్నవి. తత్ప్రభావము వలన జీవుడు సంసారమను సుడిగుండమునపడి దిక్కుగానక సతమతమై పోవుచున్నాడు. ఇట్టి సందర్భమున అతనికి తరణోపాయమేది? ఆత్మజ్ఞానమొక్కటియే సంసార

దుఃఖము లన్నిటికిని హేతుభూతమైన అవిద్యను మూలాజ్ఞానమును పటాపంచలు చేయగలిగిన శక్తి ఒక్క ఆత్మజ్ఞానమునకే కలదు.

చీకటే అజ్ఞానము వెలుగే జ్ఞానము దీపకాంతిలో మనుజునకు దెబ్బలు తప్పిపోవునట్లు జ్ఞానప్రభవముచే సాంసారిక బాధలు మటుమాయమైపోవును. కనుక శాంతిసుఖముల నపేక్షించు ప్రతివానికి ఆత్మజ్ఞానము అవశ్యము ఉండితీరవలెను దానిచే దేహాభిమానము తప్పనిగ దుఃఖములు తొలగిపోయి ఆత్మానుభూతి తప్పనిగ పరమానందము లభించును.

చీకటిని పోగొట్టు దీపములలోకూడ తరతమ భేదములు కలవు ప్రమిద దీపము కొద్దిసేపుండును చేతిలాంతరు ఇంత కొంతసేపుండును ఎలక్ట్రిక్ బల్బు కరెంటు ఉన్నంతవరకు వెలుగుచుండును ప్రళయ కాలమువరకు సూర్య చంద్రాది దీపములు వెలుగుచుండును. కాని ప్రళయ కాలమునకూడ నశింపక జాగ్రత్ స్వప్న సుషుప్తులందును తురీయమందును ఎల్లప్పుడుకూడ ఏకరీతి అవిచ్ఛిన్నముగ వెలుగుచుండు దీపమొకటి కలదు అదియే ఆత్మ అదియే బ్రహ్మము. అదియే పరంజ్యోతి దానికి పుట్టుక లేదు నాశములేదు మార్పు లేదు వికారములేద హెచ్చుతగ్గులులేవు అట్టి నిర్వికార పరంజ్యోతియగు పరమాత్మయను దీపమును ఆరాధించవలెను. తన హృదయమునందు ఆత్మరూప పరంజ్యోతిని సేవించవలెను

తన యంతరంగమున అహర్నిశములు దేదీప్యమానముగ వెలుగుచున్న సచ్చిదానందబ్రహ్మతేజముయొక్క అనుభూతిని బడయవలెను. ఈ ప్రకారముగ అజ్ఞానరూప ఆవరణమును విచ్ఛిన్న మొనర్చుకొని అనేక జన్మలనుండి తగులుకొని యున్న సంసార బంధమునుండి జీవుడు విముక్తుడు కావలయును.

## 4 బంధవిముక్తి

పూర్వ మొకానొక గజమును భయంకరమైన మొసలియొక్క బారినుండి తప్పించి విష్ణుభగవానుడు కాపాడెనని భాగవతమునందు పేర్కొనబడిన విషయమును సామాన్యముగ ప్రతివారున్ను తెలిసికొనియే యున్నారు. రావే ఈశ్వర! కావవే వరద! అను ఆ గజేంద్రునియొక్క హార్దికమైన ప్రార్థనయే దానిని ఘోరమగు ఆ విపత్తునుండి రక్షించెను. దానియొక్క సత్ప్రయత్నమే అద్దానిని కాపాడెను.

అట్లే జీవుడను గజము జననమరణరూపమైన బురదలో చిక్కుకొని అనాదికాలమునుండి బహుయాతనల నొందు చున్నది. సంసారమను ఊబిలో దిగబడి అందుండి బయటకు రాజాలక గిలగిల తన్నుకొనుచున్నది. చావుపుట్టుకలమధ్య ఊగిసలాడుచున్నది. ఇట్టి గజములు ప్రపంచమున ఒకటికాదు రెండుకాదు కోటానుకోట్లు కలవు. అట్టి అగణిత గజేంద్రు

బహుగార్చి వసిష్ఠమహర్షి పలికిన ఈ క్రింది వాక్యములు అత్యంత ప్రాముఖ్యత కలిగియున్నవి—

అహంకార మహాలానం
తృష్ణారజ్జుం మనోమదమ్
జన్మజంబాల నిర్మగ్నం
జీవద న్తినముద్ధరేత్

అహంకారమను కట్టుకంబమునకు కట్టబడినదియు తృష్ణ యను త్రాటిచే బిగింపబడియున్నదియు మనస్సను మదధారలు కలదియు జననమరణములను బురదలో కూరుకొని యున్నదియునగు జీవుడను ఏనుగును బంధనమునుండి విడుదలచేసి సముద్ధరింపవలయును.

శ్రీవసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు హితవాక్యముల నుపదేశించెను. నేను దేహమును అని తలంచుటయే జీవునకు ఒక గొప్ప బంధనము. కనుకనే అట్టి దేహాభిమానమను అహంభావమును ఒక కట్టుకంబముగా వసిష్ఠమహర్షి వర్ణించెను. జీవుడు వాస్తవముగ ఆత్మయే కాని దేహముకాదు ఆసాక్షియేకాని దేహము కాదు ఈ తత్త్వమును తెలిసికొనని కారణముచేతనే అనాది కాలమునుండి అతడు జడమైన దేహముతో తాదాత్మ్యము నొందుచు అద్దాని లక్షణములను తనపై ఆరోపించుకొనుచు పరమదుఃఖమును పొందుచున్నాడు జనన మరణములకు లోనగుచున్నాడు. కాబట్టి

తాను ఆత్మయేకాని దేహమెన్నటికిని కాదను జ్ఞానమును సద్గురువుల ద్వారా సచ్ఛాస్త్రములద్వారా తెలిసికొని జీవుడు అజ్ఞానమను కట్టుకంబమునుండి విడుదల పొందవలయును ఇదియే గజేంద్రమోక్షము యొక్క అంతరార్థము

ఇట్టి విముక్తి జీవునకు తనయొక్క సత్ప్రయత్నముల వలననే లభించును ధైర్యముతో మాయను ఎదుర్కొని వివేకముచే భోగజాలమును దులిపివైచి ట్టుబడలతో ఇంద్రియములను స్వాధీన పఱచుకొని అనాదికాలమునుండి తన్ను పెనగొట్టుచుండిన వాసనా సమూహమును ఎదిర్చి నిలబడి ఎట్టకేలకు ఆశత్రువులందఱిని జయించివేయవలెను పట్టుపురుగు తనచుట్టు తానే దారము అల్లుకొని బంధనములో చిక్కుకొనునట్లు జీవుడు తన అజాగ్రత వలననే సంసారబంధనమును కొనితెచ్చుకొనినాడు ఇప్పుడు కష్టము తెలిసికొని తన తప్పిదమును తాను గుర్తెఱిగి వివేకముతో కూడినవాడై తన బంధవిముక్తిని తానే కలుగజేసికొనవలయును.

బురదలో కాపురము చేయుటకు ఏ గజమున్ను ఇచ్చగింపదు. కట్టుకంబమున బంధింపబడుటకు ఏ కరీంద్రమును వాంఛింపదు అంకుశము తన నెత్తిపైనుండుటకు ఏదంతియు కోరుకొనదు అట్లే వివేకవంతుడగు ఏ మానవుడున్ను జన్మజరాపంకమున నిమగ్నమగుటకుగాని సుఖదుఃఖములచే ఈడ్వబడుటకుగాని, ప్రకృతికి పరాధీనుడై త్రొక్కబడుటకుగాని అంగీకరింపడు ద్వంద్వాతీతమగు తన నిరంజన ఆత్మస్వరూపమున

తిగలిగి నిరతిశయానందమును పడయుటకే వాంఛించును
జేంద్రుడు తన ప్రయత్నాతిశయముచేతను భక్తి
శవశ్యముచేతను మోక్షమును బడసిన చందమున
తిమానవుడున్ను తన విముక్తి కొఱకై ఈ జన్మ
ందే గొప్ప అధ్యవసాయమును అవలంబించవలయును.
యత్నశీలురచే సాధింపరానిది ఈ ప్రపంచమున ఎద్దియును
డనేరదు మోక్షము కేవలము గజేంద్రునివరకే పరిమితమై
ుండలేదు సమస్త మానవులును, వెయ్యేల సమస్తభూత
ట్లును అట్టి మోక్షపదమును బడయుటకు పరిపూర్ణమగు
క్కార కలిగియున్నారు కాబట్టి త్వరపడి సర్వానుకూలము
నే శోభిల్లు ఈ మానవజన్మయందే అట్టి విడుదలను
ధించివేయుట ఉత్తమము అట్లు సాధించువారే ధన్యులు,
తార్థులు

రాత్రిపూట ఎలుకబోను సమీపమునకు ఎలుకవచ్చి
దుంచబడిన భోజ్యపదార్థముయొక్క ఘుమఘుమ వాసనను
రముపుండియే ఆఘ్రాణించుచు, ఆ రుచికరపదార్థమును
రముపుండియే వీక్షించి దాని యాకర్షణకులోనై,
ఒడబోలికలలో నూగిసలాడుచు పరుగు పరుగున లోప
వేశించును. అట్లు ప్రవేశించి ఆహా! ఈ రోజు ఎంత
నము! ఎటువంటి రుచికర భోజ్యపదార్థము నాకు లభించి
! అని మురిసిపోయి మెల్లగా దాని చెంతకరిగి నోటితో
పదార్థమును కొఱకును. తత్క్షణమే బోనుతలుపు పడిపోవును.

చప్పుడికి ఎలుక దద్దరిల్లి పోవును వెంటనే ఆ తినుబండార మును వదలిపెట్టి బోనులో ఇటునటు తిరుగాడును. కాని బయటకు పోవుటకు మార్గము కనబడదు పారిపోవుటకు దారి లేనందున దానికి కానరాకుండును. నేను బంధనమున తగుల్కొంటిని అని పూర్ణముగ నిశ్చయించుకొనిన ఆ ఎలుక ధవిము క్రై ప్రయత్నించునే కాని సమీపమున ఉన్నప్పటి ఆ భోజ్యపదార్థమును కాంక్షింపకుండును. ఇదియే గొప్ప చిత్కారము

ఏ పదార్థముకొఱకై కోట్లక్షణముల క్రిందటనే లెస్సగ తపించానో దేని తన జీవితముయొక్క సర్వస్వముగ ఎంచానో అట్టి రుచికర వస్తువు చెంతనే యున్నప్పటికిని మహాచిరము అజ్ఞానిని అపేక్షింపక "ఎట్లు తప్పించుకొందునా" అని మాత్రమే విచారించుచుండును దీనికి కారణము తాను బంధనమున ఉన్నట్లు తెలిసికొనుటయే.

అట్లే జనులలో పెక్కురు మోక్షముకొఱకై ప్రయత్నము సలుపకుండుటకు కారణము వారు బంధనమున ఉన్నామని తెలిసికొనక యుండుటయే యగును మాకు బంధనమేయును లేదు మేము స్వాతంత్ర్యులము అని జనులు తలంచుచున్నారు. వాస్తవముగ దేహమును ధరించుటయే బంధనము. చావు పుట్టుకలందు తగుల్కొనుటయే బంధనము కాల క్రియలకు లో డియు డుటయే బంధనము

నాలుగు బారల పొడవుగల ఒక పాంచభౌతిక జడపదార్థము (శరీరము)నందు చిక్కుకొనిపోవుట బంధనము కాక మరియేమి! కొద్ది సంవత్సరముల పరిమితిగల కాలము (ఆయుస్సు) నకు లోబడియుండుట బంధనముకాక మఱియేమి? అట్లే తాను చేసిన కర్మకు వశుడై సుఖదుఃఖములమధ్య ఊగిసలాడు చుండుట బంధనముకాక మఱియేమి?

వీనినుండి తప్పించుకొనుటకై ప్రయత్నించువాడే మానవుడు మా అనగా అజ్ఞానము. న అనగా లేకుండ వ అనగా వర్తించువాడే మానవుడు బంధవిముక్తికై అన వరతసాధన గావించువాడే మానవుడు అనిత్యమై దుఃఖ ప్రదమైనట్టి ఈ లోకమున జన్మించిన ప్రతిప్రాణి నిత్యమై సుఖప్రదమైనట్టి వస్తువేదియో చక్కగ విచారించి అద్దానిని బడయుటకై నిర్విరామముగ ప్రయత్నించవలెను.

అనిత్య మసుఖం లోకమిమం ప్రాప్య భజస్వమామ్ అని గీతాచార్యుడు పేర్కొనిన చందమున ఈ ప్రపంచమున జన్మించిన ప్రతి మానవుడు శాశ్వత పరమాత్మ కొఱకై అన్వేషించుట ధర్మము ఏలయనగా వివేకవంతు డైనవాడెన్నడు అనిత్యవస్తువును దుఃఖకర వస్తువును కాంక్షించడుగదా! ఈ ప్రపంచమున శాశ్వతవస్తువు ఒక్క పరమాత్మయే సమస్త ప్రాణికోట్లయొక్క హృదయాంతరాళమున వెలు గొందు సచ్చిదానంద పరబ్రహ్మమే శాశ్వతవస్తువు అద్దాని కొఱకై అన్వేషించి నశ్వరదేహము తాను కాదని నమ్మి అట్టి

శాశ్వత పరమాత్మయే తానని గ్రహించి అహర్నిశములు ఆ స్వస్వరూపమున నెలకొని యుండుటయే సాధనము. అదియే శాశ్వత కైవల్యము

కాబట్టి తాను జననమరణ రూప బంధమున తగుల్కొని యున్నాడనియు ఎన్నిజన్మలనుండియో పుట్టుట, చచ్చుట గర్భనరకాదులను అనుభవించుట మొదలగువానిచే విసికి వేసారియున్నాడనియు దేహరూప ఉపాధిని గ్రహించి నందువలన కర్మవశాత్తు సంభవించు నానావిధ యాతనలను అనుభవించవలసి వచ్చుచున్నదనియు గ్రహించి ఈ బంధనమునకు ఈ బానిసత్వమునకు కారణము అజ్ఞానమే యనియు స్వస్వరూప విస్మృతియే యనియు తలంచి జ్ఞానప్రాప్తిచే అట్టి అజ్ఞానమును తెగద్రుంచివేసి నిరంతర స్వస్వరూప ఆత్మస్థితిచే పరమానందమును జీవు డనుభవించవలెను. [illegible] తాను బంధమున నున్నానని గుర్తించి బంధవిముక్తికై తీవ్రతర యత్నము నాచరించవలెను. ప్రాపంచిక భోగవిలాసములకు స్వస్తిచెప్పి మనస్సును అంతర్ముఖముగ త్రిప్పి ధ్యానాద్యనుష్ఠానములచే ఆత్మయందు నెలకొల్పి మహత్తర బ్రహ్మానందానుభూతిని బడయుచుండవలెను. ప్రయత్నపూర్వకముగ మాయను జయించవలెను. మాయ యొక్క స్వరూపమేదియో ఈ సందర్భమున ఒకింత విచారించెదము

1 భగవంతుని మఱచుటయే మాయ. ఆత్మస్వరూపమును విస్మరించుటయే మాయ.

2. జడమగు దేహమును శాశ్వతమని యెంచి అదియే తానని భావించుటయే మాయ

3. కల్పితమగు జగత్తును సత్యమని తలంచుటయే మాయ.

4. సత్యమగు భగవంతుడు లేడని భ్రమించుటయే మాయ

5. నిత్యశుద్ధ బుద్ధ ముక్తమగు ఆత్మను మరచుటయే మాయ

6. దుఃఖమిశ్రితమైన విషయసుఖము గొప్పదని తలంచి దాని వెంట పరుగిడుటయే మాయ

7. ఉన్నది లేదనియు లేనిది ఉన్నదనియు తలంచి లేనిదానికై ప్రాకులాడుటయే మాయ

8. దారాపుత్రాదులు, బంధుజాలము ఎల్లప్పుడు తనవెంట వచ్చుదురని భావించుటయే మాయ

9. ఇంద్రియములకు దాసానుదాసుడై అవి చెప్పినట్లు నడచుటయే మాయ

10. బహుజన్మార్జిత దుష్టవాసనలకు లోబడి వాటి ప్రేరణలకు లొంగిపోవుటయే మాయ

11. స్వల్ప సుఖముకొరకై అనంత దుఃఖమును కొనితెచ్చుకొనుటయే మాయ

12. తాను చేయునది తప్పని తెలిసియు దానినే చేయుచుండుటయే మాయ

13 ఈ [illegible] గానిక పరిరయిక నిశ్చయముగ చూచుటయే మాయ

14 ఎన్ని యోగకార్యములను చేయుచున్నను మొట్టమొదట తానెవరో తెలిసికొనకపోవుటయే మాయ

15 అనిత్యమైనదానిని నిత్యముగను అపవిత్రమైనదానిని పవిత్రముగను దుఃఖభూయిష్టమైనదానిని సుఖవంతముగను, అనాత్మ వస్తువును ఆత్మగను, తనకంటె వేఱుగ నున్న దానిని తన రూపముగను భావించుటయే మాయ

ఈ పదునైదు విధములగు మాయలన్నియు చేరి మహామాయగా పరిణమించి అనాదికాలము నుండియు జీవుని వేధించుచున్నవి. కంటికి పొరయున్నచో ఎదుటనున్న వస్తువెట్లు గనబడదో కల్లు త్రాగినవాడు మైకముచే నెట్లు తప్ప బడునో అట్లే మహామాయచే నావరింపబడినవాడున్ను సత్యవస్తువును కనుగొనలేకయున్నాడు. మాయాజనిత భ్రాంతిచే నావృతుడై అతడు విశ్వమును మరియొక రీతి గాంచుచున్నాడు. తాను గాంచినదే సత్యమని వాదించుచున్నాడు. ఇదియంతయు మాయయొక్క ప్రభావమే అయియున్నది. మాయ తగులుకొని యున్నంతవఱకు జీవునకు శాంతిలేదు సుఖములేదు.

మమ మాయా దురత్యయా — నా మాయ భయంకరమైనది దాటుటకు కష్టసాధ్యమైనది — అనియు మోహితం

నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ దానిచే కప్పబడిన వాడు మాయాతీతమైన అవ్యయమగు నా స్వరూపమును తెలియజాలడు — అనియు ఈ మహామాయను గూర్చి శ్రీకృష్ణపరమాత్మ గీతయందు చెప్పియున్నాడు. అయితే దానిని గురించి ఎవరును భయపడ నక్కఱలేదనియు — మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే నన్ను (పరమాత్మను) ఆశ్రయించినవారు ఈ మాయను అవలీలగ దాటివేయగలరనియు భగవానుడు ధైర్యము చెప్పెను

కావున మాయ అనగా నట్టిదో దానిని తొలగించుకొనుట ఎట్లో మానవుడు తప్పక తెలిసికొనవలసియున్నాడు. జనులలో నానాతరగతులవారు కలరు. కొందరు మాయచే కప్పబడియున్నను ఆ విషయమును తెలియకయే యుందురు. ఇట్టి కారణమున వారు అజ్ఞాన నివారణమునకై ఒకింతైనను ప్రయత్నము చేయకుందురు. వీరు కనిష్ఠులు. మఱికొందరు తాము మాయచే, అజ్ఞానముచే కప్పబడియున్నట్లు తెలిసికొనియు దానిని తొలగించుకొనుటకై ఒకింత ప్రయత్నమాచరించి లక్ష్యమును చేరకయే తమ ప్రయత్నమును విరమింతురు. వీరు మధ్యములు. ఇక మూడవతరగతివారు తమ్ము కప్పియున్న మాయను విచ్ఛిన్న మొనర్చుటకై తీవ్రతర సాధనల నొనర్చుచు విజ్ఞాన వైరాగ్యాది అస్త్రశస్త్రములచే దానినెదుర్కొని దాని దర్పమును అణంచి మాయాఛేదనమను తమ లక్ష్యమును ఈ జీవితమునందే సాధించివైచి అపరోక్ష

రహితులై ఆత్మ ప్రకాశమయులై పరమానందయుతులై వెలుఁగొందుచుందురు వీరు ఈ త్రిమూర్తులు

మాయయొక్క స్వరూపమును చక్కఁగ నెఱింగి దాని ఎత్తులను యుక్తులను నిశితబుద్ధితో బాగుగ గమనించి శత్రువుయొక్క బలము ఎచట కేంద్రీకృతమై యున్నదో వివేకముతో గ్రహించి కీలు తెలిసికొని వాతపెట్టినట్లు అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్త్వా అని భగవానుడు పేర్కొనినట్లు అసంగరూప విజ్ఞానాస్త్రముచే సమూలముగ మాయాభంగ మొనర్చి ఉత్తమమానవుల తరగతిలో చేరుటకే కృతనిశ్చయులు కావలయును. ప్రయత్నరహితులైయున్నవారిని మాయ ఒక ఆట ఆడించును. వారి అంతు చూచును. వారిని ఎంత ఏడిపించవలెనో అంత ఏడిపించును. దాని దుష్ప్రభావముచే కన్నీళ్లు కాలువలై విలపించిన వారెందరో కలరు. జీవితము పరమ దుర్భరమైపోయి ఆత్మహత్యకు కూడ పాల్పడిన వారెందరో కలరు. కాబట్టి మాయయొక్క స్వరూప మెట్టిది ! దాని బెడదను తప్పించుకొను మార్గము లెయ్యవి ? దానిని సమూలముగ విధ్వంస మొనర్చుటకు ఉపాయమేమి ! అను విషయములను ప్రతిమానవుడును ఈ జీవితమునందు తప్పక తెలిసికొనవలసి యున్నాడు

ప్రతి దినము రాత్రి నిద్రించిన తరువాత ఒక విచిత్రమైన అనుభూతి మనలకు కలుగుచుండును. అదియే స్వప్నము. ఆ స్వప్నకాలమున ఏదేని కనుపించుచుండునో అన్నిభూత

మఱచుచు ఎన్నో అని ...లయు ఆ సమయమున సత్యముగనే తోచుచు ఉండును. మేల్కొనిన పిదప ఆ కలయు అసత్యమని తెలిసిపోవును. ఒకానొకకి స్వప్నమున గొప్పనష్టము సంభవించినట్లుగాని వాని తగుల్కొనినట్లుగాని ఎంతో జంతువులు తరుముకొనివచ్చుచున్నట్లుగాని అనుభవము కలిగినచో అతడెంతయో పరితాపపడుచుండును. అతని గుండె దడదడలాడుచుండును. ఆ రాత్రి అతడు పొందు శరీరక్లేశము మనఃక్లేశము చెప్పతరముకాదు. ఆ దుఃఖయంతయు తొలగుటెట్లు? ఏ ప్రక్రియచేత ఆక్లేశమంతయు సమూలముగ అంతరించి పోగలదు? మేల్కొనుటయే ఆప్రక్రియ. మేల్కొనినవానికి స్వప్నమందలి బాధలన్నియు తుడిచిపెట్టుకొని పోగలవు. ఇతరమైన నివారణసాధనములన్నియు తాత్కాలిక ఉపశమనమును కలుగజేయునేకాని శాశ్వత దుఃఖరాహిత్యమును కలుగజేయజాలవు.

అట్లే మహామాయచే గ్రసింపబడిన ప్రతిజీవియు వాసనావశమున ఆయా శరీర ఇంద్రియ మనోబుద్ధ్యాదిరూప ఉపాధిద్వారా ఒకానొక దృశ్యప్రపంచమును వీక్షించుచున్నాడు. ఉపాధినిబట్టి మనస్సునుబట్టి ఇంద్రియములను బట్టి వాసనలనుబట్టి ఆయా దృశ్య ప్రపంచము కూడ వేఱువేఱుగ కాన్పట్టును. దేవతలకు ఒక విధముగను మానవులకు ఒక విధముగను జంతువులకు ఒక విధముగను, కృమికీటకాదులకు ఒక విధముగను ఆ ప్రపంచము దృగ్గోచరముగ

చుండును. ఇదియంతయు సత్యమని వారువారు భావించుచు ఆ ప్రపంచమున తాము సంభవించు సుఖదుఃఖానుభూతు లన్నియు సత్యములని తలచుచు సుఖముచే పొంగిపోవుచు దుఃఖముచే కుంగిపోవుచు చంచల అశాంతికర జీవిత మును గడుపుచున్నారు. ఈ అశాంతికి నివారణోపాయ మేమి? మేలుకొనుటయే. అనగా జ్ఞానమును బడయుటయే. సమ్యక్ జ్ఞానమును బడయని తనకు స్వప్నలోకమం దనుభవించిన ఏదియో యొక దుఃఖము జీవుని వెన్నంటుచునే యుండును. తన యథార్థ స్వరూపమును (ఆత్మను) తాను ఎంత శీఘ్రముగ తెలిసికొనిన సంసార దుఃఖము అంత శీఘ్రముగ అంతరించిపోగలదు. శ్రీ శంకరాచార్యులవా రీవిషయమును ఈ క్రింది శ్లోకముద్వారా చక్కగ విశదీకరించి యున్నారు —

విశ్వం దర్పణదృశ్యమాననగరీతుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా
యః సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే

ఈ ప్రపంచము అద్దములో ప్రతిబింబించిన పట్టణము వలె కానుపించుచున్నది. వాస్తవముగ ఇది అసత్యమైనను సత్యముగ తోచుచున్నది. ఎట్లనిన నిద్రాసమయమున మన జాడం తనయందే ఒకానొక లోకము కల్పించుకొనుచున్నది.

గాని తనకంటె బయటను తనకంటె వేఱుగను చూచుచు టి సత్యమని భ్రమించుచు నున్నాడు మేలుకొనిన పిదప లోకము తనకంటె అన్యముకాదనియు తనయందే మాయచే ల్పింపబడినదనియు నెట్లు తెలిసికొనుచున్నాడో అట్లే జాగ్రత్తునందు కానుపించు ప్రపంచమున్ను సత్యముగ ోచినను జ్ఞానప్రాప్తి సమయమున తనయందే కల్పితమైన ను వాస్తవముగ తనకంటె అన్యము కానట్లును చేవుడు లిసికొనగల్గుచున్నాడు. అట్టి మహోన్నతజ్ఞానమును ప్రసా దించు గురుదేవుడగు శ్రీ దక్షిణామూర్తికి నమస్కారము."

అట్లే ఆత్మబోధ యను గ్రంథమునందును శ్రీ శంకర గవత్పాదులవారు ఈ స్వప్నదృష్టాంతమును అత్యంత రోచక ుగ ప్రతిపాదించినారు.

సంసారస్స్వప్నతుల్యో హి
రాగద్వేషాది సంకులః।
స్వకాలే సత్యవద్భాతి
ప్రబోధేఽసత్యవద్భవేత్

"అనేక రాగద్వేషములతో గూడిన ఈ సంసారము (ప్రపంచము) స్వప్నమువలె నొప్పియున్నది. ఇది అజ్ఞాన కాల మున సత్యముగా తోచినను జ్ఞానము కలిగినపుడు కేవలము వ్యర్థము అని తెలిపోగలదు."

ఆధ్యాత్మ విద్యాక్షేత్రమునం దీ స్వప్నదృష్టాంతమునకు గొప్ప ప్రాముఖ్యత కలదు కనుకనే ఆత్మానుభూతిని బడసిన మహనీయులు తరచు తమ రచనలందు తమ ప్రబోధములందు ఈ దృష్టాంతమును విస్పష్టముగ నుదహరించుచుందురు యోగవాసిష్ఠమున వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు నుపదేశించునపుడు ఈ స్వప్నదృష్టాంతమును దాదాపు వందపర్యాయములు చెప్పియుండవచ్చును దీనిలో నున్న విశేషమేమనగా ప్రతివారికి ప్రతిదినము ఏదియో యొక సమయమున ప్రత్యక్షముగ అనుభవమునకు వచ్చుచునేయుండును కళ్ళార జూచిన వస్తువులు ప్రత్యక్షముగ కానుపించిన లోకము ఒక్క క్షణములో కానరాక అదృశ్యమై తిరోహితమై పోవుచుండును కనుకనే ఈ స్వప్నదృష్టాంతము ఆధ్యాత్మ ప్రబోధములందు మహోపయుక్తమైనది శక్తివంతమైనది ప్రత్యక్షముగ వస్తువులు కానుపించినప్పటికిని అది కల్పితమేయని ఋజువు చేయుటకు ఈ స్వప్న దృష్టాంతమునకు మించిన దృష్టాంతము వేరొకటి లేదు కాబట్టే గురువులు తమ శిష్యులకు పరమార్థవిద్యను బోధించునపుడు దీనినే ప్రధానముగ ఆశ్రయించుచున్నారు

ఈ జగన్మాయయు స్వప్నమువలె జనులను వంచించి సంసార మహార్ణవమున జనన మరణ రూపములగు సుడిగుండములన వారిని పడద్రోసి యమయాతనలను పెట్టుచుండ విజ్ఞుడగువాడు గ్రుడ్లప్పగించి చూచుచు ఊరకయుండగలడా? వెంటనే

సద్గురువుల వివరించి ఈ మాయామేఘమును ప్రభంజ నము వలె బ్రహ్మజ్ఞానమును బట్టి తీరితమును గృహస్థ మొనర్చుకొనుడు కానవలో తన నిజస్వరూపమేదియో ఈ జగత్తు ఏకేర్పడినదో ఈ జగద్భ్రాంతి ఎట్లు తొలగ గలదో ఈ మొదలైన విషయములన్నిటిని చక్కగ తెలిసికొని గురూపదిష్ట మార్గము ననుసరించి సాధించి తరించుడు అట్లు చేయనిచో ఈ మహామాయ ఛంకను ఎన్నిరో జన్మలు జీవుని వెంట బడి వేధించగలదు కాబట్టి విజ్ఞులెల్లరు శుభస్య శీఘ్రం అనునట్లు పరమార్థక్షేత్రమున వెంటనే అడుగులిడి అకుంఠిత దీక్షతో గొప్ప అధ్యవసాయముతో స్వస్వరూప విచారణాది సాధన లవలంబించి స్వప్నదృష్టాంతము మొద లైనవానిని గుణించి చక్కగ పర్యాలోచించి మాయతో ప్రకృతితో అవిద్యతో అజ్ఞానములో జరుగు ఈ భీషణ సంగ్రామమున విజయమును జేబట్టుదురుగాక!

పెద్దల సాంగత్యముచే మాయయొక్క మర్మమెంతెం తేలు తెలిసికొని వాతబెట్టునట్లు ఆత్మజ్ఞానముయొక్క సహాయ ముచే ఆ మాయను అంతమొనర్చి ఆత్మసామ్రాజ్యమునకు అధినేతలై వర్తించవలయును

ప్రపంచములో లేనిది ఉన్నట్లు ఎచటనైన గోచరి చునా? గోచరించును. ఇంద్రధనుస్సు రజ్జుసర్పము ఆకాశ నీలత్వము స్వప్నపదార్థములు ఎండమావులలోని జలము నదీ జలమందు ప్రతిబింబించిన తీరస్థవృక్షాదులు స్థాణుపురుషుడు

ఇంద్రియములయందలి వస్తువులు మెదడైనవన్నియు గొప్పవిగ
చేసినప్పటికిని ఆ దృష్టి గోచరమగును వానికొరకై తెలివి
లయ్యేవాడు ప్రయత్నించునేకాని తెలివికలవాడు కాదు
ఆ పదార్థములన్నియు నేత్రములకు ప్రత్యక్షముగ కానుపించి
నను, వివేకవంతునకు వానియెడల గ్రాహ్యబుద్ధి ఉదయించదు.
కారణము అవి యథార్థముగ లేనివనియు అతనికి తెలియును
కాబట్టి ఒక వస్తువును గ్రహించుటకు ముందుగా అది సత్య
మైనదా, కాదా? దానివలన మనుజునకు శాంతిసుఖములు
కలుగునా, లేదా? దానిలో సుఖమెంత? దుఃఖమెంత?
మానవజీవితమునకు అది ఎంత ప్రయోజనకరము? — ఈ
మొదలగు ప్రశ్నలను వేసికొనవలసియుండును. వివేకవంతు
డగువాడు చేయదగిన మొట్టమొదటి పని యిదియే.

ప్రదృశ్యతే వస్తుని యత్ర దోషః
న తత్ర పుంసోఽస్తి పునః ప్రవృత్తిః

అని కాళిదాసు వచించిన విధముగ పదార్థమునందు దోషము
కానుపించినచో ఇక దానియెడల మనుజునకు ప్రవృత్తి సంభ
వింపదు. దానియందలి ఆసక్తి నశించుటచే ఇక ఆకర్షింపబడడు.

ఈ దృశ్యప్రపంచమునందలి సమస్త పదార్థములందును
రెండు దోషములు కలవు. అవి స్వతస్సిద్ధముగ వానియందు
కలవేకాని ఒకరు కల్పించినవి కావు, బలాత్కారముగ ఆపా
దించినవికాని కావు. అవియే (1) నశ్వరత్వము (2) పూర్ణ

సుఖరాహిత్యము. ప్రపంచ మందలి ఏ వస్తువుకూడ శాశ్వతముకాదు. రేపో మాపో నశించిపోవును. కాలగర్భమున శీర్ణమై శీర్ణమై పోవును — ఇది ఒక దోషము. రెండవది ప్రపంచమందలి ఏ పదార్థమున్ను పూర్ణసుఖమును కలుగజేయజాలదు. ఏ ఒకింతసుఖము దానియందు తోచినప్పటికిని అది కాలక్రమమున దుఃఖముగా పరిణమించుటగాని అదృశ్యమైపోవుటగాని సంభవించుచున్నది. కనుకనే శ్రీకృష్ణభగవానుడు గీతయందు దృశ్యపదార్థములందలి ఈ రెండు దోషములను ఈ ప్రకారముగ వేలెత్తి చూపించెను

1) అనిత్య మసుఖం లోకమ్
2) దుఃఖాలయ మశాశ్వతమ్

మఱియొక సందర్భమున దుఃఖదోషానుదర్శనమ్ అని పలికి ఓ అర్జునా! దృశ్యపదార్థములందుగల క్షణికత్వ దుఃఖజనకత్వాది దోషములను మరల మరల చింతన చేయవలయును అని ఉద్ఘాటించెను

కాని మాయాప్రభావముచే జనులు దృశ్యపదార్థములందు నిగూఢములైయున్న ఈ దోషములు ఏమాత్రము కానవచ్చుటలేదు. అందుచేతనే వారు వానివెంట పరుగిడుచు అహర్నిశములు ఆ ప్రతిబింబ సుఖములకొఱకే జీవితమును వెచ్చించుచు అమూల్యమైన మానవజీవితమును వ్యర్థపఱచుచున్నారు.

అహో అజ్ఞజనాజ్ఞతా!

ఆహా! అజ్ఞానుల ఈ మోహవిలాసము ఎంత ఆశ్చర్యకర మైనది! అని (శ్రీ) శంకరాచార్యులవారు మాయాప్రవాహమున కొట్టుకొని పోవుచున్నవారిని జూచి విస్తుపోయిరి 'మోహముద్గరము' అను శీర్షికతో వారు కొన్ని చక్కని శ్లోకములనుకూడ వ్రాసి మాయపై గదాప్రహారమును గావించిరి

మాయకు లోబడుట అజ్ఞుల కార్యము మాయను తెలిసికొని దానిని మటుమాయము చేయుట విజ్ఞుల కార్యము మాయకు లోబడినవాడు ప్రకృతికి దాసుడై అది చెప్పు చేతలలో మెలంగుచుండును. మాయను జయించినవాడు ప్రకృతిని ధిక్కరించి సాక్షాత్ పరమేశ్వరుడై మెలయు చుండును. మాయకు వశుడైనవాని దృష్టికి ఈ ప్రపంచ మందలి భోగవిలాసములు ఎంతరో ఆకర్షణీయములుగ గన్పట్టును. అవి యన్నియు శాశ్వతములని రమణీయములని సుఖవంతములని అతడు తలంచుచుండును. వాని తళుకుబెళుకు లకు లోబడిపోయి పగలనక రాత్రనక వానికొరకే ప్రాకు లాడుచుండును. అట్టివాడు కాలురేయని శాస్త్రములు ఘోషించుచున్నవి —

వరాదః కామాపమయ న్తి బాలాః

తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్

అని కఠోపనిషత్తు తెలుపుచు విషయసుఖములను వెన్నంటు వారు బాలురేయనియు వారు మృత్యువుయొక్క పాశమునకు లోబడి యుందురనియు ఘంటాపథముగ పేర్కొనెను.

బాలా ఏవాత్తుమిచ్ఛన్తి
ఫలం ముకురబింబితమ్

అద్దములో ప్రతిబింబించిన ఫలమును భుజించుటకై పరుగిడు వాడు బాలుడే కాని విజ్ఞుడెట్లగును? కాబట్టి మాయయొక్క మర్మమును తెలిసికొని ఈ జగత్పదార్థములు మనకల్పితములే యని తేటగ నెఱిగి వానియెడల అహోరాత్రములు పరుగుమను పాడు చేయక ఆ మనస్సునకు అధిష్ఠానమై ఆ మనస్సునుకూడ వెలిగించునదై ఆ మనస్సునకు సాక్షియై తనరు తన ఆత్మస్వరూపమునుగూర్చి ఒకింత పరిజ్ఞానము కలిగి అద్దానియందు కొంతసేపైనను నిలకడ కలిగియుండుటను అభ్యసించినచో జీవితము ఆనందదాయకమై చెన్నొందగలదు. మనస్సుయొక్క కదలికయే బంధము మనస్సుయొక్క నిశ్చలత్వమే మోక్షము కావున మనముకూడ మాయకు వశుడుకాక ప్రతిదినము కొంతకాలమైనను ధ్యానశీలురై మనస్సును బహిర్ముఖముగ పోనీయక, అంతర్ముఖమొనర్చి ఆత్మయందు స్థాపించుటను బాగుగ అభ్యసించవలెను. జీవితముయొక్క పరమావధి ఆత్మసాక్షాత్కారమే యని జ్ఞప్తియందుంచుకొనవలెను. మానవునియొక్క ధర్మము

లను గాఢముగ ... శాయుకో కలా
త్రయున్ని చవికొను

పూర్వము నొక యక్షుడు ధర్మరాజును ఈ ప్రశ్నా రమ ప్రశ్నించెను. ... ప్రపంచమున ఆశ్చర్య కరమైన విషయమేది? ... అన్నిటి కంటె ఆశ్చర్యకరమైన విషయమేది? ఆ ప్రశ్నకు యుధిష్ఠి రుడిట్లు సమాధానము చెప్పెను —

**అహన్యహని భూతాని గచ్ఛన్తీహ యమాలయమ్**
**శేషాః స్థావరమిచ్ఛన్తి కిమాశ్చర్యమతః పరమ్**

ప్రతిదినము ఎందఱో ప్రాణులు యమసదనమునకు పోవు చున్నారు (చనిపోవుచున్నారు) కాని తక్కినవారు మేము మాత్రము అట్లు పోవువారముకాదు ఆచంద్రతారార్కముగ ఇక్కడే పడియుందుము అని తలంచుచుందురు ఇంతకు మించిన ఆశ్చర్యకరమైన విషయము మఱియొకటి యేది కలదు? — మాయాప్రభావముచే జనులకు అనిత్యమైనది నిత్యముగా తోచుచుండును. వివేక జ్ఞానముచే అనిత్య మును అనిత్యముగను నిత్యమును నిత్యముగను వీక్షించుటను అభ్యసించువారి జీవితము ప్రకాశమయముగ నుండును తక్కినవారి జీవితములు అంధకార బంధురముగను దుఃఖభూం. వముగను నుండును జనకమహారాజు విచారణచే ఇ

సమ్యక్ జ్ఞానమును తెన్నగ బడసి వ్యవహార నిమగ్నుడై యున్నప్పటికిని పరమశాంతిని బడయగల్గెను

ప్రయాతాః పాంసువద్భూపాః కా ధృతిర్మమ జీవితే

నేను మహారాజును నా తండ్రి మహారాజు నా తాత మహారాజు నా ముత్తాత మహారాజు అయితే ఆ నా పితరులందఱును ఇపు డెచటి కేగినారు? కాలమను ఝంఝామారుతమున ధూళికణములవలె వారందఱును కొట్టుకొనిపోయిరి ఇక నా జీవితమా శాశ్వతము? ఇట్టి అల్పజీవితమున అహంభావమేల? ఈ రాజ్యమును గూర్చిన సంపదలను గూర్చిన డంబమేల? ఇవన్నియు ముణ్ణాళ్ళ ముచ్చటలు వీనిని గూర్చిన వ్యామోహ మేమాత్రము కలిగియుండరాదు ఇవి అశాశ్వతములు శాశ్వతమైన ఆత్మనుగూర్చి తెలిసికొనుటయే మానవుని కర్తవ్యము అట్టి ఆత్మజ్ఞానమే మానవునకు పరిపూర్ణశాంతిని ప్రసాదింపగలదు — ఈ ప్రకారముగ విచారణ చేసి జనకమహారాజు జ్ఞానమును బడసినవాడై ఐహికపదములందు వ్యామోహమును త్యజించివైచి మహోన్నతమగు మోక్షపదవిని చేబట్టెను

మారునియొక్క పన్నాగములకు జనకుడు మోసపోలేదు విచారణాబలముచే వాని సైన్యాని విజయమును గాంచెను. అట్లే బుద్ధదేవుడున్ను మారుని జిత్తులకు ముందుగనే తెలిసికొని సమ్యక్ జ్ఞానముచే వానినన్నిటిని పడగొట్టివైచి మహత్తరమగు నిర్వాణ పదవిని అలంకరించెను. దృష్టిని

సమయముగ నొసర్చుకొని తత్త్వభావముచే ఉన్నదానిని న్నట్లుగను లేనిదానిని లేనట్లుగను తెలిసికొని అమ్మహానీ ఖలు దుశ్ఛేద్యమగు మాయాశృంఖలమును విచ్ఛిన్న మనర్చి పరమశాంతిని బడసిరి తక్కినవారు కూడ ఆ ప్రకా శ జ్ఞానాంజనముచే మాయాతిమిరమును పోగొట్టుకొని పంచమును బ్రహ్మమయముగ గాంచుటను అభ్యసించినచో నితమును ఆనంద డోలికలలో నూగునట్లు చేసికొనగలరు

అయితే సాధకులు తమ సాధనయందు అతిజాగరూకులై ర్తించవలెను ఏమరుపాటు పనికిరాదు టార్చిలైటు వెలుగు న్నంతవరకు చీకటి దరిదాపునకు కూడ రాకూడదు. లైటు పివేసే తడవుగా ఎక్కడనో దాగుకొనియున్న తమస్సు క్కున్మదివచ్చి మీదపడును నీటిలో స్నానము చేయ ంచినవాడు పాచిని ప్రక్కకునెట్టి మునిగి పైకి లేచినచో రల వెంటనే పాచివచ్చి ఆవరించును

యథా ప్రకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి
ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖమ్

శ్రీ శంకరాచార్యులవారు వివేకచూడామణిలో ఈ సత్య నే నిరూపించియుండిరి శ్రీ వసిష్ఠ మునీంద్రుడున్ను రామచంద్రునకు ఈ రహస్యమునే బోధించుచు మాయా షయమున బహు జాగరూకులై యుండవలెనని ఈ క్రింది థను ద్వారా హెచ్చరిక చేసెను —

శివ నామహితం చిత్తం కామః కవల ముష్యతి
సావధానస్య బుద్ధస్య ఆశా కః కిం కరిష్యతి

ఓ రామచంద్రా! ఎరింగుము అహంకారమునన్నను కామాది పిశాచము! అన్నింటిని మించి అనూంతముగ మోదనపి బ్రహ్మగిరిపైచును కా... జాగ్రతగనుండవలెను సావధానచిత్తుడై యుండని మామా పిశాచము ఏమియు చేయగలేద

కాబట్టి సాధకుడగువాడు విచారణచే వస్తుతత్త్వమును చక్కగ తెలిసికొని జడమును జడముగను చైతన్యమును చైతన్యముగను గుర్తించి నశ్వరములగు దేహాది దృశ్యపదార్థములపై మమత్వమును వ్యామోహమును విడనాడి ప్రాపంచిక విషయభోగముల యెడల విరాగభావమును గలుగజేసికొని మాయను దరికి చేర్చక సత్యమగు ఆత్మయందే మనస్సును నెలకొల్పి దివ్యమగు ఆనందానుభూతిని శీఘ్రముగ బడయుటకై యత్నశీలుడు కావలయును. మాయ తనయందు కల్పితమైన మిథ్యా వస్తువేయని నిశ్చయించి బలీయమగు ఆ మాయకు లొంగక దానికి అతీతుడై వర్తించవలెను. మాయా విజయమే మానవతకు చిహ్నము.

## 5 జన్మ సార్థకత

అది మహాభారత సమయము. కురుక్షేత్ర రణరంగమున ఘోరాతిఘోర యుద్ధము జరుగుచుండెను. వ్యాసులవారు ఆ

ఏ ఆ పోవుచుండం గా ఒక అపూర్వ
? ది వ్యాస వారు పోవుచున్న దారిలో
ను ఒక చిన్న పురుగు అతివేగముగ ప్రతికూ
వకు అడ్డముగా పోవుచుండెను వ్యాసులవారికి
కలిగినది ఈ చిన్నప్రాణి ఇంత వేగముగ ఇంత
ల ఎదురీదుచున్నది? దీనికి కారణమేమి? అని
సమీపమునకేగి మాట్లాడు శక్తిని దానికి
యిచ్చి సత్తము డిట్లు ప్రశ్నించెను — ఓ పురుగు
ఏ త దర! ఇ త వేగిరపాటుతో ఏల పయ
? అందుకు పురుగిట్లు సమాధాన మొసం
త్మా! తమకు తెలియనిది ఏమున్నది? దూర
మార్గముపై ఒక రథము అతివేగముగ వచ్చు
గనుక నెమ్మదిగా పోయినచో ఆ రథచక్రముల
పోవుదును కాబట్టి అదిరాక పూర్వమే ఈ
దాటివేయదలంచి త్వరితముగ పోవుచున్నాను
ను విని వ్యాసు లిట్లు ప్రశ్నించిరి — ఓ కీటకమా!
చిన్నప్రాణివి కదా! నీకు కూడ ప్రాణముమీద
? అప్పుడు పురుగు ఇట్లు సమాధాన మొసంగె

త్మా! తాము అంతయు తెలిసి వారు నేను
న్నది? అయినను తమ అజ్ఞకు బద్ధుడై నా
లను తమ ముందు వ్యక్తపఱచుచున్నాను —

ప్రాణికోట్లలో విషయసుఖములందు సంబంధించినంతవఱకు చిన్న
పెద్ద అను తేడా ఏమీ లేదు. అందఱు జీవులు కర్మచే బద్ధులై
సుఖము దుఃఖము అనుభవించుచున్నారు. మానవులు దేవ
తలు విషయసుఖము లెట్లు అనుభవించుచున్నారో అల్ప
ప్రాణులమగు మేమున్ను అట్లే అనుభవించుచున్నాము.
స్వాదిష్టమగు వస్తువును భుజించునప్పుడుగాని రమణీయమగు
వస్తువును సందర్శించినప్పుడుగాని మనుష్యు డెట్లు ఆనంద
మనుభవించునో అట్లే మేమున్ను అనుభవించుదుము. మాన
వుల కెట్లు సంతానము కలదో మాకున్ను కలదు. పెద్దలా!
ప్రాపంచిక సుఖమునకు సంబంధించినంతవఱకు మేము మాన
వులు దేవతలు అందఱూ ఒకటే! పురుగు పలికిన ఆ గంభీర
వాక్యములను విని వ్యాసులు సంతుష్టమానసులై అచ్చోట
వీడి చనుచు ఆ సంఘటనను పురస్కరించుకొని ఆ ముని
వర్యుడు తదుపరి లోకమున కీ ప్రకారముగ తన సందేశమును
వినిపించెను —

ఓ మానవులారా! ఓ ఉత్తమ జన్ములారా! విషయ
సుఖమే ప్రాణుల చరమ లక్ష్యమైనచో వారు మానవులుగా
పుట్ట నవసరం లేదు. ఏ క్రిమికీటకములుగ జన్మించినను పరవా
లేదు. అచటకూడ లోకమంతటి విషయసుఖము కలదు. అచట
కూడ ఇంద్రియార్థములను శబ్దస్పర్శాదులను చక్కగ అనుభ
వించుటకు అవకాశము కలదు. మానవజన్మయే పరమార్థము
తెలిసికొనుటకు ఏర్పడినది. స్వస్వరూప సాక్షాత్కార

మొదల్చుకొని జన్మసార్థకత బడయుటకే మానవజన్మ భగవంతునిచే ప్రసాదింపబడినది అట్టి అమూల్య జన్మను క్రిమికీటకాదు లనుభవించు ఐహికసుఖముల కే వెచ్చించుట పాడికాదు పనికిరానిపనులందు పాడుచేయుట న్యాయముకాదు. దుర్వ్యసనములకు లోను చేయుట ధర్మముకాదు లెండు! తెలిసికొనుడు! ఆత్మసాక్షాత్కారమను నిజ కర్తవ్యమును సాధించి సార్థకజన్ములు కండు!

బాదరాయణుని ఈ దివ్యసందేశము జనులకు కనువిప్పు కాగలదు

## సజాతో యేన జాతేన యాతి వంశః సమున్నతిమ్

ఎవడు తన్ను తాను తెలిసికొని తన హృదయమున వెలుగుచున్న ఆత్మజ్యోతిని సాక్షాత్కరించుకొనునో ఎవడు పరమ పవిత్రమగు దైవానుభూతిని బడయునో అట్టివాడే వాస్తవముగ పుట్టినవాడు ఎవనివలన వంశము కులము దేశము ఉద్ధరింపబడునో అతడే పుట్టినవాడు ఎందరో పుట్టుచున్నారు గిట్టుచున్నారు చెట్లు పుట్టుచున్నవి. చేపలు పుట్టుచున్నవి మృగములు పుట్టుచున్నవి క్రిమికీటకాదులు పుట్టుచున్నవి కాని అవి పుట్టినట్లా! కాదు జన్మసార్థకతలేని జీవితము జీవితముకాదు వసిష్ఠమహర్షి ప్రోక్తములగు ఈ క్రింది వాక్యము లిట్టి భావమునే వ్యక్తీకరించుచున్నవి —

ధన్యాస్త ఎవ జాయంతే సాధుజీవితాః
యే పునర్నేహ జాయంతే శేషా జఠరగర్దభాః

పవిత్ర జీవితము గడుపువారే ఈ ప్రపంచమున వాస్తవముగ జన్మించినవారు మఱియు జన్మరాహిత్యమునకు వలసిన సాధనలను చక్కగ ఆచరించి పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మపదవిని పొందినవారే నిజముగ పుట్టినవారు తక్కిన వారు మానవులలో లెక్కింపదగినవారు కారు

కావున పుట్టిన ప్రతివారును తిరిగి జన్మబంధమున తగులొనకుండ తప్పించుకొనుటకు ఉపాయమేదియో ఆలోచించవలసియున్నది అజ్ఞానమున్నచో కర్మ తొలగదు కర్మ తొలగనిచో జన్మ తొలగదు కావున అజ్ఞానము నిర్మూలమగుటయే జన్మకర్మల బారిద తప్పించుకొనుటకు ఏకైక ఉపాయము దేహరూప ఉపాధియందు సాక్షిభూతముగ వెలుగుచున్న ఆత్మను పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొనుటయే జన్మబంధవినిర్ముక్తుడగుటకు చక్కని మార్గము కాబట్టి ముముక్షువగు వాడు విషయ సుఖములకై ప్రాకులాడక అమూల్య సమయమును వాని కొఱకు వెచ్చించక వానికై పరుగిడి క్రిమికీటకాదుల సామ్యమును బడయక మానవత్వమును కాపాడుకొని మానవత్వమునుండి మాధవత్వమునకు ఎగబ్రాకి సార్థకజన్ముడై వర్తించవలెను జీవితమున ఉత్తరాభిముఖుడై చనవలెనే కాని దక్షిణాభిముఖుడు కారాదు ఉత్తరాయణమునే అనుసరించవలెను. కాని దక్షిణాయనమును కాద

అనాదియగు సంసారబంధనమున తగుల్కొని నానా యాతనలను అనుభవించుచు పుట్టుచు చచ్చుచున్న జీవుడు ఆ దుఃఖరతాపమును భరించలేక శాంతికై మార్గమేదియని అన్వేషింపదొడగును పెద్దల నాశ్రయించి శాస్త్రపరిచయ మొకింత సంపాదించి తరణోపాయమును వెతికికొనును.

**కిం మూఢ ఇవ తిష్ఠామి ప్రేష్యేఽహం శాస్త్రసజ్జనైః**

ఇంతకాలము నేనేల మూఢుడుగ వర్తించి కాలము న తయును వృథాచేసితిని ఇపుడు బుద్ధి తెచ్చుకొని సద్గురువులను సచ్ఛాస్త్రములను ఆశ్రయించి ముక్తిమార్గము నన్వేషింపుదును అని తలంచి అధ్యాత్మమార్గమున ప్రవేశించును ఇదియే జీవునకు ఉత్తరాయణము

అయనము అనగా మార్గము ఉత్తరాయణ మనగా ఉత్తరమార్గము. సూర్యుడు ఉత్తరాభిముఖుడై పోవు కాలము మహాపుణ్యప్రదముగ మహాపవిత్రముగ ఎంచబడు చున్నది కనుకనే ఆ దినమున జనులు గొప్ప పండుగను గొప్ప వేడుకను జరుపుకొనుచున్నారు అదియే సంక్రాంతి పండుగ పండుగలన్నిటిలో అది ముఖ్యమైనదిగా భావింప బడుటవలన దానిని పెద్ద పండుగ అనియు పేర్కొనుచుందురు

అట్లే జనులు ఎప్పుడు అథోమార్గమును (అజ్ఞానమును దుర్గుణావలంబనమును) వదిలివైచి ఊర్ధ్వమార్గమున పయనమై పోవుదురో (సద్గుణములను అవలంబింతురో) అదియే

వారి జీవితములో శుభముహూర్తము. అదియే వారి జీవిత కాలమున పెద్ద పండుగ. అట్టి పండుగను జరుపుకొనువారు ధన్యజీవులు చరితార్థులు మహాత్ములు. వారు క్రమక్రమముగ ఊర్ధ్వమార్గమున పయనమైపోయి తుదకు జీవిత చరమ లక్ష్యమగు పరమాత్మను చేరుకొందురు.

ఉన్నత సంస్కారములతోగూడి సద్గుణములను అవలంబించుచు సచ్చరిత్రను కాపాడుకొనుచు, దైవ సంపదను అలవాటు చేసికొనుట ఊర్ధ్వమార్గపయనము ఉత్తరాయణ ప్రయాణము. అపవిత్ర సంస్కారములతో గూడి దుర్గుణావలంబులై హీనమైన చరిత్ర గలిగి ఆసుర సంపదను ఆశ్రయించుట అధోమార్గ పయనము దక్షిణాయన ప్రయాణము. ఊర్ధ్వమార్గమున పోవువారు శాంతి సుఖములను నోచుకొనుచు భగవత్కృపకు పాత్రులై జీవితమున పరమానంద మనుభవించుచుందురు. అధోమార్గమున జనువారు జీవితమున పలు ఇక్కట్ల పాలగుచు శాంతిసుఖములకు దూరులై హృదయ గ్రంథిని ఇంకను గట్టిపఱచుకొనుచు బంధనమున చిక్కుకొని అశాంతిమయ జీవితమును గడుపుచుందురు. జనన మరణ రూప సంసార చక్రమునుండి విడిపోక వారు బహుకాలము దుఃఖముల పాలగుచుందురు. పవిత్రాచరణ లేనివారు దేహమే ఆత్మని భావించువారు ఆత్మజ్ఞానమును పొందనివారు అంధకార బంధురములో పడిపోవుదురని శ్రుతిభగవతి ఈ ప్రకారముగ జనులను హెచ్చరించుచున్నది.

అసూర్యా నామ తే లోకా
అంధేన తమసావృతాః
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి
యే కే చాత్మహనో జనాః (ఈశావాస్యోపనిషత్తు)

కాబట్టి విజ్ఞులగువారు బహుజాగరూకులై జీవితమార్గమున వారు వేయు ప్రతి అడుగున్ను ఆచితూచి వేయుచు తాము చేయునది ధర్మమా అధర్మమా అని యోచించుకొనుచు శాస్త్రసమ్మతమా శాస్త్రవిరుద్ధమా అని విమర్శించుకొనుచు తాను చేయు కార్యము ఊర్ధ్వ ప్రాప్తికైనను తోడ్పడునా అని ఆలోచించుకొనుచు సన్మార్గమునే ధర్మమార్గమునే ఊర్ధ్వమార్గమునే పోవుచుండవలెను ఎన్ని కష్టములు సంభవించినను, ఎన్ని ప్రతిబంధకములను ఎదుర్కొనవలసి వచ్చినను ఆ ఊర్ధ్వమార్గమును వదలరాదు

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః

అని శ్రీకృష్ణభగవానుడు తెలిపిన చందమున మహనీయులు సదా ఊర్ధ్వమార్గమునే పట్టుచుందురు. మేడమెట్టు మెట్ల్రవలె వారు దినదినమునకు పైకి పోవుచుందురు ఉన్నతస్థానమలంకరించుచుందురు ఉత్తమ ఫలములను పొందుచుందురు. అజ్ఞాని బావిత్రవ్వు మేస్త్రీవలె కిందికిజారును.

తీ ది క్రిందికే పోవుచు తును అగాధ్య మాగ్గించుచు
జ్ఞానచరిత్రను అగల బంచుచు అధోగతి పాలగుచు న్నారు

అగ్నిర్జ్యోతిరహః శుక్లః
షణ్మాసా ఉత్తరాయణమ్

అని గీతాచార్యులు ఉత్తరాయణ మార్గము సచ్ఛీలా
ల జనము సదాచారపరాయణత్వము అగ్ని జ్యోతి పగలు
శుక్ల పక్షముల వలె మహాప్రకాశవంతమైనది ఆనందకరమని
చించియున్నారు కావున పైకిపోవువారు ధన్యులు కృత
కృత్యులు క్రిందికి పోవువారు మందదృష్టవంతులు దుఃఖ
గులు

పవిత్రమైన మానవ జీవితమును బడసియు బ్రహ్మాన
దనమునకు తగిన పోయితిని బొందియు నానవేతరము
కు ఇతర ప్రాణులకో సమానముగ జీవితమును అంధకార
ధూమముగ గడిపివేయుట వాడియా! భగవంతుడు చక్కని
వకాశమును ప్రసాదించియున్నాడు ఈ అవకాశమును
వదులక ఈ అమూల్య జీవితమును బూడిదలో పోయక
మానవత్వమును చరితార్థము చేయుచు జనులు ఊర్ధ్వమార్గ
న సన్మార్గమున దైవమార్గమున వెళ్ళేల ఉత్తరాయ
మున పయనమై పోవుచు బ్రహ్మానంద మనుభవించవలెను
స సార దావానలమునుండి ఈ భవారణ్యమును దీక్షగ
గ తప్పించుకొనవ యును.

# 6 సంసారఘోరారణ్యము

భవమనగా సంసారము ప్రకృతి చాపల్యముతో కూడిన ఈ మహాసంసారము ఎప్పుడు ప్రారంభమైనదో కాని జీవుడజ్ఞానయందుపడి సుడిగుండమున తగుల్కొనిన పురుగువలె కాలచక్రమున గిరగిర తిరుగుచు అంతులేని బాధల ననుభవించుచున్నాడు జనన మరణ రూపమగు మహాకాలప్రవాహమున చిక్కుకొని దుర్భర యాతనలను పొందుచున్నాడు గాఢారణ్యమున చిక్కువడి అంధకారమున అలమటించుచు దిక్కుతోచక దారి తెలియక పరిభ్రమించు బాటసారివలె జీవుడు ఈ సంసారారణ్యమున అనాది కాలము నుండియు తిరుగాడుచు దానినుండి బయటకు రాకయున్నాడు అట్టి శోచనీయ పరిస్థితినిగూర్చి శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకీ క్రింది విధముగ బోధించియున్నారు

సా భీషణా వివిధ కంటక సంకటాంగీ
ఘోరాటవీ ఘనతమోగహనాపి లోకే
ఆగత్య విశ్రుతిపదబ్ధవరావబోధై
రాసేవ్యతే కుసుమగుల్మకవాటికేవ

మహాభయంకరమై అనేక సంకటములతో కూడి అంధకార బంధురమై దట్టమై పెక్కు కంటక వృక్షములతో గూడియున్నట్టి ఈ సంసారారణ్యమునబడి ఈ జీవుడు అందుండి తప్పించుకొను యత్నము చేయక, పైపెచ్చు నందనోద్యాన

మనుపరి అర్ధానిని సేవించుచు అక్కడే పడియున్నాడు అహా! ఎంత ఆశ్చర్యము!

కాబట్టి సద్గురు ముఖతః జీవుడు తన పరిస్థితిని చక్కగ తెలిసికొని బంధనమునుండి తప్పించుకొని విముక్తుడగుటకు ప్రయత్నించవలెను

భవారణ్య ప్రవిష్టస్య దిఙ్మోహ భ్రాన్తచేతసః
యేన సందర్శితః పన్థా తస్మై శ్రీ గురవే నమః

సంసార గాఢారణ్యమున ప్రవేశించి దిక్కు తెలియక నానాబాధల నొందుచుండు పాంథునకు దారి చూపి అరణ్యమునుండి వెలుపలకు చేర్చునట్టి ఏ సద్గురువు కలడో అట్టి గురుదేవునకు నమస్కారము — అని గురుధ్యానమందు చెప్పుకొనుచుందురు.

అరణ్యమందు పెక్కు భయంకర జంతువులు నివసించుచున్నట్లు ఈ సంసారారణ్యమందును కామ క్రోధాది షడ్గుణ రూప నానావిధ వాంసజంతువులు, అసూయాద్వేషాది చతుర చోరులు నివసించుచున్నారు అందుండి ఎంత శీఘ్రముగ తప్పించుకొనిన మానవునకు అంత శ్రేయస్కరము తప్పించుకొనుట యుపగా తాను దేహము ఇంద్రియములు మనస్సు బుద్ధి అని ఇంతవఱకు తలంచుకొనుచు వానితోను ప్రాపంచిక దృశ్యపదార్థములతోను తాదాత్మ్యము నొందుచున్నవాడు ఇకమీదట గురూపదేశముద్వారా శాస్త్రాధ్యయనము

ద్వారా తాను జడమై క్షణికమై నాశశీలమైనట్టి దేహము ఏ కాలమందును కాదనియు దేహసాక్షియై చిన్మయమై శాశ్వతమై జనన మరణ రహితమైనట్టి సచ్చిదానంద ఆత్మ యేయని బాగుగ నిశ్చయించి అట్టి జ్ఞానమందు నిలుకడ కలి యుండుటయే యగును.

జనులందు మూడు తరగతులవారు కలరు. తాము బంధనమందుండియు ఆ విషయమును తెలిసికొనక అజాగ్రతగ నుండువారు కొందఱు. వారు అజ్ఞానులు. బంధజనిత దుఃఖ జాలమును వారనుభవించుచు దుర్భర జీవితములను గడుపుచు నుందురు. మరికొందరు తాము బంధనమం దున్నామని తెలిసియు విడుదలకై ప్రయత్నము చేయకయుందురు. వీరు పామరులు. పైవారివలె వీరున్ను సంసార ప్రవాహమునుండి తప్పించుకొనజాలక నానాదుఃఖముల ననుభవించుచునే యుందురు. ఇంకకొందరు తాము బంధనమందున్నామని తెలిసికొని బంధవిముక్తికై అహర్నిశములు పాటుబడు చుందురు. వీరు ముముక్షువులు. తమ ప్రయత్నాతిశయముచే అచిరకాలములోనే వారు బంధమునుండి తప్పించుకొని ద్వైత శృంఖలములను విచ్ఛిన్న మొనర్చివేసి ఆత్మసామ్రాజ్యమున అభిషిక్తులై శివస్వరూపులై పరమానంద మనుభవించుదురు.

కాబట్టి దిక్కు తెలియక ఒక మహారణ్యమున పరిభ్ర మించుచున్నట్లు తెలిసికొనుటయు మార్గమునుచూపు గురు దేవుని కొఱకై వెదకికొనుటయు ఆ గురుదేవుడు చూపిన

మార్గమునంటబోయి భవారణ్యమునుండి తప్పించుకొన
టయు మానవునకు కర్తవ్యమనే ఆ సరిచదలన కార్యము వ
హీనియందు విలంబనము చేయరాక ఇప్పటికే ఎన్నికోట్ల
జన్మలలో అజ్ఞానమందు అజ్ఞానజనిత దుఃఖమందు బంధమందు
గడచిపోయినవని ఇక ఏమాత్రమును జాగుచేయరాదు
కానవలె ఈ జగత్తేమియో తన నిజస్వరూపమేదియో
శీఘ్రముగ తెలిసికొని చంచలమగు విషయజాలము యెడల విరక్తి
గలిగి శాశ్వతానంద రూపమగు తన ఆత్మయందు నిలుకడ
కలిగియుండుటయే జీవుడు చేయవలసిన పని. అకార్యము
నాచరించునిచో అడవిలో చిక్కుకొనిన బాటసారివలె అంతు
లేని దుఃఖమును జీవు డనుభవించవలసి యుండును. కాబట్టి
విజ్ఞుడగువాడు తానిపుడు విహరించుచున్నది పుష్పోద్యానము
కాదనియు కంటకారణ్యమేయనియు నందనవనము కాదనియు
ఘోరవనాంతరాళమే యనియు శీఘ్రముగ నెరింగి దేహాద్యభి
మానమును దూరీకరించి విషయభోగములయెడల ఆసక్తిని
త్యజించినవాడై ఆత్మజ్ఞానమును బడసి సంసారారణ్యమును
దాటివేయవలెను. దేశ కాల క్రియలకు లోబడియుండునట్టి
జీవునకు శాంతి యెచట సౌఖ్యమెచట ! ఆ మూడింటికి అతీ
తమై వెలయు ఆత్మయందు స్థిరత్వమును బడసినపుడే జీవునకు
పరిపూర్ణశాంతి లభించును. కావున అట్టి ఆత్మజ్ఞానమును
త్వరితముగ సంపాదించి ఈ సంసార ఘోరారణ్యమునుండి
విముక్తినిబడయుటకై తీవ్రతర కృషి సల్పుట ప్రతి జీవి

రొక్కరుయు ప్రథమ కర్తవ్యమై యున్నది. అపారమైన ఈ సంసార సముద్రమున బడి గిజగిల తన్నుకొనుచు నానాయాతనల నొందుచు అందే కాలక్షేపము చేయుచుండుట పాడికాదు. ఆ మహాసముద్రమునుండి బయటపడవలెను

## 7 సంసారసాగరము

సముద్రమధ్యమున నున్నవానికి ఎటు చూచినను అగాధ జలమే కానుపించును దిక్కుతోచదు ఎటు పోవలెనో అంతు పట్టదు హృదయమున భీతిజనించును. అట్లే ఈ సంసార సముద్రమున్ను సామాన్య జనులకు అగాధమై అపారపారావారమై భయజనకమై కన్పట్టుచున్నది. పుట్టినవాడు గిట్టుచున్నాడు గిట్టినవాడు తిరిగి పుట్టుచున్నాడు. ఈ జనన మరణ రూప ప్రవాహమున జీవుడు ఏనాడు తగుల్కొనెనో గాని కోట్లకొలది జన్మలనుండి ఆ విధముగ పరిభ్రమించుచునే యున్నాడు. దీనినుండి తప్పించి, చేయూత నొసంగి రక్షింపు దేవా! అని ముముక్షువులు ప్రార్థన చేయుచున్నారు

సంసార సాగర విశాల కరాళకాళ
నక్రగ్రహగ్రసన విగ్రహ విగ్రహస్య
మగ్నస్య రాగరసదూర్మి నిపీడితస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్

## ప్రహ్లాద వైభవము

ఓ పరమాత్మా ! లక్ష్మీనరసింహా ! సంసారమను సముద్రమందు చిక్కుపడి యున్నాను అతిభయంకర మగు మొసలిచే మ్రింగివేయబడుచున్నాను. విషయము ను కెరటముల మధ్య పీడితమైన దేహము కలవాడనైన ను దయతో నీ చేయూతనిచ్చి ఈ అగాధ సముద్రమునుండి నన్ను లేవదీసి దరికి జేర్చుము ! ఇదియే ముముక్షువు హృదయపూర్వక విజ్ఞప్తి

సముద్రమునబడి నానాబాధల నొందుచు దిక్కారి కొని పోవుచుండువారికి నావ యట్లు ఆశ్వాసమును గొల్పు అట్లే సంసారసాగర నిమజ్జితులకు భగవత్పాదముల ఆశ్రయము పరమ స్థైర్యమును పరమాశ్వాస ము కలుగజేయును ఇక వేరుదారిలేదు భగవచ్ఛరణాగతి సంసారబాధానివారిణి దైవాశ్రయమే సర్వదుఃఖ క్షేమకరము శ్రీ వేంకటేశ్వర సుప్రభాతమునందు —

### సంసారసాగర సముత్తరణైకసేతో

అను వాక్యము గలదు సంసారసముద్రమున మునిగి యున్నవారిని దరికి జేర్చుటయందు ఓడవంటి ఓ ప్రభూ ! నమస్కారము — అని ఆ వాక్యముయొక్క అర్థము, దుఃఖమునందు కొట్టుమిట్టాడుచుండువానికి సద్వస్తువగు ఆత్మ ఆశ్రయమే ఏకైక శరణ్యము తమస్సునందు నానా బాధల నొందుచుండువానికి జ్యోతిర్మయముగు పరమాత్మయే

మృత్యురూపమగు సంసారమున పరిభ్రమించుచు
ందు గు డు వానికి అమృతస్వరూపమగు పరబ్రహ్మమే
శ్రయము సంసార దుఃఖ పరివేష్టితుడగు శిష్యుడు
ములను భరింపలేక వానినుండి తప్పించుకొనుటకై
చెంతకేగి వినయవిధేయతలతో నిట్లు ప్రశ్నించు

అపార సంసార సముద్రమధ్యే
సమ్మజ్జతో మే శరణం కిమస్తి
గురో కృపాళో కృపయా వదైతత్ —

గురుదేవా! ఆర్తత్రాణపరాయణా! అపారమగు ఈ సముద్రమున మునకలిడుచు నానాబాధల నొందు నాకు శరణ్యమేదిరా దయతో సెలవిండు — ఆ యార్తనాదమును పరిప్రశ్నను ఆలకించి అనుభూతి ణుడగు గురుదేవు డీ ప్రకారముగ సమాధాన ుచున్నాడు

విశ్వేశ పాదాంబుజ దీర్ఘనౌకా

నాయనా! ఈ అపార సంసార పారావారమును ఈ పరమాత్మయొక్క పాదపద్మములను పెద్ద నావను ంపుడు అదియొకటియే నిన్ను గట్టెక్కింపగలదు

గురుదేవుని ప్రత్యుత్తరము అత్యంత సమీచీనముగ భగవదాశ్రయము సమస్త దుఃఖములను పోగొట్టి

ఆత్యంతిక శాంతి నొసంగి జీవుని ఈ భవాంభోధిజనిత దుఃఖ జాలము నుండి శాశ్వతముగ తొలగించివేయగల శక్తిసామర్థ్యములు గలిగియున్నది

భవజలధి మగాధం దుస్తరం నిస్తరేయం
కథమహమితి చేతో మాస్మగాః కాతరత్వమ్
సరసిజదృశి దేవే తావకీ భక్తిరేకా
నరకభిది నిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్

ఓ మనస్సా! జననమరణరూప సంసారసముద్రము [illegible]లోని ఈ అగాధజలమునుండి యెట్లు తరింపగలనాయని దుఃఖింపవలదు కమలనేత్రుడగు శ్రీకృష్ణపరమాత్మను శరణు పొంది భక్తితో ధ్యానించుటయే నీకు తరణోపాయము. అట్టి సద్భక్తియే నిన్ను సంసారసాగరమునుండి అవశ్యము దాటించును — అని ఒక భక్తశిఖామణి తన మనస్సును సంబోధించి యుండుట ఈ సందర్భమున గమనింపదగినది భాగవతకారులగు శ్రీ శుకమహర్షియు సంసార సాగర తరణోపాయమును ఈ క్రింది విధముగ సూచించెను.—

సంసారసింధు మతిదుస్తర ముత్తితీర్షో
ర్నాన్యః ప్లవో భగవతః పురుషోత్తమస్య
లీలాకథారసనిషేవణ మన్తరేణ
పుంసో భవేద్వివిధ దుఃఖదవార్దితస్య
(భాగవతం 12 4 40)

పెక్కు దుఃఖములకు ఆలవాలమైనట్టియు దాటుటకు కష్టసాధ్యమైనట్టియు ఈసంసారజలధిని తరించి చేరుటకు పురుషోత్తముడైన భగవంతునియొక్క లీలలను శ్రవణ మొనర్చుటయు భగవద్దివ్యకథామృతమును గ్రోలుటయు భగవత్తత్త్వమును మననము చేయుటయు తప్ప మరియొక ఉపాయమేదియును లేదు

కాబట్టి జననమరణరూప ఈ సంసార మహోదధి యందు బడి కామాది జలచరములచే బాధింపబడుచు రాగద్వేషాది తరంగములచే కొట్టబడుచు ఒక్క నిముసమైనను శాంతిసుఖములను నోచుకొనలేని జీవులు, బాహ్యాభ్యంతరము లందు వెలుగొందుచున్నట్టియు పంచకోశములకును సర్వ జగత్తునకును సాక్షియై చెన్నొందుచున్నట్టియు పరమాత్మ నాశ్రయించి జప, ధ్యాన విచారణాదులద్వారా భక్తిజ్ఞాన వైరాగ్యాదులద్వారా ఆ దేవదేవుని సాక్షాత్కరించుకొని సంసార సముద్రమును లెస్సగ దాటినవారై బంధవిముక్తులై పరిపూర్ణ పరానందమును బ్రహ్మానందమును ఈ జీవితము నందే పొందుటకు యత్నశీలురు కావలయును. జీవితమును పవిత్రముగ గడపవలెను పాపమును దరిచేర్పరాదు పాపకార్యములచే ఏనాటికైనను దుఃఖమును అనుభవించవలసి యుండును అది విశ్వశాసనము

ఏ ప్రభుత్వమైనను తన పరిపాలన చక్కగ జరుగుటకై కొన్ని శాసనములను ఏర్పరచును. ఆ శాసనములకు అ

గుణ్యముగనే ప్రజలు నడవవలసియుందురు. వానిని ధి రించినవారికి తగిన శాస్తి లభించి తీరును అధినేత శిక్షాస్మృతి ననుసరించి విధించు శిక్షకు అతడు పాల్పడవ యుండును. దానిని తప్పించుకొనుటకు వీలులేదు

అట్లే విశ్వప్రభుత్వమునందును కొన్ని నియమము శాసనములు కలవు అవి చండశాసనములు అప్రతిహతము వానికి తిరుగులేదు ఆ నియమములకు అందరును బద్ధ కావలెనివజే వానికి వ్యతిరిక్తముగ నడువదలంచినవారు తమ సంభవింపనున్న ఘోరవిపత్తును ముందుగనే ఊహచేసి అట్టి దైవశాసనోల్లంఘనమునుండి విరమించుకొనుట శ్రే స్కరము

పాపమునకు ఫలితము దుఃఖము
పుణ్యమునకు ఫలితము సుఖము
జ్ఞానమునకు ఫలితము మోక్షము

ఈ మూడును విశ్వప్రభుత్వమునందలి శాసనము అవి దైవనిర్మితములు జాతి, మత కుల లింగ విచక్షత లే తేకేశేడు ఎవరైనను ఆయా క్రియలచే ఆయా ఫలిత లను తప్పక పొందియే తీరుదురు.

అట్లే ప్రకృతిలోను కొన్ని నియమములు కల దృష్టాంతమునకు భూమికి ఆకర్షణశక్తి (Law of gravit కలదు తత్ఫలితముగ ఏ వస్తువైనను జారవిడువబడిన

పై నుండి క్రిందకు పడితీరును. భూమి ఆ వస్తువును తన వైపుకు ఆకర్షించుకొనును ఈ శాసనము ప్రకృతియందు అమలు జరుపబడుచున్నందువలననే విమానములు కూలిపోవుచున్నవి పడవలు మునిగిపోవుచున్నవి కాలు జారినవారు క్రిందపడు చున్నారు బావిలో త్రొక్కిన క్రిందకు పోవుచున్నది. వెను కటికి ఒక రాజుగారు తన మేడమీదనుండి క్రిందకు దిగుచు కాలు జారి క్రిందపడి కాళ్ళు విరుగగొట్టుకొని తనచుట్టు చేరిన వారితో నేను దేశానికంతటికిని రాజునైనా నా కాళ్ళు విరిగినవే? అని పలికినాడట! రాజైనను సామాన్యుడైనను భూమికి ఆకర్షణ శక్తియను నియమము మున్నంతవరకు కాలు జారినచో క్రిందపడక తప్పదు బాధ అనుభవింపక తప్పదు.

పరీక్షిన్మహారాజు వేటకు వెళ్ళి అరణ్యములో ఒక తపస్వి యొక్క మెడలో చచ్చిన పామును వైచెను. తద్దోష ఫలితముగ తక్షకుడను బ్రహ్మాండమైన సర్ప మతనిని కాటు వైచి జీవితమును అంత మొనర్చెను. అతడు మహారాజు తలంచిగాని అర్జునుని మనుమడని భావించిగాని శాసన మతని వదలిపెట్టినదా? లేదు ఫలితము తప్పక అతడనుభవిం వలసి వచ్చినది. అట్లే వారి వారి దుష్కృత్యములకు ఫలి తముగ దు ఖమును విశ్వప్రభుత్వ చండశాసన రీత్యా ప్ర వారును—వారు గొప్పవారైనను సామాన్యులైనను ధని కులైనను బీదవారైనను పండితులైనను పామరులైన తప్పక అనుభవించవలసినదే ఈ సత్యమును గుర్తెరిగి జను

తమ తమ జీవితములందు పాపమును ఏమాత్రము జేసియక బహుజాగరూకులై మెలగవలెను గతించినమును పుణ్యకార్యములద్వారా క్షాళన మొనర్చివేసిమును కళంకరహితముగ నొనర్చుకొనవలెను పాప ఫలితగు నరక బాధలనుగూర్చి బాగుగ యోచించుకొని దుష్కృత్యములకు ఏ మాత్రము తావీయక పవిత్ర జీవితమును గడుపవలయును. పరీక్షిన్మహారాజు తదుపరి పశ్చాత్తప్తహృదయ జీవితమును సంస్కరించుకొని తనకున్న అల్పజీవితకాల భాగవతకథా శ్రవణముద్వారా పవిత్రవంతమొనరు ధన్యుడయ్యెను

దైవనిర్మిత శాసనములను ఎవరును ధిక్కరించరా లోకములో ఎల్లెడల దుఃఖము తాండవించుచున్నది వారు గ్రుడ్డివారు అవిటివారు, అంగవికలులు కుష్ఠరోగులు దరిద్రులు, దీనులు ధనమును గోల్పోయినవారు బంధువులను గోల్పోయినవారు దీర్ఘరోగములచే బాధింపబడుచు యమయాతన నొందువారు ఈ ప్రకారముగ ఎందరో బాధలను అనుభవించుచున్నారు ఈ బాధలకు కారకుడు వంతుడుకాడు ఏనాడో జీవుడు తానుచేసిన దారాకృత్యకు, పాపభూయిష్టమైన క్రియలకు విశ్వశాసనరీత్యా ఫలము అనుభవించుచున్నాడు అందుచే ఈ విషయమున ఒకరిని నిందించిన లాభములేదు చెడు మార్గమున జనతన మనస్సునే తాను నిందించుకొని ఇక మీదట అట్టి

మార్గమున జాతిని జననీజనక బహుభాగికతాకుషై పవిత్రా చరణద్వారా దైవాశ్రయముద్వారా జీవితమును ఆనంద మయముగ నొనర్చుకొనుట ఉత్తమము తన పవిత్రాచరణయే తన్ను కాపాడును బంధుమిత్రాదు లెవరును తన్ను ఉద్ధరింప జాలరు బంధుమిత్రాదుల కలయిక ఒక సత్రములో కలిసి కొను జనులవంటిదే యగును

తీర్థయాత్రలు చేయువారు త్రోవలో అచటచట కొన్ని మజిలీలు ఏర్పాటుచేసుకొని ఒకటి రెండు రోజులు అచట విశ్రమించి మరల తమ యాత్రను కొనసాగించుదురు దారిలో ఏవైన ధర్మసత్రములు కట్టబడినచో ఆ సత్రములందు ఒకటి రెండు గదులు తీసికొని దానిలో తమ సామగ్రిని ఉంచుకొని, ఊరిలో చూడవలసిన విశేషస్థలములను చూచి మరల పయ నమై పోవుదురు. ఒక్కొక్క సత్రములో చాల గదులుండును ఎక్కడెక్కడినుండియో యాత్రికులువచ్చి అచట చేరుచుం దురు భిన్నభిన్న ప్రాంతములవారు భిన్నభిన్న భాషలు మాట్లాడువారు భిన్నభిన్న సంస్కృతులు కలవారు, వివిధ ఆచారవిచారములు కలిగియున్నవారు అచటికి వచ్చి పరస్ప రము కుశలప్రశ్నలు వేసికొనుచు వారివారి అనుభూతులు తెలియజేసికొనుచు, ఇల్లు వాకిలి గోత్రములను గూర్చి మాట్లాడుకొనుచు స్నేహితులుగ మిత్రులుగ బంధువులుగ అన్నలుగ ఒకే ఇంటివారుగ వ్యవహరించుకొనుచు తెల్లవారు ప్రొద్దున లేవగనే ఎవరిదారిన వారు పోవుచునుందురు. వారి

సంభాషణలందు మైత్రి ప్రస్ఫుటమైనను మమత్వము గోచరించదు. స్నేహము వెల్లడియైనను రాగము గోచరింపదు

ఇంటిలోని కుటుంబ సభ్యుల కలయికయు ఇటువంటిదే యగును. భార్య భర్త తల్లి తండ్రి కుమార్తె కుమారుడు కోడలు అల్లుడు మనుమలు అవ్వ తాత — వీరందఱు ఒక ధర్మసత్రములో కలిసికొనిన యాత్రికబృందము వంటివారే యగుదురు. ఏలయనిన సత్రములోనివారు ఎంత ఆప్యాయతతో మెలగినను ఒకటి రెండు రోజులలో అందఱు సెలవుపుచ్చుకొని పోవుదురు. ఒకడు రామేశ్వరమునకు పోవును మఱియొకడు కాశీపట్టణమునకు పయనమగును. సత్రములో కలిసికొనుటకు పూర్వము ఆతడెవరో ఈతడెవరో! ఒకరి పరిచయము మఱియొకనికి లేనేలేదు. సత్రములో గడిపిన రెండు రోజులు భాయీ భాయీ అని ఎంతయో ప్రీతితో వ్యవహరించుదురు. కాని మఱునాడు ఉదయమే వారు ఒకరి కొకరు చెప్పక పోవుదురు. ఇంటిలోని కుటుంబ సభ్యులయొక్క కలయిక కూడ కేవలం అట్టిదే అయియున్నది. పూర్వజన్మలో భార్య యెవరో భర్త యెవరో తండ్రి యెవరో కుమారుడెవడో ఋణానుబంధముచే ఒకచోట చేరుకొనిరి. కర్మక్షయముకాగానే ఎవరిదారి వారిదే. మఱుసటి జన్మలో ఎవరెక్కడ పుట్టుదురో భగవంతునికే యెఱుక! సత్రములో జనుల కలయిక ఒకటి రెండు రోజులు. ఇంటిలో కుటుంబీకుల కలయిక ఒకటి రెండు దశాబ్దములు. ఇంతియే భేదము.

క్షేత్రములో కలిసికొనినవారు ఎంత సన్నిహితులై లగినను వారియందు మమత్వము వియోగమందును శోక ము అది లేనందువలననే వారు ఒకరినొకరు విడిపోవు దర్భమున పరితాపమును వ్యక్తము చేయకుందురు ఇంటి ని వ్యవహారము అట్లుకాదు వారు ఉన్న కొలదికాలము మమత్వపాశముచే పరస్పరము బంధించుకొని తత్ఫలితముగ పోవుకాలమున పరమ దుఃఖమును బడయుచుందురు సత్ర లో ఎంతకాలమున్నను ఒకరినొకరు విడిపోవుట ఖాయము కొ గృహములందు బంధువులున్న కాలక్రమమున బాటు నొందుట తథ్యమని యెఱిగిన విజ్ఞుడు వారితో వహరించునప్పుడు రాగముచే బంధింపబడక మమత్వమునకు వీయక ఇది మూణ్ణాళ్ళ ముచ్చట యని మనస్సునందు ఎంచుకొని వారితో కలసి మెలసి తిరుగుచుండును లోక వహార మాచరించినను గృహస్థ ధర్మములను నెరవేర్చు ండినను పరస్పర ప్రేమానురాగములు కలిగియున్నప్పటి మీరు నేను ఎల్లకాలము ఈ భౌతికదేహ సంబంధము గియుండజాలము అని మనస్సున నిర్ణయించుకొని తాను కుపై నీటిబిందువువలె నిర్లేపముగ, తటస్థముగ నిస్సంగ గ వర్తించుచుండును

కురుక్షేత్రమున సంగ్రామము ప్రారంభము కానున్న సమయమున అర్జునుడు ప్రతిపక్ష సైనికులను ఒక్కసారి కించి మీరందరూ నా కుటుంబ సభ్యులే మీరందరు నా

వారే అని మనంబున భావించుకొని 'స్వజనం స్వజనం
కలవరించుచు యుద్ధమునకు స్వస్తిచెప్ప దలంచుకొనినన
గురువర్యులకు శ్రీకృష్ణపరమాత్మ బోధించిన దివ్యతత్త్వవ
మును ముముక్షువులు జ్ఞప్తియందుంచుకొనవలసియున్నది -
అర్జునా! ఎవరు నావారు ఎవరు నీవారు? ఎంతకా
లీరితో సంబంధము? నాశరహితమగు ఆత్మయే ప్రతి
నిత్యస్వరూపమైయుండ క్షణిక భౌతిక దేహముకై శో
కించుట తగదా! అర్జునా! వ్యవహారము చేయవచ్చు
కాని తగుల్కొనరాదు బంధువులతో పరిజనముతో
-లతో మెలగవచ్చును కాని మమత్వము కలిగియుండరా

(Not renunciation of action
But renunciation in action)

కర్మ త్యాగముకాదు కావలసినది కర్మయందలి (
త్యాగము కర్మయందలి కర్తృత్వ త్యాగము కర్మయం
సంగత్యాగము కర్మలను నిస్సంగముగ ఆచరించుటయే క
ర్తని కర్తవ్యము అని గీతాచార్యులు ఉద్ఘోషించెను

కాబట్టి వారి వారి గృహకృత్యములను ఆచరించ
సాగించుకొనుచు జనులు కర్తృత్వభావన లేకయుందున
ప్రతమందలి యాత్రికులవలె మమత్వరహితులై జీవన
గడుపుట ఉత్తమము.

యాత్రా సమాసంగ సమా నరాణాం
కళత్ర మిత్ర వ్యవహారమాయా

మన జీలయొక్క ఈ భార్యా బంధు మిత్ర వ్యవ ము యాత్రాదులందలి కలయిక వంటిదే యగును అని ాముతు తన వైరాగ్యానుభూతిని గురువర్యులగు పరిష్క ామిత్రులకు తెలియజేయు సందర్భమున పలికియుంచెను

కాబట్టి గృహము సత్రమును బోలినదేయనియు వాసుల కలయిక యాత్రికుల కలిక సహావాసమును ిన దేయనియు నిశ్చయించుకొని భౌతిక దేహములను నమ్ము క దేహములన్నిటియందును అనుస్యూతమై వెలుగుచున్న ేక ఆత్మజ్యోతిని లక్షియించి అదియే తానని అదియే బంధుమిత్రాదుల యథార్థ స్వరూపమని తెన్నగ భావించు మను జీవితమును ఆనందమయముగ నొనర్చుకొనవలయును.

యాత్రికులనుగాని తదితరులనుగాని సత్రములలో దీర్ఘ ము ఉండనివ్వరు రెండు మూడు దినములైన పిమ్మట టకు సాగనంపుదురు సొంత ఇంటిలో ఉండులాగున ములలో ఉండుటకు వీలుపడదు ఈ ప్రపంచ మొక ము వంటిది ప్రాణులు వచ్చుచున్నవి పోవుచున్నవి. లా పుట్టుచున్నారు మరణించుచున్నారు ఎల్ల కాలము ప్రపంచమును అంటిపెట్టుకొని యుండువా రెవరును లేరు

యేషాం వినాశనం నాసీత్
యైర్భుక్తం భువనత్రయమ్
తేఽపి తేఽప్యచిరేణైవ
సమం భస్మపదం గతాః

అని యోగశాస్త్రమున ఒకానొక విద్యాధరుడు పలికిన వాక్యములు ఈ సందర్భమున చెప్పదగి యున్నవి. తమకు వివేకము కలుగగనే ఎవరు విరతులను కోరుకొనిరో మూఁ లోకములను ఎవరు నిరాటంకముగ పరిపాలించిరో అట్టి మహామహులుకూడ కాలచక్రమున బడి నలిగిపోయి బూడిదల కలిసిపోయిరి — అని ఆ విద్యాధరుడు పలికెను. వాస్తవము ఈ ప్రపంచములో స్థిరనివాస మేర్పరచుకొనినవా రెవరు లేరు ఉండబోరు.

ప్రయాతాః పాండవద్యూపాః
కా ధృతిర్మమ జీవితే

నా తాతలు ముత్తాతలు మహారాజులై భూమండల మేలించి యున్నప్పటికిని గాలిచే ధూళివలె వారందరు కాలమను ఝంఝామారుతమున కొట్టుకొనిపోయిరి. నా జీవితము ఎంతకాలము — అని జనకమహారాజు తన తాను విచారించుకొనెను. పంచభూతములగు పృథివీజలాగ్నివాయురాకాశముల యొక్క సమ్మేళనముచే నేర్పడిన ఈ స్థూల దేహము ఏనాటికైనను తిరిగి ఆ పంచమహాభూతములందు విలీనమై పోవలసినదే. కార్యమగు ఘటము కారణమైన మృత్తికయందు ఎప్పటికైనను విలయము కావలసినదే. కొ ప్రాణులు స్వల్పాయుర్దాయము కలిగియుండును. మఱికొ దీర్ఘకాలము జీవించును. కాని పుట్టిన ప్రాణి ఏనాటికై గిట్టక మానదు. జాతస్య హి ధ్రువో మృత్యుః — అని గీ

చార్యుడు చెప్పినదే యున్నారు. కాబట్టి ఈ ప్రపంచము ఒక తాత్కాలిక నివాసస్థలమే కాని శాశ్వత నికేతనము కాదని స్పష్టమగుచున్నది. వాస్తవముగ ఇది యొక ధర్మ సత్రమే యగును.

మానవుని ఆయుఃపరిమితి నూరు వత్సరములని శాస్త్రములందు తెలుపబడి యున్నప్పటికిని అనంతకాలమునందు అదియొక రెప్పపాటు కాలమే యగును. అపారకాలవాహిని యందు నూరేండ్లు ఒక్క క్షణతుల్యమే కాగలదు. కనుకనే భర్తృహరి తన సుభాషితమునందు ఈ ప్రకారముగ చెప్పి యుండెను

క్షణం బాలో భూత్వా క్షణమపి యువా కామరసికః
క్షణం విత్తైర్హీనః క్షణమపి చ సంపూర్ణవిభవః
జరాజీర్ణైరంగైర్నట ఇవ వలీమండిత తనుః
నరః సంసారాన్తే విశతి యమధానీ యవనికామ్

అనగా సంసారమను నాటకమునందు మనుష్యుడను నటుడు క్షణకాలము బాలుడుగను క్షణకాలము భోగరసికుడైన యువకుడుగను క్షణకాలము దరిద్రుడుగను, క్షణకాలము మహాధనసంపన్నుడుగను క్షణకాలము వృద్ధుడుగను నటించి తుదకు యమలోకమను తెరమరుగునకు పోవుచున్నాడు

జీవితము బుద్బుదము (నీటి బుడగ) వంటిదనియు తటిల్లతాసదృశము (మెఱుపు వంటిది) అనియు పెద్దలు శాస్త్రములందు వర్ణించియున్నారు. రైలులో ప్రయాణం చేయువారు ఎల్లకాలము రైలుపెట్టెయందే నివసించుటకు వీలేదు. వారివారి స్టేషన్లు రాగానే దిగిపోవలసినదే. అట్లే ప్రాణియు ఈ ప్రపంచమున దీర్ఘకాలము కొనసాగుటకు వీలు లేదు. కాబట్టి మానవుడు అతి స్వల్పమగు తన ఆయుష్యమును పారమార్థిక లక్ష్యసిద్ధికై వినియోగించుట శ్రేయస్కరము. 'ప్రాక్ శరీర విమోక్షణాత్' అని శ్రీకృష్ణభగవానుడు గీతయందు వచించిన చందమున ఆధ్యాత్మిక సాధన శరీర వియోగమునకు పూర్వమే పూర్తిచేసికొనవలయు. అయితే దేహవియోగ మెప్పుడు సంభవించునో ఎవరికిని తెలియదు. కాబట్టి సాధ్యమైనంత త్వరలోనే అనగా బాల్యయౌవనకాలములందే సాధనలను పూర్తి చేసికొన ఉత్తమము.

ఈ ప్రపంచ మొక ధర్మసత్రము వంటిదనియు ఎక్కువకాల మిచట యుండుటకు అవకాశము లేదనియు విజ్ఞుడగువాడు బాగుగ నిశ్చయించుకొని భగవంతుని చేరుటకు వలసిన సాధన సంపత్తిని ఇపుడనే అతి శీఘ్రముగ సంపాదించుకొని కృతకృత్యుడు కావలయును.

ఇనుము వేడిగ నున్నపుడే దానిని వంచివేయవలె (Strike the iron when it is hot) చల్లబడిన ఇ

వండుటకు సాధ్యపడదు. అట్లే మానవజీవితము అంతముకాక పూర్వమే అద్దానిని దైవసాక్షాత్కారమునకు వినియోగించవలెను. భవరోగమును బాపుకొనవలయును. ఇవ్విధముగ నపార వ్యాధికి చికిత్స ఎంత శీఘ్రముగ గావించుకొనిన అంత శ్రేయస్కరము. ఇది యొక దీర్ఘవ్యాధి. దీనిని త్వరలో అంతమొందింపవలెను.

ఒక ఊరిలో ఒకానొక వ్యక్తికి జలుబు చేయగా అతడు సమీపమున గల ఒక ఆసుపత్రికి వెళ్ళి డాక్టరుగారితో తన రోగమునుగూర్చి విన్నవించి ఔషధమునకై అర్థించెను. డాక్టరుగారు ఏమండీ! ఈ రోగము మీకు సంవత్సరమునకు ఎన్ని పర్యాయములు వచ్చును? అని అతనిని ప్రశ్నింప రెండే రెండుసార్లు అని అతడు జవాబిచ్చెను. అప్పుడు డాక్టరుగారు సరేకాని ఆ రోగము వచ్చినపుడు ఎంతసేపుండును? అని తిరిగి ప్రశ్నింపగా ఆరునెల లుండునని అతడు ప్రత్యుత్తర మిచ్చెను. దీని అర్థము సంవత్సరము పొడుగునా అతనికి జలుబు ఉండుననియే.

ఆ ప్రకారమే మానవునకు ఒక దీర్ఘరోగము సంక్రమించినది. అది పైన తెలిపిన జలుబువాని వలె సంవత్సరము పొడుగునా కాక, బ్రతికినన్నాళ్ళూ వెంటబడుచునే యుండును. అంతియేకాదు. అజాగ్రతగా నున్నచో జన్మ జన్మాంతరము వానిని బాధించుచుండును. నా కేమియు వ్యాధిలేదు. చక్కటి

ఆరోగ్యమున్నది డాక్టరుగారు కూడ ఆరోగ్యమునుగూరి సర్టిఫికెట్ ఇచ్చినారు అని యెవరైన అనినచో మహాశయ మీరు పుట్టుటయే రోగము దేహమును ధరించుట రోగము జనన మరణ రూపమైన ఈ సంసార చక్రముల ఈ కాలచక్రములో ఈ కర్మచక్రములో తగుల్కొనుట రోగము అని వారికి సమాధానము చెప్పవలసియుండు ఈ వ్యాధి పేరే భవరోగము భవ అనగా ఉండుట పుట్టుట. శరీరముతో ఉండుట, లేక శరీరమును ధరిం పుట్టుట భవరోగము లేక సంసార రోగము అనబడును.

కోట్లకొలది జన్మలనుండియు మానవునకు దేహధా కొనసాగుచు వచ్చుచు న్నందున దీ ని దీర్ఘరోగమని పెద్ద నుడివిరి.

కో దీర్ఘరోగో భవ ఏవ సాధో
కి మౌషధం తస్య విచార ఏవ

అన్నిటికన్న దీర్ఘమైన రోగ మేది? అను ప్రశ్నకు సంసా రోగము, భవరోగము అనియు దానికి మందు ఏమి? ఇ ప్రశ్నకు తత్త్వవిచారణయే —అనియు శ్రీ శంకరభ పాదులు ప్రత్యుత్తర మొసగియున్నారు అనాదికాల నుండియు ఈ జన్మపరంపర ఈ కర్మపరంపర కొనసాగ వచ్చుచున్నందువలన దీనికి దీర్ఘరోగ మని పేరు వచ్చి సామాన్యముగ శరీరమునకు వచ్చు రోగము కొద్దికాల

గాని కొందరికి బలముగాని బుద్ధి మాంద్యములుగాని యుండును తదుపరి అది తొలగిపోవును. కొంత కాలము పెద్ద రోగమైనచో శరీరము పడిపోవును. శరీర వియోగముతో రోగ వియోగమున్నగా భావింతురు. అనగా ఏ రోగమైనను ఈ దేహముండునంత వరకే యుండును. ఇవి యన్నియు తాత్కాలికమైన రోగములు. కాని ఈ భవరోగమున్నచో శరీరము పడగానే పోవుగాక నీకు ఆ జీవుని సదా వెన్నంటుచునే యుండును. ఎంతకాలము వరకు? ఆత్మజ్ఞానము పొందనంత వరకు స్వస్వరూప సాక్షాత్కారము కలుగనంత వరకు తాను దేహము కాదు ఆత్మ అని తెలిసికొనవలెను. ఆత్మజ్ఞానమును బడసిన పురుషునకే భవరోగము అంతరించి జీవునకు శాశ్వతమైన కైవల్యము పరమానంద ప్రాప్తి బంధ విముక్తి చేకూరగలదు.

రోగము వచ్చినచో జనులు ఔషధమును సేవింపక మానరు. ఏలయనగా దుఃఖమును ఎవరును ఆహ్వానింపరు వచ్చినచో తొలగింపకను ఉండరు. అటులే తాను బంధనమున తగులుకొని యున్నాడననియు జనన మరణ రూపమగు సంసార వ్యాధిచే బాధపడుచున్నాననియు దేహ మనోబుద్ధిరూపములను మాయయందున్నాననియు తెలిసికొని ప్రతి మానవుడును ఆ బాధనుండి తప్పించుకొనుటకై తీవ్రతరయత్న మాచరించ వలసియుండును. ఇంతవరకు ఎందరో తల్లుల గర్భమునందో జన్మించియున్నాననియు ఎందరి తల్లుల పాలు త్రాగి

కనుక జనులు గుర్తెరిం మరల గర్భనరకమునందు పడ కుండుటకుగాను ప్రయత్నించుట విజ్ఞుడగు మానవుని ప్రధాన కర్తవ్యము బంధవిమోచనము ఇతర జన్మలందు సాధించుట చాల కష్టతరము అన్ని సాధనలకొను గూడిన మానవజన్మ యందే సంసారవ్యాధికి భేషజమును అన్వేషించవలయుయున్నది

ఇహైవ నరకవ్యాధేశ్చికిత్సాం న కరోతి యః
గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి

ఈ భూలోకమందే ఈ మానవజన్మయందే నరకదుఃఖ మను వ్యాధికి చికిత్సను చేయవలయును అట్లుకాక తరించుటకు అనుకూలములు లేని ఇతర లోకములకు గాని ఇతర జన్మలకు గాని పోయిన సంసార వ్యాధి పీడితుడగు మానవు డేమి చేయ గలడు ! ఆయా లోకములందు ఆయా జన్మలందు శాస్త్ర సద్గురుబోధ రూపచికిత్సలెవ్వియు లభించవు పైగా ఇట్టి ప్రజ్ఞయు ఆయా జన్మలందు దొరకదు కావున సంసార వ్యాధికి ఇప్పుడే ఇచటనే శీఘ్రముగ చికిత్స ప్రారంభించవలసి యున్నది వాయిదా వేయుటకు ఇది సమయము కాదు ఒక్క క్షణము దైవచింతన లేక వ్యర్థముగ గడచినచో ఘోరవిపత్తు కొనితెచ్చుకొనినట్లే కాగలదు

రోగమును ముదరగొట్టుట విజ్ఞులకు కర్తవ్యము కాదు రోగ మున్నదని తెలిసికొనుట రోగనివారణకై కృషి చేయుట ప్రతివాని యొక్కయు కనీసధర్మమై యున్నది. అందుచే

జనన మరణ రూపమైన ఈ దీర్ఘరోగమును ఏమాత్రము ఉపేక్షించరాదు. శాస్త్ర సజ్జన సాంగత్యముచే వెంటనే తత్వ విచారణ ప్రారంభించి తాను పంచభూతాత్మకమైన జడదేహము కాదని నిశ్చయించి జడమునకు సాక్షియైన చైతన్యమే తానని సంభావించి పుట్టుక చావులేని శాశ్వత ఆత్మయే తన యథార్థ స్వరూపమని బాగుగ నిశ్చయించి అట్టి ఆత్మస్వరూపము చే సదా నిలకడ కలిగి ఏనాడో తగులుకొనిన ఈ దీర్ఘరోగమును శీఘ్రముగ దూరీకరించవలయును. బహు కాలమునుండి దూళి పడియున్న అజ్ఞాన మను చీకటిని పారద్రోలవలెను. నిర్మల హృదయముతో భగవంతుని ఈ ప్రకారముగ ప్రార్థించ వలయును.

సంసార సాగరమునుండి సముద్ధరించి సంరక్షించు ఓ దేవా! అంధకారబంధురమగు అజ్ఞానమును నాయొక్క హృదయమునుండి తొలగించి జ్ఞాన ప్రకాశమును గలుగ జేయుము. నీ దివ్యనామములను సదా సంస్మరించు సద్బుద్ధిని దయచేయుము. జన్మజన్మాంతరము నీ దివ్య పాదారవిందము లను మఱువకుండునట్టి సుజ్ఞానమును ప్రసాదింపుము. ప్రభూ! నాకు ఇతరములగు ప్రాపంచిక వాంఛ లేవియును లేవు. నీ అప్రాకృత దివ్యస్వరూపము నీ మధురనామము నా హృదయ క్షేత్రమందు ప్రతి జన్మయందును సుస్థిరముగ స్థాపితమైయుండుగాక! ఇది యొక్కటే నా కోరిక అనుగ్ర హింపుము!

జగదీశా! అంత్యకాలము నందు కఫవాత పిత్తములు అడ్డుపడి నా కంఠధ్వని అవరోధపడినచో నీ నామమును నే నెట్లు స్మరింపగలను? కాబట్టి ఆరోగ్యముగ నున్న ఈ సమయమునందే నా మానస రాజహంసము నీ పదపద్మములందు స్థాపిత మొనర్చుచున్నాను. కష్టతరములచే అలసిపోయి పరితపించు చున్న నా మనస్సును నీ స్వాధీనము చేయుచున్నాను. అన్యాశ్రయము లేనివాడనై నీ చరణముల పరమశాంతిని బడయుచున్నాను. ఈ ప్రపంచమున నీ దివ్యచరణములు దక్క అన్యమైన పెన్నిధియు నాకు పూర్ణసుఖము నొసంగజాలదు.

ఓ పరాత్పరా! యమబాధను గూర్చి నాకు రవ్వంతైనను భయము లేదు. ఏలనగా నీవు నా ప్రభుడవై యుండగ యముడేమి చేయగలడు? కావున ఒక్క క్షణమైనను వ్యర్థము చేయక నిన్నే ధ్యానించు సదభ్యాసము గావించెదను. లోకమందలి సమస్త జీవరాశులయొక్క ఆర్తిని తొలగించు నీవు నీ దాసుడనగు నన్ను రక్షింపకుందువా? దేవా! ఈ జనన మరణరూప మహాసముద్రములో తగుల్కొని దుఃఖభారముచే క్రుంగి కృశించుచున్న జీవులకు నీవు చక్కని నావవంటివాడవు. నీ పాదపద్మములే లోకములకు శరణ్యము. నిన్ను గూర్చిన భక్తియే జనులకు శ్రీరామరక్ష.

లోకైకప్రభూ! భక్తజనుల సాంగత్యము నాకు కలుగుచుండునట్లు ఆశీర్వదింపుము. నా ఇంద్రియములన్నియు నీ కైంకర్యమునందే సదా సంలగ్నములై యుండునట్లు దీవిం

వుము సర్వజీవుల హృదయాంతరాళమున ద జ్యోతి స్వరూపమున వెలుగుచుండు నీయొక్క భవ్యనామామృత సేవనముచే భవరోగము నిర్మూలమై అత్యంతిక సుఖము జనులకు తప్పక కలుగగలదు సంసార బంధవిముక్తి చేకూరగలదు. నీ అనంత మహావిభూతియెదుట ఈ భూలోకమంతయు అవగింజంత నీ అఖండ భూమాస్వరూపము ముందు బ్రహ్మాండమంతయు అణువంత అట్టి సువిశాల విరాట్స్వరూపుడవగు నీకు నాయొక్క సవినయ హార్దిక నమస్కృతులు. ప్రభూ! నీ పాదారవింద యుగళ ధ్యానామృతమును అనవరతము గ్రోలుచు జీవితమును పవిత్రవంతముగా చేసికొనులాగున అనుగ్రహింపుము నీయొక్క దాసానుదాసుడనై యుండునట్లు ఆశీర్వదింపుము ఇదియే నా మొఱ

# 2 బ్రహ్మానందానుభూతికి గైకొన వలసిన జాగ్రతలు

## 1 హృదయ పవిత్రత

ఇక బ్రహ్మానందానుభూతికి గైకొనవలసిన జాగ్రత గూర్చి విచారించెదము. సాధకుడు మొట్టమొదట తన హృదయము పరిశుద్ధముగనున్నదా యని పరీక్షించుకొనవలెను. శ పాలకేంద్రముగ క్షీరసాగరముగ ఉండవలసిన మానవ హృదయము లోపాలకేంద్రముగ దోషాల నిలయముగ మారిపోవుట చాల శోచనీయము. పాలకేంద్రమైన క్షీరసాగరమందు విష్ణుభగవానుడు కాపురముండును. కావున హృదయమును పాలకేంద్రముగ క్షీరసముద్రముగ నొనర్చుకొనుట మానవుని ధర్మము. పాలు తెలుపుగ నుండును. తెలుపు సత్త్వగుణ చిహ్నము. కాబట్టి మనస్సును సత్త్వగుణయుక్తము గావించుకొనినచో మనస్సు నందలి రజోగుణ తమోగుణములను బయటకు గెంటివేసినచో కామక్రోధాది వికారములను పారద్రోలి విశుద్ధసత్త్వముగ నొనర్చుకొనినచో అత్త అట్టి శుద్ధమానసమందు భగవానుడు తెల్లగ ప్రకాశించును (క్షీరసాగరమందు విష్ణువువలె)

అట్లుగాక మనస్సును మలినముగ రజోగుణ తమోగుణ యుక్తముగ గావించుకొనినచో క్షారసముద్రమందు

మకర తిమింగలాదులు నివసించునట్లు అంగా అశాంతి తాపత్రయము మొదలైనవి కాపురముపెట్టును అట్టి మనస్సు పరమదుఃఖమునకు ఆలవాలమై యుండును

కావున విజ్ఞుడగువాడు అహర్నిశములు తన మనస్సును పరిశోధించుకొనుచు దోషములకు లోపములకు తావీయక బహుజాగ్రతగ మెలగుచుండవలెను సద్గుణములను ఆహ్వానించుచు, సత్వగుణమును పెంపొందించుకొనుచు, మనస్సును క్షీరమువలె తెల్లగ, శుద్ధముగ, మచ్చలేకుండ ఒనర్చుకొనవలెను.

ఆగమార్థంతు దేవానాం
గమనార్థంతు రక్షసాం

'ఓ దేవతలారా! రండు. ఓ రాక్షసులారా! పొండు' అను పూజామంత్రముభంగి సాధకుడైనవాడు సద్గుణరాశిని ఆహ్వానించి దుర్గుణజాలమును దూరీకరించవలెను. కనుకనే గీతాచార్యుడు పొందవలసిన గుణములను, వదలవలసిన గుణములను రెండింటిని ఒకే అధ్యాయమునందు (16 వ అధ్యాయము) పేర్కొనియుండెను

శరీరము ఆరోగ్యముగ నుండవలెననిన, రెండు కార్యములు తప్పక జరుగవలెను లోపలగల మలిన పదార్థము బయటకు పోవలెను బయటగల మంచి పదార్థము లోనికి రావలెను. ఈ రెండు కార్యములు చక్కగ జరుగుచున్నప్పుడే

దేహముయొక్క స్వాస్థ్యము చెక్కుచెదరకనుండునట్లే మనస్సుయొక్క ఆరోగ్యమున్ను బాగుగ నుంచవలెనన్న, దుర్గుణములు దుర్వాసనలు దుస్సంకల్పములు దుర్వృత్తులు బయటకు పోవలెను సద్గుణములు సద్వాసనలు సత్సంస్కారములు సద్వృత్తులు లోనికిరావలెను మనస్సు పాలవలె తెల్లగ శుద్ధముగ నుండవలెను అట్లుండినపుడే క్షీరసాగరమున విష్ణుదేవునివలె మనస్సునందు పరమాత్మ ప్రత్యక్షము కాగలడు దైవసాక్షాత్కారమునకిదియే రాజబాట

కావున విజ్ఞులగువారు సంతత సావధానులై తమ తమ చిత్తములు లోపాలకేంద్రములుగానున్నవా లేక పాలకేంద్రములుగా (సత్త్వగుణయుక్తములుగా) నున్నవా యని సర్వదా పరీక్షించుకొనుచు లోపములేవైన యుండిన వెనువెంటనే వాటిని తొలగించుకొనుచు క్షీరసాగర సదృశములుగ వానిని గావించుకొనినచో ఇక పిలవకుండగనే విష్ణుభగవాను డచటికి వచ్చి ప్రవేశించును ఎచట భగవంతుడుండునో అచట జీవున కిక ఏమికొఱత అత్తరి జన్మ ధన్యమైపోవును.

జీవుని లక్ష్యమును నిర్ణయించునది అతని కర్మయే అయియున్నది పాప కర్మచేత నరకము పుణ్య కర్మచేత చిత్తశుద్ధి జ్ఞానముచేత మోక్షము లభించుచున్నవి

కనుకనే ఒక మహనీయుడు తస్మైనమః కర్మణే — నా కర్మకు నమస్కారము అని పలికెను. ఆ వాక్యమెంతయో సమంజసముగనున్నది మానవుని ఉద్ధరించునది

కర్మయే ఆ నిని క్రిందకు బడద్రోయునదియు అతని
చే పుణ్యకర్మ సత్కర్మ దైవార్పితకర్మ నిష్కామ
కర్తృత్వరహితకర్మ మానవుని ఉద్ధరించును పాపకర్మ
యము క్రమముగ అతనికి దుర్గతిని కలుగజేయును వారి
కర్మ ననుసరించి భగవంతుడు జనులకు ఫలములను
గజేయును భగవంతుడు కర్మఫలప్రదాత జీవుడు కర్మ
ఈ ప్రపంచమున కొన్ని శాసనములు అమలులో
వి అవి తిరుగులేని శాసనములు విశ్వప్రభుత్వమందలి
ంత శాసనములను ఎవరును ధిక్కరించలేరు అవి
వగా —

1) పాపముచే దుఃఖము
2) పుణ్యముచే సుఖము
3) జ్ఞానముచే మోక్షము

గున పాపముచేసినవారు ఇహలోకమునగాని పరలోక
గాని దుఃఖమనుభవింపక తప్పరు ఒక రాయిని జార
విన అది క్రిందకు పడిపోవును భూమ్యాకర్షణచే అది అట్లు
చున్నది. అట్లే ఒక మనుష్యుడు మేడమెట్లనుండి జారి
క్రిందకుపడును అపుడును ఆ ఆకర్షణనియమమే
e law of gravity) పనిచేయుచున్నది ఎటువంటి
ప్రవాడైనను అధికారియైనను బలవంతుడైనను ధన
డైనను కాలుజారినచో క్రిందకు పడవలసినదే పీల
గా ఒక నియమము పనిచేయుచున్నది స్థూలప్రపంచ

నుండే ఇట్టి నియమములు పనిచేయుచుండ ఇక సూక్ష్మ ప్రపంచ నియమములనుగూర్చి వేఱుగ చెప్పనేల! అవి తుచ తప్పకుండ పనిచేయుచున్నవి. ఆ నియమముల ప్రకారము పాపముచేసినవారెవరైనను దుఃఖమనుభవించవలసినదే.

ఎవరికైన ఆపత్తులు సంభవించినచో దేవుడా! మాకీ విపత్తులను ఏల కలుగజేసితివి! అని ప్రశ్నించుచుందురు కాని వాస్తవముగ భగవంతునికి జీవుల సుఖదుఃఖములతో ఏలాటి సంబంధమున్ను లేదు విశ్వప్రభుత్వ శాసనముల ప్రకారము ఆ యా సుఖదుఃఖములు ప్రాణులకు కలుగుచుండును కాబట్టి కష్టములు సంప్రాప్తించినప్పుడు దాని బాధ్యత దాని కారణము మఱియొకరికి అంటగట్టక అది తన పాపకర్మముయొక్క ఫలితమేయని గుర్తెఱింగి ఇక మీదట పాపములో ఏలుపెట్టకుండవలెను

దుశ్శాసనుడు ద్రౌపదిని నిండుసభలో అవమానము చేయుదలంచినప్పుడు ద్రౌపది ఆర్తరక్షకుడైన శ్రీకృష్ణు శరణువేడెను అప్పుడు వెంటనే శ్రీకృష్ణుడు విశ్వప్రభుత్వ శాసనములతో సంప్రదించి ద్రౌపది పూర్వజన్మలో ఏదైన పుణ్యకార్య మాచరించినదాయని వారిని ప్రశ్నింప ఒక సాధుగారికి చిన్న గుడ్డపేలిక దానమొసంగెనని వారు సమాధానము చెప్పగా ఆ పుణ్యకార్యమును ఆధారముగా తీసికొనిదే శ్రీకృష్ణుడు ద్రౌపదికి సహాయమొనర్చెను. కాబట్టి వారు వారు చేసికొనిన పుణ్యకార్యములనుబట్టియే సత్ఫలితము

జగుటయు దుష్కార్యములనుబట్టియే దుష్ఫలితములు
ంభవించుటయు జరుగుచుండును

ఈ చండశాసనమును గుర్తెఱింగినవాడు మరల ఎవ్వనికైన పముచేయ నొడిగట్టునా? ఒక ప్రాణిని బాధింపనెంచునా? ్షడును అట్లు చేయడు భూమిలో ఏ విత్తనమును పెట్టిన ఫలితమును అనుభవించును కుంకుడు విత్తనము నాటినచో మఫలమును బడయును మామిడి విత్తనము పెట్టినచో ఫలమును అనుభవించును. కావున నాటునపుడే బాగుగ లోచించి నాటవలెను పుణ్యకార్యములను చేయవలెనేగాని పము నాచరింపరాదు

నవ్వుచు నవ్వుచు పాపకార్యములను చేయువాడు క్చుచు ఏడ్చుచు పరమదుఃఖ మనుభవించవలసివచ్చునని స్త్రములు హెచ్చరించుచున్నవి—

పాతకా క్రియతే కర్మ రుదతా పరిభుజ్యతే కావున ంత తెలివితక్కువాడు దేవులకు దణ్ణము పెట్టునట్లుగా తన ్తకూడా నమస్కరించి, అది శుభకర్మగా నుండునట్లుగున వరలము ప్రయత్నించవలెను. దుష్కర్మ పాపకర్మ లపలోక నను లేకుండ చూడవలెను ఇదియే విజ్ఞత ఇదియే మానవత దే శాంతికి సుఖమునకు ఏకైక మార్గము

శీవునకు కలుగు సుఖమునకుగాని దుఃఖమునకుగాని రణము అతని పురాకృత కర్మయే సత్కర్మ వలన మూఖమూ

దుష్కర్మవలన దుఃఖము జీవు డనుభవించు చుండును కావున సుఖమును వాంఛించు ప్రాణి తత్కర్మవిముఖుడై బహు జాగ్రరూకత గలిగి యుండవలెను ఇది చిన్నవిషయమని తెలుసు ఉపేక్ష చేయరాదు జీవితమునందు [illegible] దనుభవించు శాంతిగాని అశాంతిగాని ఆనందముగాని క్లేశముగాని పూర్వ కర్మచేతనే ప్రభావిత మగుట వలన జీవితం గమున కర్మ అత్యంత కీలకస్థాన మాక్రమించుచున్నది కావున ఆచరించు కర్మ పవిత్రముగా నున్నదా లోపరహితము నున్నదా పరోపకార యుక్తముగా నున్నదాయని మిఱ జాడు పదే పదే యోచించుచుండవలయును నరకముగాని స్వర్గముగాని మోక్షముగాని వారువారు చేయు కర్మము పైననే ఆధారపడియుండును పాపకార్యములచే హీనమై జన్మలు నరకబాధలు కలుగుచుండును పుణ్యకార్యముల సుఖప్రదమైన వాతావరణము, ఉత్తమజన్మ సిద్ధించుచుండును జ్ఞానవిచారణచేతను స్వస్వరూపానుభూతి వలనను మోక్షము సంప్రాప్తమగుచుండును.

కాబట్టి సమస్తమునకును కారణము వారివారి కర్మలే. ఆ కర్మను అనుసరించియే విశ్వప్రభుత్వము ఆయా ఫలములను వారి కొసంగుచుండును విశ్వమంతయు కొన్ని శాసములకు అనుగుణ్యముగ నడుచుచున్నదనియు ఆ శాసనములను ధిక్కరించి చరించువారికి తగిన శాస్తి తప్పదనియు జనుల ఎంత శీఘ్రముగ తెలిసికొనిన అంత మంచిది

ఎన్నికోట్ల జన్మలో గడచిన వెనుక సుకృతవశమున ఈ మానవజన్మ లభించినది. మోక్షసౌధ మధిరోహించుటకు నిచ్చెనవంటి ఈ అమూల్య సాధనమును ఈ మానవదేహమును ప్రాపంచిక భోగవిలాసములందు క్షణిక ఇంద్రియార్థములందు వినియోగించి అవియే పరమార్థములని తలంచి త్రిప్పబడుట విజ్ఞుకు పాడి కాదు. తెలిసికొనవలసిన విషయములెన్నియో యున్నవి. ఆచరించవలసిన సాధనలు లెక్కలేనన్ని యున్నవి. ఆయుర్దాయమా అత్యంత క్షణికమైయున్నది. విఘ్నములా తండోపతండములుగ వచ్చిపడుచున్నవి. ఇట్టి పరిస్థితిలో దినాహములు లెక్కపెట్టుచు కాలయాపన చేయుట తగదు.

ఆయుషః క్షణ ఏకోఽపి
సర్వ రత్నైర్న లభ్యతే
నీయతే తద్వృథాయేన
ప్రమాదః సుమహానహో

ఆయుస్సులోని ఒక్క క్షణకాలము వృథాగ గడచిపోయినచో, ఎన్ని రత్నములు వెచ్చించి అయినను ఆ క్షణమును తిరిగి తెచ్చుకొనలేము. కాబట్టి జీవితమును వ్యర్థముగ గడిపివేయుట మహాప్రమాదమని వసిష్ఠులవారు ఆనతిచ్చిరి.

కనుక సత్కర్మ లాచరించవలెను. భగవద్భక్తి అలవరచుకొనవలెను. శాసవరో తన నిజస్వరూపమేమియో

తృష్ణముగ విచారించవలెను. దేహముపైన దేహ సంబంధమైన బంధ్వాదులపైన ఇతర దృశ్యపదార్థములపైన మమత్వమును విడనాడవలయును

ప్రతిదినము ఉదయము నిద్రలేచినది మొదలు మరల రాత్రి పరుండు వఱకును కాలము ఏ విధముగ గడచుచున్నది జాగ్రత్తగ గమనించుచు పాపకార్యములందు ఇతరులకు మనస్తాపము కలుగచేయు కార్యములందు మనస్సును ప్రవేశింపనీయక, పుణ్యకార్యములందు దైవకార్యములందు పరహిత కార్యములందు మాత్రమే ప్రవర్తించుచుండవలెను ఒక డైరీపుస్తకమును ఏర్పాటు చేసికొని తన లోటుపాట్లు దానిలో వ్రాసికొనుచు, మఱునాటిదినము వాటిని పరిహరించుకొనుటకు యత్నశీలుడగుట ఉత్తమము. ఈ ప్రకారముగ మనస్సునందలి కల్మషమునంతను ఎప్పటికప్పుడు కడిగివేయుచు మరల దానియందు మురికి చేరకుండులాగున బహు జాగరూకుడై యుండవలెను

నిర్మల దర్పణమున (అద్దమందు) ముఖము చక్కగ ప్రతిబింబించునట్లు శుద్ధ చిత్తమున అధిష్ఠానమగు ఆత్మ చక్కగ ప్రతిబింబించగ మనుజునకు పరమానందము జీవితమున వ్యక్తమగుచుండును. విశుద్ధ సత్త్వగుణముతో కూడిన నిర్మల మనస్సు ఆత్మయందు లయింప అమనస్కస్థితి సంభవించును అదియే మోక్షము. అట్టి మహోన్నతస్థితి సత్కార్యాచరణచేతనే సిద్ధించును. కాబట్టి ప్రతివారును వారివారి

కశ్మలను శుద్ధిచేయగొనవలెను ఇది చెప్ప చేశను తెలియ పోయినను వేరే కటిలేదు. చిత్తమునందు ఏ విధమైన కశ్మలయు ఉండరాదు

కశ్మలమనగా మురికి, మాలిన్యము మురికిని ఎవరును సహించరు దానిని సహించుటకు ఎవరును ఇష్టపడరు. బట్టల గాని, దేహముగాని మురికి ఉన్నదని తెలిసినచో వెంటనే దానిని తొలగించివేయుదురు. ప్రతిదినము ప్రతివారు ఉదయము నిద్ర లేవగనే వారివారి ఇండ్లను ఊడ్చుకొని చెత్తచెదారమును పారవేసి శుభ్రపరచుకొందురు గదా! అట్లే వంటిలోగల మురికిని నిత్యకృత్యముల ద్వారా వంటిపైగల మురికిని స్నానాదులద్వారా తొలగించివేయుచుందురు గదా! ఆ ప్రకారము ఎందుకు చేయవలెను? మురికి అనారోగ్యమని వారికి తెలియును కాబట్టి మురికి దేహమునకు అపాయము కలుగజేయునను సత్యము సర్వులకును విదితమైయున్నది కాబట్టి దాని వెనుకను దరికి చేర్చుటకు ఇష్టపడరు అట్లే మనస్సునందును కశ్మలము కలదు. అది ఇప్పటిదికాదు. ఎన్ని జన్మలనుండియో జీవుని వెంటాడుచు వచ్చుచున్నది బహుకాలము నుండియు అది చిత్తమున రూఢిపడి వేళ్ళు పాతుకొనియున్నది గీతాచార్యుడు చెప్పినట్లు అది 'సువిరూఢ ముగ' వర్తించుచున్నది. ఆ కశ్మలమును తొలగించుటయే జీవుడు చేయవలసిన పని ఆమురికిని శీఘ్రాతిశీఘ్రముగ దూరీకరించుటయే జీవుని కర్తవ్యము

ప్రతివానికి రెండు దేహములు గలవు స్థూల సూక్ష్మదేహము అని స్థూలదేహముయొక్క ఆరోగ్యవి- షయమందఱును జాగరూకులైయున్నారు. మురికి అంటినచో వదలించుటగాని రోగము వచ్చినచో చికిత్స చేయుటగా వారు ఆచరించుచునేయున్నారు. ఇంతమాత్రముతో పని పూర్తికాలేదు. సూక్ష్మదేహముయొక్క విషయమై కూడ జాగరూకత వహింపవలయును. దానియొక్క శుభ్రతనుకూడ కాపాడుకొనుచుండవలెను. దానియందు కశ్మలము చేరియున్నది. దానిని ఉపేక్ష చేయక పెద్దలవలన సద్గురువు వలన శాస్త్రములవలన దాని తెలిసికొని దాని నివారణ పద్ధతులను కనుగొని దానికి ఉద్వాసనము కల్పింపవలెను. సకాలమునకు రోగనిర్ణయము చేసి చికిత్స కావించనిచో క్రమక్రమముగ అది మనజీవితమున కెట్లు అపారమగు హాని కలుగజేయునో అట్లే మనసందలి కశ్మలమును గూర్చియు సకాలమున యోచించి తొలగించుటకు యత్నించనిచో చివరకు ఘోరమైన హాని కలుగజేయగలదు. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ గీత ఉపక్రమించిన వెనువెంటనే ఈ కశ్మలమును గూర్చి హెచ్చరించెను.

కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్

ఓ అర్జునా! ఈ మహావిషమసమయమందు ఈ (మోహము) నీకెటులుండి ప్రాప్తించినది ? — అని

చార్యుడు అజ్ఞుని ప్రశ్నించెను మనస్సునందలి కల్మషము మహాప్రమాదకరమైనది కాబట్టియే సర్వజ్ఞుడైన పరమార్థ దానిని గూర్చి తొలుదొ ప్రస్తానే ప్రస్తావించుటయు దాని నివారణకై ఉపాయములను సెలవిచ్చుటయు జరిగినది.

జీవుడు వాస్తవముగ నిర్మలస్వరూపుడు నిత్య శుద్ధ బుద్ధ చిదాత్మయే అతడు అతనియందు కల్మషము ఆగంతుకమైనదే కాని స్వతస్సిద్ధముకాదు మహాత్ముల దివ్యప్రబోధముచే అద్దానిని తొలగించివైచి అతడు తన సహజ నిర్మల స్వభావ మును తిరిగి పొందవలెను కాబట్టి సాధకుడు అనేక జన్మార్జిత మైన వాసనావంకిలమును పోగొట్టుకొనుటకు ప్రయత్నము చేయుట తాను సచ్చిదానందస్వరూపమగు ఆత్మయేకాని దేహాది దృశ్యపదార్థము కాదని పదేపదే చింతన జేయుట— అను ఈ రెండు సాధనలను గావించుచుండవలెను మొదటి సాధన వాసనాక్షయమని రెండవ సాధన తత్త్వజ్ఞానమనియు చెప్పబడుచుండును తత్త్వజ్ఞానముకొంక్ష సహాయముచే అనగా దృశ్యవస్తువులు నశ్వరములనియు ఆత్మ శాశ్వత మనియు తాను ఆత్మయేకాని దేహాది దృశ్యపదార్థము కాదనియు నిరంతరము చింతన జేయుటచేత మనస్సునందలి వాసనలు జన్మాంతర కల్మషము క్షయింప అనగా వాస నాక్షయముకాగా మనోనాశము దానంతటదియే సిద్ధించును ఎపుడు మనస్సు లయించునో అపుడు జీవుడు స్వస్వరూప ఆత్మ స్థితియందు నిలుకడగలిగియుండును. అదియే మోక్షము

కాబట్టి విచారణద్వారా మొట్టమొదట జీవుడు తన
ందు బహుకాలమునుండి జతించియున్న కర్మలనుకు
షయమును మరికిని తెలిసికొని దానిని శ్రద్ధాపూర్వకముగ
లగించుకొని తిరిగి దానిని దరికి చేర్చరాని మహాజగలయును
ప్రకారముగ భవరోగమును గుర్తించి పూర్ణారోగ్య
ముడు కావలెను ఆరోగ్యమే మహాభాగ్యమని మనుజవరాదు
రారోగ్యము మానసికారోగ్యము రెండును లభించినవుడే
డు రోగరహితుడై నిత్యనిరంజన ఆత్మస్వరూపుడై వెలయు
ను అట్టి ఆత్మరూప పరమానందానుభూతియే జీవితము
కు- పరమలక్ష్యము!

చిత్తశుద్ధి కొఱకై సాధకుడు పవిత్ర కార్యములనే
రించుచు తనపురోభివృద్ధికొఱకై కొన్నికట్టు నియమము
లేర్పాటుచేసికొని వానిని జాగ్రత్తగ పరిపాలించుచుండ
ను ఆధ్యాత్మిక నియమపాలనము ముముక్షువునకు చాల
సరమైయున్నది

## 2 నియమపాలనము

సూర్యుడు నియమము తప్పక సరిగా ఉదయించు
న్నాడు నియమము ప్రకారము అస్తమించుచున్నాడు
ద్రుడు, నక్షత్రములు తమ తమ నియమముల ప్రకారము
గా గమనము సల్పుచున్నవి. వసంతకాలము కాగానే
క్షి చిగురించుచున్నవి. గ్రీష్మఋతువునందు తాప మధికరించు

చున్నది ప్రతి సంవత్సరము ఆ యా ఋతువులందు నియమ ప్రకారము ఆ యా కార్యములు జరుగుచున్నవి ప్రకృతి యంతయు నియమబద్ధముగ వర్తించుచున్నది విశ్వమును చక్కగ పరీక్షించి చూచినచో ఈ నియమపాలనమను ధర్మము కొట్టవచ్చినట్లు కనిపించును.

మఱి మానవుడు సద్గతిని పొందవలెనన్న ఈ నియమ పాలనము అవసరము లేదా ? ప్రకృతి బోధించు ఈ అపూర్వ ధర్మమును మానవుడు ఎన్నటికిని విస్మరించరాదు ఉపేక్షించ రాదు. న శ్రేయో నియమం వినా —నియమము లేనిచో శ్రేయస్సు కలుగదు—అని పెద్దల వాక్యము వ్యక్తిగాని సంఘమునను గాని జాతిగాని నియమము లేనిదే అభివృద్ధియే లేదు

పశువు పుట్టినపుడు ఎటులుండునో చనిపోవునపుడును అటులనే యుండును సింహము పుట్టినపుడు క్రూరముగా నుండును చచ్చునపుడు అట్లే యుండును మార్పు ఉండదు స్వభావమునందుగాని సంస్కారమునందుగాని వాటికి అభి వృద్ధియే కానుపించదు మానవుడును అట్లుండినచో ఇక మానవత్వముయొక్క అధిక్యత ఏమి? ఎనుబదినాలుగు లక్షల జీవరాసులలో మానవునియొక్క ప్రత్యేకత ఏమి? స్వభావము మారవలెను సంస్కారమునందు అభివృద్ధి గోచరించవలెను. మానవుడు మాధవుడుగా మారవలెను. అట్లుమారుచున్నాడా? లేదు. పై పెచ్చు దిగజారి దానవుడుగా పరిణమించుచున్నాడు

మానవుడు తనకు భగవానుడు సృష్టిలో అత్యంత సమున్నత స్థానమును ప్రసాదించెనని భావించి జీవితమును నియమబద్ధముగా గావించుకొని ఇతను సమున్నతిని బడయుటకై తీవ్రతర ప్రయత్నమాచరించవలెను. బహుజన్మార్జిత ప్రాపంచిక వాసనల ననుసరించి మనస్సు వక్రమార్గమున నడుచుండును. అసురమార్గమున పయనించుచుండు నా పరమార్థ నియమము సదనుష్ఠానము అను త్రాటిచే దానిని బంధించి పరమాత్మయందు స్థాపితమగునట్లు చూడవలెను. కొన్ని కొన్ని చక్కని నియమము లేర్పరచుకొని వాటిని జీవితమందు ఆచరణయందుంచుకొనవలెను.

ప్రతి దినము ఉషఃకాలమున బ్రాహ్మముహూర్తమందు నిద్రలేచుట స్నానసంధ్యా జపతప ప్రార్థనాదులను గావించుట సద్గ్రంథ పఠన మొనర్చుట శక్తికొలది బీదలకు సహాయము చేయుట. నిత్య జీవితమునందు ఏవిధమైన పాపకార్యమాచరింప కుండుట మరల రాత్రి పరుండబోవునపుడు భగవద్ధ్యానమాచరించుట మొదలగు నియమములను మానవుడు ఆచరణ యందుంచుకొనవలెను.

ఈ నియమము లన్నిటిలోను దైవచింతన ప్రార్థన అతి ముఖ్యము తను సృష్టించి తనకు ఆయురారోగ్యములను ప్రసాదించి మోక్షమునకు పరమయోగ్యమైనట్టి మానవ జన్మను అనుగ్రహించి ఎన్నియో అనుకూలములను గావించుచున్న పరమేశ్వరునకు మానవుడు మహాకృతజ్ఞుడై నిర

లేవగనే ప్రప్రథమమున ఆత్మవాసియుని సంస్మరించవలెను
మరల అవకాశమును కలుగజేసికొనుచు నిత్యజీవితమందు
ప్రార్థనాదులను గావించుచుండవలెను ప్రార్థన చేయనిదే, దైవ
చింతన ఒనర్చనిదే భోజనముగాని ఉపాహారముగాని తీసి
కొనరాదను నియమమును ఏర్పరచుకొనవలెను. ఎన్ని
పనులున్నప్పటికిని భోజనమును ఎవరును వదలరుగదా! అట్లే
ప్రార్థనను దైవధ్యానమును కూడ వదలరాదు. అన్ని నియమము
లందును ఈ నియమము చాలా ముఖ్యమైనది.

ఇక రెండవది ధర్మపరిపాలన ఒక వంక ప్రార్థనాదులను
చేయుచు వేరొకవంక ధర్మమునకు విరుద్ధమైన ఆచరణ
చేయుచుండినచో పరులను బాధించుచుండినచో అన్యాయము
అవినీతి అసలు జరుపుచుండినచో చీకటి మార్గమున
నడుచుచుండినచో అది సరికాదు భగవంతుడు ధర్మ
స్వరూపుడు ధర్మసంస్థాపనార్థాయ —అనునట్లు ధర్మోద్ధరణ
కొరకే యాతడు అవతరించుచుండును కాబట్టి భగవంతునకు
అతి ప్రియమైన ధర్మమును మారీకరించి ధిక్కరించి దేవుని
చింతన చేయుచుండినచో ఆ దైవచింతనకు అర్థమే లేదు దాని
లు వేయుండదు కాబట్టి దైవచింతనతో పాటు ధర్మాచరణ
గూడ జీవుడు తప్పక కలిగియుండవలెను

ఈ ప్రకారముగ మానవుడు జీవితమును నియమబద్ధ
ముగ గావించుకొని సృష్టిలో తనకొసంగబడిన మహోన్నత
స్థానమును సార్థకపఱచుకొని తన్ను తాను సంస్కరించుకొని

భగవత్కరుణకు పాత్రుడై తరించవలెను. అలసత్వము సోమరితనమును పూర్తిగ విడనాడి ఆత్మోన్నతికై అహరిములు పాటుపడవలెను.

సోమరితనము ఏ రంగమందును పనికిరాదు. ఆధ్యాత్మికరంగమందు అసలు పనికిరాదు. బద్ధకము అలసత్వము తమమున్నగు వానికి పారమార్థిక క్షేత్రమందు తావేలేదు. విద్యార్థి పరీక్షయందు ఉత్తీర్ణుడగుటకు రాత్రింబగళ్లు ఎంతగా శ్రమించుచున్నాడు. సామాన్యమగు లౌకిక విద్యయందే ఇంత పట్టుదల అధ్యవసాయము కార్యదక్షత అవసరమైనపుడు పారలౌకిక విద్యయందెంతటి తీవ్ర ప్రయత్నమవసరమో ఊహించుకొనవచ్చును.

ఇక ఆయుస్సు చూడగా మహాక్షణికమైనది. ఏ చెట్టు యొక్క కొమ్మచివరగల ఆకుపై వ్రేలాడు మంచువలె అది క్షణభంగురమైయున్నది. కనుకనే విష్ణుభగవానుడు గరుత్మంతునకు ఉపదేశించునపుడు రేపు చేయవలసిన కార్యమును ఈరోజే చేయవలెననియు సాయంత్రము చేయవలసిన కార్యమును పొద్దుననే చేసివేయవలెనని మృత్యువు ఎవరికొరకును వేచియుండదనియు హితము చెప్పె. కావున మోక్ష ప్రయత్నమందు విలంబము లేక ధోరణి ఏ మాత్రము భావ్యముకాదు. అద్దానికి స్వస్తి తక్షణమే సాధనరంగమందు దుముకవలెను.

ఏ కార్యమైనను తక్షణమే చేయక జాగుచేయువాడు దీర్ఘసూత్రి యనబడును. ఇప్పుడే ఏమి తొందర? నిదానముగా చూచుకొనవచ్చును అని తలంచి కార్యమును వాయిదా చేయువాడు దీర్ఘసూత్రి అతడు పనిని తెముల్చడు తరువాతి తరువాత అనుచుండును తమోగుణప్రభావము చే బద్ధకము ఆవహించిన కార్యమును నెరవేర్చక రోజులు గడుపుచుండును దీర్ఘసూత్రి అనుపదమునకు అర్థము తెలియక ఒకరు మరి యొకరిని దానిని గూర్చి ప్రశ్నింపగా అతడు చెప్పిన సమాధానమీ విధముగనున్నది. One that has a long rope to tie himself తన్ను తాను బంధించుకొనుటకై ఒక పెద్దత్రాడు తెచ్చుకొను వాడేదీర్ఘసూత్రి. దీర్ఘమనగా పొడుగు సూత్రమనగా త్రాడు పొడవైన త్రాడు కలవాడు దీర్ఘసూత్రి ఈ నిర్వచనము చాల చక్కగయున్నది పెనుకటికి ఒకశిష్యుడు గురువుగారిని ఈ విధముగ ప్రశ్నించెనట స్వామి! ఏశాస్త్రము చూచినా ఏ పురాణము చూచినా ఒక విషయము స్పష్టముగ నున్నది. ఏమనగా జీవుని ఆయుష్కాలముకాగా యమధర్మరాజు ఒక త్రాడు పాశమును తీసుకొనివచ్చి అతని మెడకుచుట్టి ఈడ్చుకొనిపోవునట! అయితే గురువుగారూ! రోజు ప్రపంచము మొత్తము మీద కొన్ని వేలమంది చనిపోవుచుందురుగదా! మరి అన్ని వేలత్రాళ్లు యముడుగారు ఎక్కడ నుండి తెచ్చునో వారిలోకములో త్రాళ్లు తయారుచేయు ఫ్యాక్టరీ ఏమైనయున్నదా!

శిష్యుని వాక్యములను విని గురువునవ్వి నాయనా! తాళ్ళనుగూర్చిన పెనవయమున కేమియును లేదు బిగికియుం గనే వారికివారు తమచుట్టూ తాళ్ళుచుట్టుకొనుచున్నారు అహంకారము ఒకతాడు మమకారము ఒకతాడు ఈర్ష్య ఒకతాడు కోపము ఒకతాడు. ఈ ప్రకారముగ వారువారి తయారుచేసికొని తమతమ మెడలకు ముందుగనే చుట్టుకొని యున్న ఆ తాళ్ళను యముడు పట్టుకొని లాగుకొని పోవును. అంతియే అని సమాధానమొసంగెనట! కాబట్టి జీవితకాలములో వారువారు తయారుచేసికొనిన ఈ కామక్రోధాదులన తాళ్ళన్నిటిని వివేకముచే విజ్ఞానముచే వైరాగ్యముచే, భగవద్భక్తిచే ఛేదించివేయవలెనేకాని దృఢపరచుకొనరాదు దీర్ఘసూత్రి అనగా సోమరి అతడు ఈ త్రాళ్ళను అనవసరముగ పెంచుకొనుచుండును కనుకనే అతడు జీవితములో సత్ఫలితములను పొందజాలక అధోగతి చెందుచుండును

కాబట్టి పనులను ఎప్పటికప్పుడు తెముల్చివేయుచుండవలెను. ఆలస్యము చేయరాదు ఆధ్యాత్మిక సాధనవిషయములో అశ్రద్ధ పనికిరాదు మానవజన్మ మరల మరల వచ్చునను గ్యారంటీలేదు ఇప్పుడున్న సదవకాశములు తిరిగి ఏర్పడునను హామీలేదు కావున అమూల్యమగు ఈ మానవజీవితమునందు ఆచరించదగిన మోక్షప్రయత్నములను జాగుచేయక ఇప్పుడే ఆచరించవలెను శమదమాదులు యమనియమాదులు భక్తి జ్ఞానవైరాగ్యములు మున్నగు వానిని యిప్పుడే ఒక్కొక్కటిగ

చక్కగ ఆలోచించుచు కాలయాపన దీర్ఘసూత్రివలె తన పనులను వాయిదా వేయరాదు

రావణాసురుడు తన అంత్యకాలమున సమీపమునున్న వారితో ఈ ప్రకారముగ చెప్పెనట నేను నా జీవితకాలములో ముఖ్యమైన మూడు పనులు సాధించదలంచితిని. మొదటిది స్వర్గమునకు నిచ్చెన వేయుట రెండవది నా దేశము చుట్టనున్న లవణ సముద్రజలమునంతను మధురజలముగ మార్చివేయుట మూడవది నరకలోకములో పాపులు బాధ లనుభవించు చీకటి కొరంగము లన్నింటిని వూడ్చివేయుట తరువాత చేయుదములే అని కాలయాపన చేయుచు వచ్చినందువలన ఆ పనులను నేను నా జీవితకాలములో నిర్వహించలేకపోయితిని కాబట్టి ఎప్పుడు చేయవలసిన పనిని అప్పుడే చేసివేయుట ఉత్తమము నేను నా జీవితములో నేర్చుకొనిన గొప్ప పాఠ మిది

ఆధ్యాత్మరంగమున ఈదీర్ఘసూత్రత్వము (సోమరితనము) మహాప్రమాదకరము కాబట్టియే శ్రీకృష్ణపరమాత్మ దానిని తమోగుణములో చేర్చివైచి దాని నవలంబించువాడు తామస కర్తని పేర్కొనెను.

విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే (18-28) ఏడుపుగొట్టువాడు పనులను ఇప్పుడే చేయక తరువాతకు వాయిదా వేయువాడు తామసకర్త యనబడును.

కనుక సాధకుడగువాడు తమోగుణములో చేరిన ఆ దీర్ఘసూత్రత్వమును ఏ కాలమందును అవలంబించక శాంతముగ గంభీరముగ తన సాధనలను కొనసాగించుకొనుచు పోవుచుండవలెను అలసత్వమునకు ఏ కాలమందును చోటీయరాదు అపుడు మాత్రమే జీవుడు తన లక్ష్యమును సాధింగల్గును. తన భవిష్యత్తును చక్కగ రూపొందించగల్గును

## దూరదృష్టి

వర్తమానకాలము మాత్రము దృష్టియందుంచుకొనున పశువు భవిష్యత్కాలమును కూడ యోచించువాడు మానవుడు భావికాలమున నాగతి యేమగును? మరణానంతరము నా పరిస్థితి యెట్లుండును? నరకమా స్వర్గమా మోక్షమా? నాపాలిటికి వీనిలో ఏది సంభవించును? భావికా దుర్గతిని తప్పించుకొనుట ఎట్లు? మరల తల్లిగర్భము నకు రాకుండుటకై అవలంబించవలసిన ఉపాయ మెద్ది? గర్భవాసము తప్పించుకొని కాలచక్రమున కర్మచక్రమున తగుల్కొనకుండ విముక్తిపొందు మార్గమెయ్యది? — అని ఈ ప్రకారము వర్తమానకాలమున యోచించి భావికాలప్రశ్నలను తీర్చిదిద్దగలవాడు మానవుడు మానవునకు ఈ అపూర్వశ సామర్థ్యములను భగవాను డొసంగియున్నాడు పశుపక్ష్యాదులుగాని, క్రిమికీటకాదులుగాని వద్యేల మానవేతరము

దృష్టిని విసనాడి దీర్ఘదర్శియై చెన్నొందవలయును. వర్తమాన కాలమేకాక భవిష్యత్కాలముకూడ అతని దృష్టియందు మెలగుచుండవలెను.

రోగగ్రస్తుని ముసలివానిని మరణించినవానిని ముగ్గురిని చూచి బుద్ధుడు సంసారముపై రోతజనించెను. ప్రతివారికిని భయంకరమగు ఆమూడవస్థలు ఏనాటికైనను దాపురించగలవు. కావున వానిని దాటివేసి వానిని జయించి శాశ్వతసుఖము అవిచ్ఛిన్న ఆనందము జన్మరాహిత్యము ఏ ప్రకారము లభింప గలవని యతడు తీవ్రముగ ఆలోచించి దీర్ఘముగ పర్యాలోచించి, నిర్వాణపదవికి మార్గమును కనుగొనెను. మనస్సు నందలి మాలిన్యమును బోగొట్టి పవిత్రాచరణగల వారై ఇంద్రియములను అదుపులోనుంచుకొని వాసనా క్షయము నవలంబించి నిష్కల్మషమగు ఆ మనస్సును అధిష్ఠానమగు ఆత్మయందు లయింపజేయుటయే నిర్వాణరూపమోక్షమునకు ఏకైకమార్గము. కాబట్టి దుఃఖరాహిత్యమును శాశ్వతానంద రూపకైవల్యమును బడయదగోరువారలు యంతఃకరణమును శుద్ధమొనర్చుకొని దీర్ఘదర్శులై తమభవిష్యచ్ఛ్రేయమును గూర్చి ఇప్పుడే యోచనచేయుచు తీవ్రసాధన పరులై మెలగ వలసియుండును. సాధనలు గావించుటకు బాల్య,యౌవనములే సరియైన సమయములు వార్ధక్యమునందు అనేక ప్రతిబంధకములు ఎదురగుచుండును. కాబట్టి సాధన చక్కగా జరుగుటకు వీలుండదు. కాబట్టి విజ్ఞుడగువాడు తనజీవిత వసంతమందే

వార్ధక్యము దాపురించినపుడు శరీరము ముడుతలు పడిపోవును నడక తొట్రువడును. పళ్ళు ఊడి పోవును చూపు మందగించును చెవులు అధిరమగును నోటినుండి చొంగ కారును ఇంటివారు బంధువులు చెప్పిన మాట వినరు భార్య పరిచర్య చేయదు స్వంత కుమారుడున్న తిరగబడును ఆహా! ముసలివాని పరిస్థితి ఎంత కష్టము.

కాబట్టి ముసలితనము జీవునకు ఒక బాధాకరమైన అవస్థయేయగును. ఆ వార్ధక్యమునందు ఆసనము వేసికొని కూర్చుని ధ్యానము సల్పుదమూ యనిన కాళ్ళుపట్టుకొని పోవును. భగవద్గీత ఉపనిషత్తులు భారతభాగవత రామాయణములు చదువుదమూయనిన కంటికి చత్వారము వచ్చుటచే చూపుఆనదు. హరికథలు వేదాంతోపన్యాసములు విందుమూయనిన చెవుడు వలన అది సాధ్యముకాదు గీతా శ్లోకములు ఉపనిషద్వాక్యములు కంఠస్థము చేయుదుమూయనిన జ్ఞాపక శక్తి మందగించుటచే నిలుపడదు ఇట్టి పరిస్థితిలో ఆశ తీరించుటకు వార్ధక్యమున యత్నము చేయుటెట్లు? కావున మోక్షకాంక్షి బాల్య యౌవనములందే పరమార్థ సాధనలను పరిపూర్తి గావించుకొనుట శ్రేయస్కరము

జరాదర్శిత వర్త్మానం ప్రచండవ్యాధిసైనికః
మృత్యుశ్శత్రురధిష్ఠోఽపి శ్రాకారం కిం నపశ్యసి

వృద్ధాప్యమను యోధుడు ముందు దారిచూపుచుండ భయంకరవ్యాధులను సైనికులతో గూడి మృత్యువను

శత్రువు నీపై దండెత్తుటకు వచ్చుచున్నాడు రక్షకుడగు భగవంతుని ఏల ఆశ్రయించకున్నావు? అని మన నీయులు హెచ్చరిక చేయుచున్నారు ఒక వృద్ధుని ఒక శవమును చూచుటయే తడవుగా సిద్ధార్థునకు (బుద్ధునకు) పరమ వైరాగ్య ముదయించినది వార్ధక్యము, మృత్యువు అను పెను భూతములు మీద పడనుండగా ఈ ప్రపంచమున మానవుడు పూర్ణశాంతిని ఎట్లు నోచుకొనగలుగునని అమ్మహనీయుడు తనలో తెన్నగా వితర్కించుకొని వాటిని అధిగమించుటకు త్యాగము నన్వేషించి కృతకృత్యుడయ్యెను.

జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతన్తియే

అని గీతయందు భగవానుడు తెలిపిన విధముగ శాశ్వతమగు పరమాత్మ నాశ్రయించినవాడు వార్ధక్యమును మృత్యువును అవలీలగ జయించివేయగలడు భగవదాశ్రయమను ఈ పవిత్ర కార్యమును మానవుడు తన జీవితమునందు ఎంత శీఘ్రముగ నెరవేర్చుకొనిన అంతమంచిది ముసలితనము రాకపూర్వమే ఇట్టికార్యమును సాధించివేయవలయును

దంతంబుల్ పడనప్పుడే తనువున దార్ఢ్యంబు నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు గానప్పుడే
వింతల్ మేన జరించనప్పుడె కురుల్ వెల్వెల్ల గానప్పుడే
చింతింపన్వలె నీ పదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా

అని ధూర్జటి మానవ కర్తవ్యమునుగూర్చి చక్కగ ప్రబోధించెను దైవకార్యమును జీవితవసంతమున ఆచరింపక తరువాత తరువాత' అని వాయిదా వేయుచు మిగుల సేవకులను లెక్కించుచుపోవువారు అలసత్వమునకు అవకాశమిచ్చువారు ఇల్లు కాలిపోవుచుండ బావి త్రవ్వువంటివారై యగుదురు మఱియు యౌవనకాల జవసత్వమును శక్తి సామర్థ్యములను కామాదిరాక్షసులకు ధారవోసి ముసలితనమున పరమార్థసాధనలకు గడంగువాడు అశక్తత్వ కారణముచే ఆ యాసాధనలను పరిపూర్ణముగ నెరవేర్పజాలకుండును. కావున బాల్య యౌవనములే ఆధ్యాత్మ సాధనలకు సరియైన సమయములు వానిని వృథాచేయరాదు ముముక్షువగువాడు వృద్ధాప్యమున జీవునకు సంభవింపనున్న ప్రతిబంధకములను ముందుగనే చక్కగ యోచించి ఆ ప్రమాదము నావరించక పూర్వమే జప తపః ధ్యాన విచారణాది సాధనలను త్వరితముగ సాధించివైచి భగవత్కృపకు పాత్రుడై ఈ జీవితమందే ఆత్మసాక్షాత్కారమును బడయవలయును

కొందరు బాలురు యువకులు ముసలివారిని ఎగతాళి చేయుచుందురు వారినిగూర్చి పరిహాసముగా పలుకుచుందురు ఆ ముసలి తనము తమకు తప్ప తక్కినవారి కందఱికిని సంక్రమించునని వారి భావన అయియుండవచ్చును. ఈనాటి బాలుడు ఎల్లప్పుడు బాలుడుగనే యుండడు ఈనాటి యువకుడు ఎల్లప్పుడు యువకుడుగనేయుండడు దేహములు

మారుచుండును. చిత్రములు పరివర్తన చెందుచుండును. మనుజుడు కొంతకాలమునకు తండ్రియగును తండ్రి కొంత కాలమునకు తాతగా మారిపోవును. కావున వార్ధక్యమనునది ఏ ఒకానొకని గ్రహచారమో కాదు. సర్వులకు పట్టి పీడించు చునుభూతమే అది దేహమును ధరించిన యెవడును దానిని తప్పించుకొనిపోలేడు వృద్ధులను అపహసించుటకు సాహసించు చున్నవారు ఈసత్యమును గుర్తెరిగి తమ అకృత్యములనుండి యెంత శీఘ్రముగ విరమించు కొనిన అంత శ్రేయస్కరము

యోగవాసిష్ఠ ప్రసంగ సందర్భమున దశరథుని ఆస్థానమందు వందలకొలది ముముక్షువులు భక్తవరేణ్యులు తపస్సంపన్నులు వసిష్ఠుని బోధామృతమును ఏకాగ్రచిత్తులై తనివితీర గ్రోలుచుండ బోధయంతయూ సమాప్తమైన తదుపరి విశ్వామిత్ర నారదాది శ్రోతలెల్లరు తమ యదృష్టమును కొనియాడుచు అట్టి మహత్తర తత్త్వబోధ ఇదివఱకెన్నడును కాను వినియుండలేదని సభాముఖముగ తెలుపుచు పరమానందనిమగ్నులై యుండ ఎవరి నిమిత్తమై వసిష్ఠులట్టి దివ్యబోధను గావించెనో అట్టి శ్రీరామచంద్రుడు మాత్రము మౌనముగా యుండుట గమనించి గురుదేవుడగు వసిష్ఠులందులకు కారణమును తెలిసికొనగోరగా ఆ మహాశయుండగు రామచంద్రుడిట్లుపలిచెను— మహాత్మా గురుదేవా! తమ అఖండ బోధామృత వృష్టిచే నాజన్మ పావనమైనది. నాకు పరమ సంతుష్టి జనించినది కాని ఒక్క విషయమును తలంచు

ఆదియెంత హాస్యాస్పదమైన కృత్యమో అట్టే మృత్యుదేవత శరీరమును భక్షించివేయుటకు సిద్ధముగనుండ రోగములు దేహమును నాశముచేయుటకు కాచుకొనియుండ ఇంద్రియములు స్వస్థతను గోలుపోవుటకై కాలమును నిరీక్షించుచుండి దై వకార్యమును ఇప్పుడే ఆచరింపక మీనమేషములు లెక్కించుచు తరువాత తరువాత అని వాయిదావేయుచు నుండువాని చర్యయు హాస్యాస్పదమైనదేకాగలదు.

రోగా క్షుధన్తి సతతం ప్రబలాశ్శరీరం
కామాదయోఽప్యనుదినం ప్రదహన్తి చిత్తం
మృత్యుశ్చ నృత్యతి సదా కలయన్ దినాని
తస్మాత్త్వమద్య శరణం మమ దీనబన్ధో

ఓ దీనబంధూ ! పరాత్పరా ! తీవ్రతరములగు వ్యాధులు శరీరమును నిరంతరము బాధించుచున్నవి. కామాది వికారములు వేధించుచున్నవి మృత్యువు రోజులు లెక్కపెట్టుచున్నది కాబట్టి నీవే నాకిపుడు శరణ్యుడవు నన్ను రక్షించువారు వేఱొకరులేరు! అని ఒక భక్తుడు భగవంతుని హృదయపూర్వకముగ ప్రార్థించెను

దీప మున్నప్పుడే ఇలు చక్కపెట్టుకొనుట విజ్ఞుని లక్షణము శక్తివంతములగు బాల్యకాలమును యౌవన కాలమును వృథాచేయరాదు పరిస్థితులు చేయిజారక పూర్వమే వివేకవంతుడు తాను వచ్చిన పనిని సరిచేసుకొని

వలెను 50 వ వత్సరముల వయస్సు దాటినచో ఇక ఆనపుడు ప్రమాదస్థాయిని (Danger zone) చేరుకొనినట్లే భావించవలెను గవర్నమెంటువారు అట్టివారిని అశక్తులుగా రయించి ఆ వయస్సు 60 చెను దాటగనే వారిని ద్యోగమునుండి విరమింపజేయుచున్నారు

జన్మ మృత్యు జరావ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్ ని గీతాచార్యుడగు శ్రీకృష్ణపరమాత్మ వార్ధక్యము మున్నగు వీటియందు గల దుఃఖమును దోషములను ముందుగనే గ్రహించి అవి సంభవింపకపూర్వమే ఆత్మవిచారణ ద్వారా జీవితమును కడతేర్చుకొనుటకు యత్నింపవలసినదిగా హెచ్చరించెను కాబట్టి వృద్ధాప్యము రాకను దాపురించని కాని ఆధ్యాత్మిక సాధనను ముఖ్యముగ ఆచరించుచు దాపురించినవారు తమశక్తి ననుసరించి ఏ తపజపు సాధ్యమౌ-ంతవరకు జపధ్యానవిచారణాది సాధనలను గావించుచు ఈ విమూల్య మానవజీవితమునందు భగవత్సాక్షాత్కారమును పరమ లక్ష్యమును ఏదిరూపముగ సాధించివేసి బ్రహ్మానంద మనుభవించవలెను ఏమైనా పాటుతేక ఆధ్యాత్మిక సాధకులను మరల మరల గావించుచుండవలెను సాధనలను తీవ్రగ త్వరపెంచుచు ఉండవలెను.

గురువు బోధించిన సముపదేశమును శిష్యుడు మరల మరల చింతనచేసి తనలో ఐక్యము చేసికొనవలెను ఒక్కసారి శ్రవణముచేసిన దానిని అనేక పర్యాయములు మననము

చేయుటయు అట్లు మననము చేసినదాని నిదిధ్యాసన మొనర్చి తనలో లెస్సగ జీర్ణించుకొనుటయు జరుపవలెను. కేవలము శ్రవణమాత్రముచే సంతృప్తి నొందరాదు కనుకనే శాస్త్రములు గురుబోధను ఆవృత్తిచేయవలెనని అనగా మరల మరల చింతనచేయవలెనని నొక్కి చెప్పుచున్నవి

ఆవృత్తి రస కృదుపదేశాత్

అని శ్రీ వేదవ్యాసమహర్షి బ్రహ్మసూత్రములందు ఈ యర్థమునే విశదమొనర్చియున్నారు అనేక జన్మలనుండి రూఢిపడియున్న అజ్ఞానము తొలగుటకు జ్ఞానసంబంధమైన విచార యొక్క ఆవృత్తి (మరల మరల చింతనచేయుట అత్యావశ్యకమైనగు నది ఒకటి రెండుపార్లు తలంచు మాత్రముచే బహుకాలరూఢ ప్రాపంచిక సంస్కారము తొలగ నేరవు

కనుకనే గురువు తన శిష్యునకు బోధింపవలసిన విషయమును పదేపదే అతనికి నూరిపోయుచుండును ఛాందోగ్యోపనిషత్తు నందు ఆరుణి యనునతడు శ్వేతకేతునకు తత్త్వమసి యను మహావాక్యమును ఒకసారికాక రెండుసార్లుగాక తొమ్మిదిపర్యాయములు ఉపదేశించియుండ గదు స్వామియు న్నది భగవద్గీతయందు శ్రీకృష్ణపరమాత్మ భూయః అను పదమును అచటచట ప్రయోగించుచు అర్జునా! నేను చెప్పిన దానినే తిరిగి చెప్పుచున్నాను మఱియు ను అర్జునుని హృదయఫలకమున

చెప్పినది కాదగ హత్తుకొనిపోవుటకై శ్రీకృష్ణమూ
చెప్పినదానినే మరల మరల చెప్పుచుండెను ఇది సద్గురు
యొక్క లక్షణము తనబోధ శిష్యునకు తృప్తికరమైనదా లే
దా అని ఉత్తమగురువు పరీక్షించి అట్లు కానిచో ఆ బోధ
మరల మరల ఆవృత్తి చేయుచుండును.

ప్రయోగించిన పదమును మరల ప్రయోగించు సాహిత్యాదులందు దోషముగా పరిగణింపబడుచుండు దానినే పునరుక్తిదోషమందురు కాని ఆధ్యాత్మిక విషయమందు చెప్పినదానిని మరలచెప్పుట ఒక గుణముగా బడుచుండును. అదియొక శోభగా కళగా రాణించుచు బహుకాలవాసనలు జన్మాంతర దుస్సంస్కారములు సూక్ష్మ కారణదేహమున జీర్ణించియుండును నిగూఢముగ అచట యుండును. వానిని పెకలించివేయుటకు జ్ఞానసంబంధ విచా నిర్విరామముగ జరుగుచునే యుండవలెను ఇది పూటతో గాని ఒక్కరోజుతోగాని పూర్తియగునది కా

సతు దీర్ఘకాల నైరంతర్య సత్కారసేవితో దృఢభూమిః

అని పతంజలిమహర్షి నుడివినట్లు ఆయా రహస్యములను శాస్త్రసందేశములను గురుబోధ నుశ్రద్ధావిశ్వాసముతో దీర్ఘకాలము నిరంతరము పౌనఃపున్య మననము చేయుచుండవలెను.

జపపద్ధతియు ఇందుకొరకే ఏర్పడినది. సాధకుడు జపమాల తీసికొని తన ఇష్టదేవతామంత్రమును మరల

జపించుచుండును చెప్పినమంత్రమునే మరల చెప్పుచుండును ఉచ్చరించినదానినే మరల ఉచ్చరించుచుండును. అష్టోత్తరము పూర్తి అయినచో కొందఱు అదే మంత్రమును ఇంకొక అష్టోత్తరముకూడ భక్తితో జపించుట వలన అది మనంబున లెస్సగా ఉమాపతి భగవంతునిపై అచంచలమైన భక్తి యేర్పడగలదు

కాబట్టి బహుదుఃఖసంకులితమగు ఈ అగాధ సంసార దుఃఖసాగరమును శీఘ్రముగ తరించివేయదలంచు ప్రతి మానవుడును నిత్యశుద్ధ బుద్ధముక్తరూపమగు తన ఆత్మ స్వరూపమునుగూర్చి నిరంతరము చింతన చేయుచు సకల మరల భావనచేయుచు అద్దానియందునిలకడ కలిగియుంటకై తీవ్రతరయత్నము నొనరించుచు బ్రహ్మప్రాప్తి చేకూరు వఱకు సాధనను ఏమాత్రము విరమింపక కొనసాగించుచునే యుండవలెను అట్లు సాధన కొంతకాలము శ్రద్ధతో చేయుచురాగా హృదయము నిర్మలమైనపుడు జీవుడు సాక్షాత్ పరమాత్మ స్వరూపుడే అయివెలుగొందును.

నరుడెప్పుడైన నారాయణుడు కాగల్గునా ! మానవుడు ఎన్నడైన మాధవుడుగా పరిణతి చెందగలడా ! జీవుడు ఏనాడైన శివుడు కాగలడా ! యని కొందఱు ప్రశ్నించుచుందురు తప్పక కాగలడని మహాత్ములు పలుకుచున్నారు శాస్త్రములన్ని ఆ ప్రకారమే ఉద్ఘోషించుచున్నవి అసలు జీవుడు శివుడు కాకుండనున్నది ఎప్పుడు ! అని అద్వైతులు

నిలదీ ప్రశ్నించుచున్నారు అజ్ఞానకాలము నందు నే జీవుడు శివుడుగనే యున్నాడనియు ఆ విషయము తెలియక జీవుడు అనవసరముగ నానాబాధ నొందుచున్నాడనియు ఏ క్షణమందాతడు తన నిజస్వరూపమగు ఆత్మను తెలిసికొనునో ఆ క్షణమందే బంధవిముక్తుడై తన శివ స్వరూపముతో వెలుగొందుననియు పెద్దలు వచించుచున్నారు

జీవశ్శివ శ్శివో జీవః
సజీవః కేవలః శివః
పాశబద్ధ స్తథా జీవో
పాశముక్త స్సదాశివః

అని ఉపనిషత్తులు ముక్తకంఠముతో పలుకుచున్నవి జీవుడు అల్పుడు కాడనియు సాక్షాత్ శివస్వరూపుడేయనియు అని పేర్కొనుచున్నవి పాశముచే కట్టబడినచో జీవుడనియు పాశవిముక్తుడైనచో శివుడనియు అతడు చెప్పబడుచున్నాడు

శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః

అమృతస్వరూపమగు పరమాత్మయొక్క సంతానములారా! వినుడు! అని శ్రుతిశిరస్సులు మానవుని దేవునిగ వర్ణించినవి కావున జీవుడు యథార్థముగ శివస్వరూపుడే యయినను ఆ సత్యమును తెలియక అజ్ఞానకారణమున రొంపిలోపడి తికమకపడుచున్నాడనియు స్పష్టమగుచున్నది

ఇపుడు జీవుడు తిరిగి తన స్వస్వరూపస్థితిని బడయ వలెననిన ఒకే ఉపాయము కలదు తన ఆత్మస్వరూపమును

గూర్చి నిరంతరము చింతన చేయుటయే ఆ ఉపాయము మఱియు దానిని సతతము స్థిరము చేయుటయే ఆ ఉపాయము తాను అపరిచ్ఛిన్నమగు ఆత్మయే కాని పరిచ్ఛిన్నమగు దేహము కాదనియు తాను సచ్చిదానంద శివస్వరూపమే కాని ఇతరమైన ఉపాధి కాదనియు అహర్నిశములు జీవుడు చింతన చేయుచుండవలెను ఆ ప్రకారము చింతన చేయుచుండినచో అచిరకాలములో ధ్యేయమగు ఆ పరమాత్మరూపమే తాను కాగలడు

ఇందులకొక చక్కని దృష్టాంతము శాస్త్రములలో చెప్పబడినది అదియే భ్రమరకీటన్యాయము భ్రమరమనగా తుమ్మెద కీటకమనగా పురుగు తుమ్మెద ఒకపురుగును తెచ్చి గూటిలో వలపెట్టి బయటకు ఎగిరిపోవును తుమ్మెదవచ్చి తన్ను చంపివేయునేమోయను భీతిచే పురుగు నిరంతరము తుమ్మెదను గూర్చియే భావన చేయుచు యుండును తత్ఫలితముగ ఆ పురుగు తుమ్మెదగనే మారిపోవుచున్నది ఇది ప్రకృతి యందలి వాస్తవాంశ విచిత్రమైన సన్నివేశము జీవబ్రహ్మైక్యమును గూర్చి చెప్పునపుడు ఈ దృష్టాంతమును ఉపయోగించుచుంద జీవుడు అహర్నిశములు శ్రద్ధతో భక్తితో ఏకాగ్రతతో పరబ్రహ్మమును గూర్చి చింతించుచుండినచో ధ్యానించుచుండినచో ఆ పరబ్రహ్మరూపమునే యతడు పొందుచున్నాడు కీటకము భ్రమరరూపమును పొందునట్లుగన అయితే దృష్టాంతమందు పురుగు తుమ్మెద వేరువేరుగనున్నట్లు జీవుడు బ్రహ్మ

వేలువేలుగ ఏకాలముందునులేక అజ్ఞానదశయందును జీవుడు బ్రహ్మముగనే యుండియున్నాడు అట్టి పరిజ్ఞానము లేనందు వలననే దుఃఖములపాలుబడుచున్నాడు. సద్గురూపదేశము చేసిన సచ్ఛాస్త్రశ్రవణముచేతను, తన తీవ్రతర అనుష్ఠానము చేతను సాధకుడు తన నిజస్వరూపమగు పరమాత్మ నెఱిగి తద్రూపుడే యగుచు పరమానందమును పొందుచున్నాడు అదియే మోక్షము

అయితే పురుగు తదేకనిష్ఠతో తుమ్మెదను చింతన చేయునట్లు సాధకుడు తన నిజస్వరూపమగు ఆత్మనుగూర్చి ఏకాగ్రతతో పట్టుదలతో ధ్యానించవలెను.

సతు దీర్ఘకాల నైరన్తర్య సత్కారసేవితో దృఢభూమిః

అది పతంజలిమహర్షి నుడివినట్లు దీర్ఘకాలము నిరంతరము శ్రద్ధతో ఆత్మచింతనచేసినను మాత్రమే జీవుడు స్వస్వరూపాత్మ సాక్షాత్కారమును బడసి శివుడై చెన్నొందగలడు గీతయందును సతతం (ఎల్లప్పుడు) అను పదము చాలసార్లు వాడబడియుండుట గమనించదగియున్నది కాబట్టి నిరంతర సాధన అత్యవసరము గూటి యందుంచబడిన కీటకము (పురుగు) జనులకు నేర్పిన పాఠ మిదియే అయితే కీటకమునకు లక్ష్యము భ్రమరము జీవునకు లక్ష్యము బ్రహ్మము కీటకము భ్రమరముగా మారినప్పుడు జీవుడు బ్రహ్మముగా ఎందుకు మారడు ? తప్పక మారును అయితే నిరంతర సాధన నిరంతర బ్రహ్మచింతన అవసరము ఈ ప్రకారముగ

నిరంతరా[illegible] [illegible] గంతరమై వచిలిక చేరను జీవుడు తన దేహేంద్రియము నే రూప ఉపాధిని పరిశుద్ధ మొనర్చుకొని ఆ ఉపాధియందు ప్రకాశించు పరబ్రహ్మమును సాక్షాత్కరించు కొనుచున్నాడు ఉపాధి మలినముగా నున్నచో దైవానుభూతి కలుగనేరదు

సామాన్యముగ గ్రామములందును పట్టణములందును రథోత్సవ సమయము ఇంకను కొద్దిరోజులున్నదనగా రథము నకు బూజు దులిపి రంగులువేయించి అలంకారములు చేయు చుందురు ఎందులకు? అది దేవుని ఊరేగించెడి పట్టు నలము కాబట్టి ఒక ఊరునకు గవర్నరుగారు రానున్నారనగా కొద్ది రోజులు ముందునుండియే వీధులను పరిశుభ్రముచేసి ఆర్చీల ను ధ్వానల్లనుకట్టి రంగురంగు కాగితములతో ఊరంతయు అలంకరించి కనులపండువుగ చేయుచుందురు. ఎందులకు? ఒక గొప్పవారు వచ్చుచున్నారు కాబట్టి మహనీయుల రాక సందర్భమున ఏ ప్రదేశమునైనను శుద్ధముగా నుంచవలెనను భావము జనులకు సహజముగనే కలుగుచుండును

అట్టిచో మహనీయులకు మహనీయుడై రాజులకు రాజై దేవులకు దేవుడై విశ్వప్రభువై విలసిల్లు పరమాత్మ నివసించు స్థానమును ఎంత పవిత్రముగా నుంచవలెను అతడు ఊరేగు రథమును ఎంత పరిశుభ్రముగా నిర్మలముగా నుంచ వలెను ఆ రథమే శరీరము దేహమను దివ్యరథము నధిరో హించి పరబ్రహ్మమను సామ్రాట్టు విశ్వమందు సంచరించు

చున్నాడు ఈ దేహము సాక్షాత్ బ్రహ్మరథమేయగును అట్టిదానిని అతి పవిత్రముగా కళంక రహితముగా నుంచవలెను ప్రభు నివాసమునకు తగినట్లుగా దానిని రూపొందించవలెను దేహముయొక్క బాహ్యాభ్యంతరములు రెండును పరిశుద్ధముగా నుండు లాగున చూడవలెను. బాహ్యశౌచము— అంతశ్శౌచము రెండిటి విషయము కడుజాగరూకతతో గమనించవలెను

బాహ్యశౌచ శౌచమనగా దేహమును ప్రతినిత్యము స్నానాదులచే శుభ్రముగా నుంచుట ఆరోగ్యమును జాగ్రతగ కాపాడుకొనుచుండుట ఆహారవిహారాదులందు క్రమశిక్షణను పాటించుట మొదలైనవి మోక్షమునకు మనస్సే ప్రధానమైనప్పటికిని శరీర ధర్మములు శరీరారోగ్యమును పేక్షింపదగినవికావు శరీరము ఆరోగ్యముగ లేనిచో మనస్సుచే ధ్యానమెట్లు సాధ్యమగలదు ? కడుపునొప్పి తలనొప్పి కలవాడు ధ్యానమునకు కూర్చున్నచో ఆ నొప్పియే స్ఫురించుచుండును గాని దైవముపై ఏకాగ్రత కుదురనేరదు కనుకనే పెద్దలు శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్ అని వక్కాణించియున్నారు (శ్రీ) కృష్ణపరమాత్మకూడ గీతయందు యుక్తాహారవిహారములను గూర్చి పేర్కొని బాహ్యశౌచమునుకూడ నొక్కి వక్కాణించియుండుట ఈ సందర్భమున గమనింపదగియున్నది

శరీరము ఎంతెంత ఆరోగ్యముగ శుచిగ నిర్మలముగ నుండునో మనస్సుకూడ అంతంత ఆరోగ్యముగ ఉల్లాసముగా

మ డుని జిహ్వ తీ రుచికరముకూడ కృత్రిమముగా నుండుటాకుండునట్లు చూడవలెను. తాను భ్యాసము చేయుగదికాని తాను నివసించు ఇల్లుగాని మురికిగా నుండరాదు. ప్రతిదినము వాటిని కడుగుచు ధూపదీపాదులచే అలంకరించుచు పవిత్ర వాతావరణము కలుగ జేయవలెను. అట్టి పూజామందిరములో ప్రవేశింపగనే సాధకుని కుదాత్తభావములు ఉన్నతాశయములు స్ఫురించు చుండును

శరీరముయొక్క స్వస్థతకొఱకై ఆరోగ్యసూత్రములను బహుజాగరూకతతో పాటించుచుండవలెను. మితిమీరి తినరాదు. రుచులను వాంఛింపరాదు. పొట్టయొక్క ఆదేశములను వినవలెనేగాని నాలుకయొక్క అభీష్టములను నెరవేర్చరాదు. పొట్ట అమాయకమైనది. నాలుక మహా ప్రమాదకరమైనది. అధికముగ తినవద్దని పొట్ట చెప్పుచుండును. రుచిగా నున్నది కాబట్టి మఱికొంత తినుమని నాలుక శాసించుచుండును. కాబట్టి ముముక్షువులు సాధకులు నాలుకయొక్క ఆదేశములను పరకు గొనక దాని చెప్పుచేతలలో మెలగక ఆది ఆడించినట్లు ఆడక, రుచులు కొరకు ఆరోగ్యకరమైన సాత్త్వికాహారమునే సేవించుచుండవలెను. మితాహారము సాత్త్వికాహారము దైవార్పితాహారము న్యాయార్జితాహారము అనువానినే సేవించుచు శరీరశుద్ధిని కలుగుచేసికొనవలెను

ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ
ధ్రువా స్మృతిః స్మృతిలాభే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః।

అని ఉపనిషత్తులు చెప్పినట్లు ఆహారశుద్ధిచే ర
క్తశుద్ధి కలుగును రక్తశుద్ధిచే ధైర్యస్మృతి కలుగును
ధైర్యస్మృతిచే బంధవిముక్తి సిద్ధించును కాబట్టి ఆహారా
నియమములను జాగ్రతగ పాటించుచు ఆరోగ్య సూత్రము
లను చక్కగ అనులులో నుంచుచు పరిసరములను శుద్ధముగ
ను చూచుచు సాధకుడు బాహ్యశౌచమును తెలిసిగ అవల
బించి పరబ్రహ్మముయొక్క నివాసమైన శరీరమను రథమును
పరిశుభ్రముగా నుండునట్లు అనవరతము యత్నించుచుం
డవలెను

స్వశరీరే స్వయం జ్యోతిః అని ఉపనిషత్తులు ఘోషి
ంచినట్లు ఈ శరీరమందు స్వయం జ్యోతియగు పరమాత్మ నివసించు
చున్నాడు. ఆ పరమాత్మ ఊరేగుటకు ఈ దేహమును ఉపాధి
యై రథముగ ఉపయోగించుచున్నది. ఊరేగుటకు మనము
రథమును శుభ్రపరచి అలంకరించి సర్వాంగసుందరముగ
తయారుచేయునట్లు శివుడు ఈ ఉపాధియొక్క బాహ్యభ్య
ంతరములను అత్యంత పవిత్రముగనొనర్చి పరబ్రహ్మముయొక్క
నివాసమునకు యోగ్యమైనదానినిగ చేయవలెను. శరీరరథము
యొక్క బాహ్యశుద్ధినిగురించి విచారించియున్నాము. ఇప్పుడు
అంతఃశుద్ధినిగురించి విచారింతము.—

పాత్రయొక్క బయటమాత్రము తోమి లోపల మురికి
అట్లే యుంచినయెడల ఆ పాత్ర వంటచేయుటకు ఉపయోగి

బ్రహ్మానంద



ప్రతిదిన మేకాంతసమయమును దైవధ్యానమునకు ఆత్మ పరిశోధనమునకు కేటాయించి, చిత్తమున ఏయే అసుర గుణములు ప్రవేశించుచున్నవో బహు జాగరితో పరికీలించుచుండవలెను. ఏవైన దుష్టవాసనలు కానుపించినచో వెంటనే దేవునియొక్క సహాయముచే వాటిని తరిమివేయవలెను. ఈ ప్రకారముగ ప్రతిరోజు ఆత్మ పరిశోధనము (Introspec ion) కావించినచో అచిరకాలములోనే చిత్తము శుద్ధమై భగవానుడు నివసించుటకు అనువైన దివ్య మందిరముగ రూపొందును. పరబ్రహ్మమునకు దివ్యరథమై తనర్చును గావున ముముక్షువులగువారు తమ దేహరథముయొక్క బాహ్యాభ్యంతరములను అతినిర్మలముగా నుంచుకొని బ్రహ్మ మందిరముగా అద్దానిని శుచిర్భూతముగ నొనర్చుకొని బ్రహ్మానుభూతిచే సుఖశాంతుల ననుభవించవలయును. మనస్సును అదుపులో నుంచుకొని, బాహ్యవిషయములపైకి పోనీయక అంతర్ముఖమొనర్చి పరమాత్మయందే స్థాపించవలెను. సంయమము కలిగి వర్తించవలయును.

బ్రహ్మానంద

# 3 బ్రహ్మానంద ప్రాప్తికి సాధనోపాయములు

## 1 ఇంద్రియ నిగ్రహము

పశుపతిగా జీవి చదలంచుకొను బ్రహ్మానందమును భవించదలంచువారికి ఇంద్రియ నిగ్రహము సంయమము చాల అవసరము సంయమమనగా నిగ్రహము మనస్సు ఇష్టమువచ్చినట్లు పరుగెత్తిపోవుచున్నపుడు పగ్గముతో గుఱ్ఱమును లాగి పట్టినట్లు వివేకము చేతను వైరాగ్యముచేతను దానిని లాగి పట్టి యథాస్థానమందుంచుటయే సంయమము పరమార్థ జీవితము సంయమముతోనే ప్రారంభించును సంయమములేని జీవితము పశుజీవితము కాగలదు సంయమమును లెస్సగా అభ్యసించి మనస్సును దృశ్యవిషయములపైకి ఇష్టము వచ్చినట్లు పోనీయక ఆత్మయందు స్థాపించినచో జీవునకు పరమశాంతి లభించి మానవుడు మాధవుడుగా శోభిల్లును. పశువు పశుపతి (ఈశ్వరుడు)గా మారిపోవును ఇదియే జీవిత పరమావధి

జంతువులకుగాని, పశుపక్ష్యాదులకుగాని ఇతరత ప్రాణికోట్లకుగాని పుట్టుకతో వచ్చిన బుద్ధి వృత్తులన్నియు అట్లే ఉండును. మార్పు ఏమియు ఉండదు సింహము క్రూరముగా పుట్టి క్రూరముగా చనిపోవును ఎలుకలనుచంపు పిల్లిగుణము అంత్యకాలమువరకు ఏ మార్పున్ను లేకయుండును. కాని

వాసనపుడట్లుకాక పుట్టుకతో వచ్చిన మలినసంస్కారములను
చలవాట్లను పెద్దల సహవాసము చేతను మహనీయులగు
ద్గురువులయొక్క సాంగత్య సాహచర్యముల చేతను
నరయొక్క తీవ్రతర అనుష్ఠానముచేతను పూర్చుకొని సన్మార్గ
మున ప్రవర్తించగ డు జంతువులకును మానవులకును
ద మిచట నేకలదు మానవుని మెదడులో బ్రహ్మపోశ
షణత్వమును అపూర్వ శక్తిని భగవానుడు ఏర్పాటుచేసెను
నిని సద్వినియోగపఱచు కొనుటలోనే మానవుని మాన
త్వము ఇమిడియున్నది

కాని అందఱు మానవులు ఆ ప్రకారము చేయు
న్నారా! లేదు మాయాప్రవాహమున కాలమంది
ట్టుకొని పోవుచున్నారే కాని ఎదురీది ఒడ్డుచేరువారు బహు
రుదు మాయను ప్రకృతిని జయించుటకు కొందరు అసలు
యత్నమే సలుపరు వీరు అధములు వీరు దుర్గతినే
ందుదురు కొందరు ప్రయత్నము ప్రారంభించి మధ్యలో
విరమించుదురు వీరు మధ్యములు వీరికి ప్రయత్నానుసారము
వృద్ధైన సద్గతి కలుగవచ్చును మరికొందరు ఎన్ని అటంక
లు సంప్రాప్తించినను తమ ప్రయత్నమును విడనాడరు వీరు
త్తములు వీరికి సద్గతియే లభించును

కాబట్టి ఉత్తములపగిది మానవుడు తన జన్మలక్ష్య
గు ఆత్మ సాక్షాత్కారమును పరమావధిని గుర్తెఱింగి,
దులకు అత్యావశ్యకమైనట్టి మనస్సంయమమును అలవాటు

చే గొనఁబడెను సామాన్యముగ ఇవ్వి తనకు మిక్కిలి ఇష్టమైన ప్రపంచపదార్థములపై నెవ్వాడుమనుజుడు సంయమమును అభ్యసింపఁగోరువాడు దానిపై గల మనస్సును ప్రత్యాహారమొనర్చవలెను దానికి మించిన వస్తువు ఆత్మయనియు విషయసుఖముకంటె నూరురెట్లు మించిన సుఖము ఆత్మయందు కలదనియు మనస్సునకు నచ్చ చెప్పి దానిని వెనుకకు మరలించి ఆత్మయందు స్థాపించెను

యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్

అను శ్లోకమునందు గీతాచార్యుడీతత్త్వమునే ప్రస్ఫుటమొనర్చెను వసిష్ఠమహర్షియు శ్రీరామచంద్రునకు ఈ ప్రకారమే మనోనిగ్రహమునుగూర్చి విపులముగ బోధించియుండెను

యత్రాఖిలాష స్తన్మానం సంత్యజ్య స్థీయతే యది
ప్రాప్త ఏవాశ్గ తన్మోక్షః కిమేతావతి దుష్కరమ్

ఓ రామచంద్రా! మనస్సునకు ఏ ప్రాపంచిక పదార్థమ పైని ఎక్కువ అభిలాషకలదో ఆపదార్థమును అనుభవింపక వదలివేసినచో అప్పుడు అది క్రమక్రమముగా స్థిరువడి నిశ్చలత్వమును పొందగలదు అట్టి నిశ్చలమనఃస్థితియే మోక్షము కావున ఇంతమాత్రపు కార్యమునందేమి ప్రయాసకలదు!

మనస్సు యమమునుగూర్చి మహర్షులు సూచించిన ఈ పద్ధతుల ననుసరించుముగ గాన పూర్వీకులు కొన్ని ఆచారముల నేర్పరచిరి గతానుగతికముగ కేవలము యాంత్రికము కావలి నప్పుడు వారి కిష్టమైన పదార్థమును అచట వదలి వేసి మరల దానిని జీవితమునందెప్పుడును అనుభవించరాదే యుందురు. కొందరు తమకు కిష్టమైన కూరను అచట వదలిపెట్టి యావజ్జీవితము దానిని తాకకయే యుందురు. మరికొందరు తమ కిష్టమైన పండును వదలివేయుదురు. ఈ యాచారము లన్నిటి యొక్క ఉద్దేశ్యము మనోనిగ్రహమే మనస్సంయమమే ఏదియో విధముగ మనస్సును విషయములపైకి పోనీయక అదుపు ఆజ్ఞలలో నుంచుటే పెద్ద యొక్క అభిప్రాయము

సంయమములేని జీవితము జీవితమేకాదు రాతికి సంయమన శక్తిలేదు పశువునకు సంయమనశక్తిలేదు అన్నిహంగులతో గూడిన మానవుడుకూడ ఆ ప్రకారము సంయమరహితుడై వ్యవహరించినచో జన్మ నిరర్థకమై పోగలదు కాబట్టి మోక్షకాంక్షియగు ప్రతిమానవుడును తనకు భగవంతుడు ప్రసాదించిన శక్తిసామర్థ్యములను సదుపయోగపఱచుకొని సంయమముచే తెన్నగ వెలిచి మనో విలయముచే పరమానంద మనుభవించవలెను.

సంయమమే జీవితమునకు శోభ సంయమములేని జీవితము కుజీవితమే కాగలదు మానవుని మానవత్వము సంయమముచే చక్కగా ప్రకాశించగలదు పశువుల మాన

వర్ణింప నలవి కాలేబద్ధ సంయమనేమని నోటితో చెప్ప వచ్చును వేలయువగా ఇంద్రియములు చెప్పినట్లు ఆడునది పశువు పుట్టుకతో పశుసంస్కారములు అది కలిగి యుండునో పుట్టిన అవి అవియే కొనసాగుచుండును ఏమాత్రము మార్పుండదని మార్పు కలుగజేసికొనుడు అని బోధించినను అర్థము చేసికొనగలుగు శాహత్తు వాటికి లేదు కనుకనే పశు జీవితము చాల ఘోరమైనదని బాధాకరమైనదని జ్ఞానశూన్య మైనదని పెద్దలు చెప్పుదురు దృష్టాంతమునకు ఒక పిల్లిని తీసికొనివచ్చి కూర్చుండబెట్టి ఓ పిల్లిగారూ ! ఎలుకలను చంపవద్దు అహింసా పరమోధర్మః అని సావకాశముగ బోధించినచో అది వినునా ? ఒక సంవత్సరము వరుసగ బోధించినను ఆ పిల్లి మరల అది పాతసంస్కారమునకు అనుగుణ్యముగనే ఆచరించుచుండును మారదు మార్పు కలుగజేసికొనవలెనను ఊహయే దానికి జనింపదు పశు స్వభావమనగా ఇదియే

కాని మానవుడు అట్లుకాదు జన్మతఃవచ్చిన చెడ్డ సంస్కారములను తన ప్రయత్నములచేతను పెద్దల సాంగత్య బోధలచేతను మార్పుచేసికొనగలడు పశువుగా జన్మించిన వాడు పశుపతిగా మారగలడు అట్లు మారినవారు చరిత్రలో కొల్లలుగానున్నారు జీవుడు శివుడై మానవుడు మాధవుడై పరిఢవిల్లిన సందర్భముల నెన్నిటినో చరిత్ర చూపుచున్నది. దీని కంతటికిని కారణము స్వయముగ మనస్సును ఇంద్రియము

లను ఇష్ట వచ్చి ట్లు పోనీయక కళ్ళెము పట్టి గుఱ్ఱమును లాగినచందమున అదుపులోనుంచగల్గుటయే మానవుని గొప్పతనమునకు నిదర్శనము వసిష్ఠులవారి ఈ క్రింది శ్లోక మెంత మహత్తరముగ నున్నదో చూడుడు

మనాగపి విచారేణ చేతసః స్వస్య నిగ్రహః
మనాగపి కృతో యేన తేనాప్తం జన్మనః ఫలమ్

ఎవడు ఒకింత తత్త్వవిచారణచే మనస్సును కొంచెము నిగ్రహించినప్పటికిని అతడు మనుష్యజన్మ ఎత్తినందులకు గొప్పఫలితమును పొందినవాడు కాగలడు అతని మానవజన్మ సఫలమైనదై కాగలదు ఆహా! వసిష్ఠమహర్షి సంయమమున కెంతటి ప్రాధాన్యత నొసగెనో చూడుడు కనుకనే ఉపనిషత్తులు భగవద్గీత భారత భాగవత రామాయణాది శాస్త్రములు సంయమము అతిముఖ్యమైనదనియు అది లేని జీవితము వ్యర్థజీవితమే కాగలదనియు వేనోళ్ల ఘోషించుచున్నవి

యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధః

అని శ్రీశంకరభగవత్పాదులు పేర్కొనినట్లు వాక్కు మొదలైన ఇంద్రియములను నిగ్రహించుటయే యోగమను భవనమునకు ముఖద్వారమని అనగా లోన ప్రవేశించుటకు ప్రథమద్వారమని స్పష్టమగుచున్నది యోగమనగా కలయిక జీవ బ్రహ్మైక్యము అట్టిదానికి మొదటిమెట్టు సంయమమేయని భగవత్పాదులు కేటతెల్లముగ తెలిపియున్నారు.

ఇంద్రియగ్రామ సంగ్రామపోతేనా భవసాగరః
తీర్యతే నేతరేణేహ కేనచిన్నాధ కర్మణా

అని శ్రీ వసిష్ఠమహర్షి పేర్కొనుచోట తెలిపినట్లు మహాదుస్తరమైన ఈ సంసారసాగరము ఇంద్రియములతో కుస్తీపట్టి యుద్ధముచేసి జయించుట అను సేతువు (వంతెన) చేతనే దాటుటకు గలదుకాని ఇతరములగు ఏ కర్మలచేతను గాదు ఏ క్షణమున ఈ సంయమము ప్రారంభమగునో ఆ క్షణము నుండియే దైవజీవితము ప్రారంభము కాగలదు వ్రతములు నోములు నియమములు ఇందుకొఱకే యేర్పడినవి ఉపవాస వ్రతము,మౌన వ్రతము బ్రహ్మచర్యవ్రతము మొదలైనవన్నియు మానవుడు సంయమమును శీలించుటకు చక్కని అవకాశములను కల్పించుచున్నవి

కావున పశుజీవితముదాటి, మానవజీవితముదాటి దైవజీవితము (Divine Life) గడుపవలెను ప్రతివ్యక్తియు జీవితాశయము నిరతిశయ ఆత్మానందమును అనుభూతి మొనర్చుకొనవలెను ప్రతి వ్యక్తియు మోక్షసాధనమునకు ప్రథమ సోపానమగు సంయమమును పట్టుదలతో శీలించి మనస్సును ఇంద్రియములను లాగిపట్టి తన వశమునందుంచుకొని బహు జాగరూకుడై మెలగుచుండవలెను విషయములకు దాసుడు కారాదు

దాసత్వము Slavery అజ్ఞాన చిహ్నము. మానము గలవాడెవడును దాసత్వమునకు అంగీకరించడు కాని అనాది

కాలము నుండియు ఇంద్రియములకు విషయములకు ప్రకృతికి మానవుడు దాసానుదాసుడై వాటి చెప్పుచేతలలో మెలగుచు తత్ఫలితముగ ఈ సార మహాకూపమున పడి దొర్లాడుచున్నాడు సంసార నాటక రంగమున లెక్కకుమించిన వేషములను వేయుచు ఒక్కొక్క వేషముతో రంగస్థలిపై కొద్దిసేపు నాట్యమాడి తొలగి తెరచాటునకు పోవుచున్నాడు. ఇది యంతయు విషయ దాసత్వముయొక్క దారుణ ఫలితము

వాస్తవముగ జీవుడు ప్రభువేకాని దాసుడు కాదు శంకరుడే కాని కింకరుడు కాదు అజ్ఞానవశమున కింకరత్వమునకు దాసత్వమునకు పాల్పడి ఇంద్రియములు ఆడించునట్లు ఆడుచు అల్పమైన జడ పదార్థములకు క్షణికములగు శబ్ద స్పర్శాది విషయములకు లోబడి పోవుచున్నాడు పూర్వము బ్రిటిష్ పరిపాలకులకు లోబడి అస్వతంత్రులై భారతీయులు ఎన్ని ఇక్కట్లు అనుభవించినది సర్వులకు విదితమే కదా! కాని కాలక్రమమున జనులు విజ్ఞతకలవారై తెప్పరిల్లుకొని పోయిన తమ స్వాతంత్ర్యము కొరకై సత్యాగ్రహముల తరబడి దీర్ఘపోరాటమును సలిపి ఎన్నియో త్యాగములుచేసి గుండు దెబ్బలు తిని జైళ్ళకేగి ఎట్టకేలకు స్వరాజ్యమును సంపాదించి సుఖశాంతులను బడయగల్గిరి ఇప్పుడు ఆఫ్రికా దేశీయులు కూడ అట్లె తెల్లవారి దౌర్జన్యమునుండి తప్పించుకొని స్వతంత్ర వాయువులు పీల్చగలుగుచున్నారు

అయితే అనాదికాలమునుండి జీవుడు అనుభవించు చున్న యీ ఇంద్రియ దాసత్వ స్థితి ఒకరిచ్చినదికాదు అజ్ఞానమువలన జీవుడు తనకు తాను కోరి తెచ్చుకొనినదే సాలెపురుగు తన చుట్టును దారము అల్లుకొని స్వనిర్మిత బంధమున తగులుకొని నానాయాతనలను అనుభవించునట్లు జీవుడు కూడ తన నిజస్వరూపమగు సచ్చిదానందాత్మను విస్మరించి మాయామోహము బడి అస్వమైన వాటికన్నిటికిని గురవచి దృశ్యవిషయములకు లోబడిపోయి ప్రకృతి దయనీయస్థితికి దిగజారిపోయినాడు

ఇకమీదట అట్టి స్థితి కలుగనీయకుండ చూడవలెను గడచిన దానినిగూర్చి వగచిన ప్రయోజనములేదు ఇప్పుడు చేయవలసిన పనిని గూర్చి తీవ్రముగ ఆలోచించి భవిష్యత్తును తేజోవంతముగ గావించుకొనవలెను విషయదాసులు కాకుండ హరిదాసులు కావలెను రామదాసులు కావలెను ఇంద్రియములకు ప్రాపంచిక విషయభోగములకు తలవంచక భగవంతునకు తలవంచవలెను పోయిన తన వ్యక్తిత్వమును తిరిగి సంపాదించవలెను నేను దేహము దు ఇంద్రియములు కాదు మనస్సుకాదు వీని యన్నిటికి సాక్షియైన ప్రత్యగాత్మనే యను అనుభూతిని బడయవలెను చిదానందరూపః శివోఽహమ్ శివోఽహమ్ అని ఎలుగెత్తి పాడవలెను నేను బానిసకాదు ప్రభువును అని పరిపూర్ణముగ నిశ్చయించి ర్ణయించి అనుభవించి తదనుగుణ్యముగ వ్యవహరించవలెను

ఇంద్రియములు కోరిన పదార్థములను వాటికి ఇవ్వరాదు ఒకేత సంయమమును అభ్యసించి కొన్ని వ్రతములను నియమములను శీలించుచు తాను చెప్పినట్లు ఇంద్రియములు ప్రవర్తించు స్థితికి రావలెను తన ఆడుపాజ్ఞలలో అవి మెలగునట్లు చూడవలెను. ప్రాపంచిక పదార్థములయొక్క క్షణికత్వమును గురించి పదేపదే యోచించి వాటి యెడల విరక్తిని కలిగియుండవలెను ఈ ప్రకారముగ దృశ్యవిషయములపై మోజు ఎప్పుడు తగ్గిపోయినదో అప్పుడిక మనస్సు బయటకు పరుగిడక అంతరంగమున ఆత్మోన్ముఖమై వర్తించును.

ఇందుల కెంతయో పట్టుదల అవసరము పవిత్రత సహనము పట్టుదల (Purity patience perseverence) అను ధర్మత్రయమును చేబట్టి ఈ జీవితమందే లక్ష్యమును సాధించుటకు తీవ్రప్రయత్న మాచరించవలెను మానవజన్మ మరల మరల వచ్చునదికాదు

పునర్గ్రామః పునక్షేత్ర పునర్విత్త పునర్గృహః
పునశ్శుభాశుభ కర్మన శరీరం పునః పునః

గ్రామము పోయినచో తిరిగి సంపాదించవచ్చును పొలము పోయినచో తిరిగి సంపాదించవచ్చును అట్లే ధనము గాని ఇతర వస్తువులుగాని పోయినచో తిరిగి ఎట్లైన రాబట్టుకొనవచ్చును కాని అన్ని హంగులతో గూడిన ఈ మానవ శరీరము రాలిపోయినచో తిరిగి అట్టి అనుకూల జన్మనుపొందుట కష్టతరము కాబట్టి వార్ధక్యము దాపురించక పూర్వమే

మానవుడు తన కృషిసాధనకై ప్రయత్నించి విషయ దాసత్వమునకు తిలాంజలి యొసంగి తాను ప్రభువగు ఆత్మయే యని పదేపదే చింతనచేయుచు అట్టి ఆత్మస్థితియందు నిలకడగల్గి బ్రహ్మానంద వైభవ మనుభవించవలెను బుద్ధిని తీక్ష్ణముగను పరిశుద్ధముగను నుంచుకొని అద్దాని అనువు ఆజ్ఞల~ మనస్సు ప్రవర్తించునట్లు చూడవలయును

మానవుని ఉపాధి ఒక పెద్ద ప్రభుత్వము వంటిది ప్రభుత్వ యంత్రాంగమందు ప్రభువు మొదలుకొని చిన్న ఉద్యోగివరకు ఎందరో వ్యక్తులు పాల్గొనుచు తమ తమ నిర్ణీత విధులను సక్రమముగ నిర్వర్తించుచు ఉందురు పై అధికారియొక్క ఆదేశమును క్రింది అధికారి వినయ విధేయతలతో స్వీకరించి కార్యాన్విత మొనర్చుచుండును. అట్లే ఈ ఉపాధియందును బుద్ధి మనస్సు ఇంద్రియములు శరీరము మొదలైనవి ఒకదానినుండి మరియొకటి క్రమముగ ఆజ్ఞలను స్వీకరించుచు పైవాటి ఆదేశమును శిరసావహించుచు కలిసి కట్టుతనముగ వ్యవహరించును ఈబుద్ధ్యాదులన్నిటికిని ప్రకాశమును అందజేయునది ఆత్మ జడములైన ఈ బుద్ధ్యాదులన్నియు ఆత్మసాన్నిధ్యముచే ప్రకాశవంతములై చైతన్యయుక్తములై యలరారుచున్నవి. జపాకుసుమసాన్నిధ్యమునందు స్ఫటికమణివలె

ఈ దేహేంద్రియాదిరూప ఉపాధియందు ఆత్మకు అత్యంత సమీపమున ఉన్నది బుద్ధి బుద్ధికి ఈవల ఉన్నది

మనస్సు మనస్సునకు ఆవలనున్నది ఇంద్రియములు ఇంద్రియములకు ఆవల ఉన్నది దేహము బుద్ధి ఆత్మకు అతిసమీపమున ఉండుటవలన మహాశక్తివంతమై వెలయుచుండును అది నిశ్చయాత్మకమైనది. మనస్సు సంకల్పాత్మకమైనది. అనగా మనస్సుయొక్క స్వభావము సంకల్పించుట బుద్ధియొక్క స్వభావము నిశ్చయించుట కాబట్టి ఈ ఉపాధియందు బుద్ధియే కార్యాకార్యవివేచన యొనర్చుచు ఏది చేయవలెనో ఎట్లు చేయవలెనో నిర్ణయించుచుండును దృష్టాంతమునకు—

ఒక గ్రామమున ఒక ఆధ్యాత్మిక మహాసభ జరుగుచుండెను సాయంత్రము 6 గంటలు మొదలుకొని 8½ గంటల వఱకు కాని నిర్ణీత సమయము అందు వేలకొలది ప్రజలు ఆసీనులై వక్తలయొక్క ప్రవచనములను సదుపదేశములను వినుచుండిరి సరిగా 8 గంటలు అయినది శ్రోతలలో ఒకనికి ఆకలి ప్రారంభమైనది. అపుడు అతని మనస్సు మెల్లగా బుద్ధితో ఇట్లనెను ఇంటికి వెళ్లుదము భోజనసమయమైనది ఆకలిగా ఉన్నది వెంటనే బుద్ధి దానిని ఈప్రకారముగ మందలించెను— ఓ మనస్సా ! ఇంకొక అరగంటసేపు ఓర్చుకొని కూర్చుండుము! సభ పూర్తియగును ఇటువంటి అవకాశము ఎల్లప్పుడు లభించునా ! ఇట్టి మహనీయులు ఎప్పుడైన మన గ్రామమునకు విచ్చేయుదురా ! ఎప్పుడున్న ఆకలియే, ఎప్పుడున్న తిండియే ఎప్పుడున్న సంసారమే

కాబట్టి ఇంకొక్క అరగంట మెదలక కూర్చొనియుండుము ఇచ్చోట సంకల్పించినది మనస్సు నిశ్చయించినది బుద్ధి బుద్ధియొక్క ఆదేశము లేక ఈ ఉపాధియందు ఏదియు కదలుటగాని మెసలుట గాని జరుగదు ప్రధానమంత్రియొక్క ఆజ్ఞ లేనిదే ప్రభుత్వమునందే కార్యక్రమమును అమలు జరుగుట కెట్లు వీలులేదో అట్లే ఈ ఉపాధియందును మనస్సుగాని ఇంద్రియములుగాని దేహముగాని బుద్ధియొక్క పర్మిషన్ లేనిదే ఏపనియు చేయజాలవు

కాబట్టి బుద్ధి కుశాగ్రముగ తేజోవంతముగ ప్రజ్ఞా యుతముగ పవిత్రముగ నున్నపుడు ఉపాధిచే నొనర్పబడు కార్యములన్నియు అత్యంత శుభప్రదములుగ నుండగలవు కొందఱిలో ఈ బుద్ధి వివేకరహితమై వక్రమై అపవిత్రమై దుస్సంస్కారయుతమైయుండును అట్టివారి చర్యలన్నియు నికృష్టములై హేయములై లోకాపవాద సదనకములై యుండును కనుకనే శ్రీకృష్ణపరమాత్మ బుద్ధిని అత్యంత పరి శుద్ధముగ నుంచుకొనవలెనని అర్జునునకు బోధించి యుండెను (బుద్ధ్యావిశుద్ధయాయుక్తో)

ఒక బండి పోవునప్పుడు కీలకమైనపాత్ర వహించునది సారథియే కాని లోనకూర్చొనియున్న యజమానికాని బండిని లాగుచున్న గుర్రములుకాని కావు సారథి కెలివి తక్కువవాడు అయినచో బండి గుర్రములు యజమాని

అందఱును గోతిలో పడిపోవుదురు అట్లే ఈ ఉపాధియందు దేహము రథమువంటిది ఇంద్రియములు గుఱ్ఱము వంటివి మనస్సు పగ్గమువంటిది బుద్ధి సారథివంటిది బండి సురక్షితముగ గమ్యస్థానము చేరవలెనన్న సారథి బుద్ధికుశలుడై మెళ్లుండవలెనో అట్లే జీవుడు సురక్షితముగా మోక్షధామము చేరవలెనన్న బుద్ధి ప్రజ్ఞాయుతమై కీలక మై సుశిక్షితమై యుండవలెను. మనస్సును అదుపులో నుంచునదిగ యుండవలెను. మనస్సు యెప్పుడైన కుమార్గము పయనించుట కుద్యుక్తమైనచో ధర్మదూరముగ ప్రవర్తించినచో బుద్ధి దానిని మందలించి సరియైన మార్గముచూపి అధర్మమున ప్రవేశింపకుండునట్లుగన చేయవలెను బుద్ధిచేయవలసిన పని యిదియే

అట్లుకాక బుద్ధి మనస్సుకు లోబడినచో మనస్సు ఎటు లాగిన అటు పోవుచుండినచో మనస్సుకు దాసన అయినచో అది జీవుని అధోగతికి తీసికొని పోగలదు అట్టి పరతంత్రమైన బుద్ధిగల జీవునకు సుఖశాంతులు కరువైపోవును అజ్ఞానియొక్క బుద్ధి మనస్సు చెప్పిన దానిని కటాలున ఆమోదించుచుండును మనస దొంగతనము చేయవలెనని సంకల్పించినచో అట్లే చేయుమని ఆదేశించును. జ్ఞానియొక్క బుద్ధి అట్లు కాదు 'దొంగతనము మహాపాపము కాబట్టి ఎన్నడును చేయరాదు' అని హెచ్చరించి ఆ మనస్సును అట్టి దుష్కా-

ర్గము నుండి విరమింపజేయును జ్ఞానికి అజ్ఞానికి ఇదియే భేదము అజ్ఞానిబుద్ధి మనస్సుకు లోబడును జ్ఞానిబుద్ధి మనస్సును అదుపులో నుంచి తన ఆదేశానుసారము ధర్మమార్గ మున నడిపించుచుండును

కావున సాధకుడు సద్గురూపదేశము చేతను సద్గ్రంథ పఠనము చేతను మహాత్ముల సాంగత్యము చేతను తన అను ష్ఠానము చేతను బుద్ధిని అత్యంత శుద్ధముగ నొనర్చుకొని మనస్సుయొక్క చెడుగుణాలను పాటింపక దానిని సన్మార్గ మున నడచునట్లు చేయుచు క్రమక్రమముగ మోక్షధామమును జేరవలయును నిందాస్తుతులందును మానావమానములందును, శీతోష్ణములందును సమదృష్టిని అభ్యసించవలెను సమత్వం యోగ ఉచ్యతే అనునట్లు అట్టి సమభావమే యోగమని చెప్పబడును.

## 2 సమత్వము

అర్జునుడొక పర్యాయము శ్రీకృష్ణపరమాత్మ నిట్లు ప్రశ్నించెను

దేవా! ప్రపంచములో తపస్సంపన్నులైన మహర్షులు, యోగనిష్ఠా పరులైన పుణ్యాత్ములు ఎందరో కలరు కదా! వీరిలో పరిపూర్ణస్థితిని బడసి జీవన్ముక్తులైన మహాత్ము లెవరో ఎట్లు తెలిసికొనగలము? ఒకడు దైవసాక్షాత్కార మును బొందెనో లేదో తెలిసికొనుటకు గురుతేమి? జగద్గురువగు

ష్ణమూర్తి ధనంజయుని ప్రశ్నకిట్లు సమాధాన మొసం
ను — అర్జునా ! ఎవడు మానావమానము లందును,
ందా స్తుతులందును సమభావము గలిగి యుండునో అట్టి
గారిని జీవన్ముక్తులుగ నెఱుగుము

భగవానుని ఈ సమాధానము మానవుని కౌన్నత్య
మును పరీక్షించుటకు చక్కని కొలతబద్దగ ఉపయోగించు
న్నది ఎవరైన దూషించినపుడు నిందించినపుడు అజ్ఞా
లక్రిందులై పోవును క్రోధావిష్టుడగును. రోజుల తరబడి
ంతచే కుమిలిపోవును. కాని జ్ఞానియగువాడు ఆ యా నింద
చే ఏమాత్రము ప్రభావితుడు కాకుండును

Censure and praise are Mere vibrations of
the air నిందగాని స్తుతిగాని గాలిలోని తరంగములు
మాత్రమే అని భావించువాని విశేషవంతుడు నిబ్బరముగా
ండును విచలితుడు కాకుండును వాస్తవముగ విచారించి
నో ఎవరైన తిట్టినపుడు జరిగిన దేమిటి ? ఆ తిట్టు
ను శబ్దము వాయువులో ఒక తరంగము (wave) ను
ఉత్పత్తి చేసెను అంతమాత్రమునకు ఎదుటివాడు తన కేమో
ఖలిపోయినదని భావించవలసిన పనియేమి ? దాని వలన తన
కు అపకారము జరిగినది ? ఆ తిట్టు అను శబ్ద తరంగ
ము తాను స్వీకరించినచో బాధ కలుగునుగాని స్వీకరించ
నో ఇచ్చినవారి యొద్దకే అది తిరిగి వెళ్ళును (Return to
the sender)

ఒకప్పుడు బుద్ధదేవుడు ఎచటికో పాదచారియై పోవుచుండెను. మార్గమధ్యమున ఒకడు కనుపించి అదే పనిగా బుద్ధుని దూషింప మొదలిడెను కాని ఆ దూషణలను బుద్ధదేవుడు మాత్రము ఖాతరు గొనక తన దారిన తాను పోవుచుండెను అప్పుడా పాంథుడు బుద్ధుని ఆపి అయ్యా! మిమ్ములను చాల సేపటినుండి తిట్టుచున్నానుగదా! మీకేమీ బాధకలుగలేదా యేమి? అని ప్రశ్నింప అందులకు తథాగతుడిట్లు సమాధానమిచ్చెను.—

నాయనా! మీ యింటికి ఎవరైన అతిథి వచ్చినచో అతనిని ఆదరించి మర్యాద చేసినపుడు మాత్రమే అతడు మీ ఆతిథ్యమును స్వీకరించి మీ యింటిలో భిక్షచేయును అట్లు గాక అతని విషయమై ఏమియు పట్టించుకొనక ఉపేక్షాభావము గలిగియున్నచో అతడు వచ్చి చూచి వెనుకకు వెడలిపోవునుగదా! అట్లే నీవు నన్ను దూషించుచున్నావు. ఆ దూషణను నేను స్వీకరించినచో మాత్రమే నాకు బాధ కలుగును. కాని ఆ ప్రకారము నేనుచేయలేదు ఆ దూషణల ఉపేక్షాభావమును వహించితిని అందుచే అయ్యది మరల నీకడకే వచ్చి చేరినది బుద్ధుని ఆ వాక్యములచే ఎదుటి వానికి కనువిప్పు కలిగినది.

మహనీయులైనవారు ఎన్నిరకాల యుక్తులచేతను ఉపాయముల చేతను మనోవికారములను జయించుచుందురు.

దా వాక్యములచే ప్రభావితుడు కాకుండుట కొఱకై ఒక మహనీయుడు అవలంబించిన పద్ధతిని చూడుడు—

మన్నిందయా యది జనః పరితోషమేతి
నన్వప్రయత్న సులభోఽయమనుగ్రహో మే
శ్రేయోర్థినో హి పురుషాః పరసౌఖ్యహేతోః
దుఃఖార్జితాన్యపి ధనాని పరిత్యజన్తి

నన్ను తిట్టి ఎవడైనా సంతోషపడుచో అది నా దృష్టము ఎందుకనగా ఇతరులకు సంతోష మొనగూర్చు ఉత్తము ఎంతయో డబ్బుఖర్చు పెట్టి కొందఱు సత్రములను స్థించుదురు కొందఱు బావులను త్రవ్వించుదురు కొందఱు న్నదానము చేయుచుందురు కొందఱు వస్త్రాదులను మర్పించుదురు కాని నేనో, ఒక్క పైసా ఖర్చు చేయక కనికి సంతోషము కలుగుటకు కారణభూతుడగుచున్నాను న్ను తిట్టి ఒకడు సంతోషపడుచున్నాడనగా అతని ంతోషమునకు నేనే కారణుడను గదా నా వలనే కదా తనికి అంత ఆనందము కలిగినది అహా! ఇతరుల ఆనందము ఒకై జనులు వేనకు వేలు రూప్యములు ఖర్చుపెట్టుచుండ, మాత్రము ఖర్చు చేయకయే నేనొకనికి సంతోషమును కలుగ యుచున్నాను గదా! — అని ఒక మహనీయుడు తనలో ంచుకొని నిందలకు అతీతుడై నిలచెను.

సామాన్యపరిస్థితులలో అందరును ప్రశాంతముగనే నివసించుదురు. కాని జీవితములలో కొన్ని ఒడిదుడుకులు

సంభవించినపుడు జనులు తమప్పై దలుమోపి పుడు
అఘాంతములు వివరించినపుడు సామాన్యులు తలక్రిందులై
పోవుదురు వారి పరిస్థితి దాదాపు పిచ్చివట్టి వట్లగును కా
వివేకవంతుడు స్థితప్రజ్ఞుడై మేరు వు గంభీరుడై దూష
భూషణములకు రవ్వంతైనను చలింపక యు డును గాలివీచ
నవుడు గు దురాయి ఎండుటాకు రెండును ఒకే చోట నిశ్చ
లముగనుండును పెనుగాలి వీచినచో ఆకు ఎగిరి ఆవల దూరమ
పడును. గులకరాయి యథాప్రకారము కదలక మెదల
యుండును. ఇది యే జ్ఞానికి అజ్ఞానికి గల భేదము జ్ఞాని నిందల
వింటకు అజ్ఞాని నిందలకు భయపడి పరిపోవును. చి
త్తచాంచల్యమును బొందును

ఒకింత వివేకమును ఉపయోగించి చూచినచో ప్రపం
చమున మనోవికారములకు అస్కారమే యుండదు విశే
షమైనట్టి చిత్తవైకల్యము సంభవించునుగాని వి
వేకియగు జ్ఞానికి కాదు

పొగడబడువాడు మఱియును పొగడువాడు
తిట్టబడువాడు మఱియును తిట్టువాడు
ఒక్కడై యుండ స్తుతి నిందలున్న చెల్లుమ
స్వాంతమున నవ్విధంబున శాంతినొంది
ఎత్తిపాడుము కంఠము ఎత్తిపాడు
యతివరాధీర ఓం తత్సదనుచు పాడు.

వివేకానందుల పై వాక్యము లీ సందర్భమున జ్ఞప్తి యందుంచుకొనదగినవి అంతయు ఒకే ఆత్మస్వరూపముగ చూచువానికి లోకములో విశేషభయమునుండదు అతడట్టి స్థితులలో నైనను మనస్సును సమన్వయ పఱచుకొని గలడు ఆత్మతత్త్వము తెలియని అవివేకులకే ప్రపంచమున నడుగడుగున ఆపత్తులు సంభవించుచుండును దుఃఖము నొందుచుందురు జ్ఞాని నిత్యానిత్యవస్తువివేకము కలవాడై తృప్తియందు నతిగలిగి నశ్వరములగు ప్రాపంచిక విషయము లందు అతుష్టుడై నిర్వికారుడై సమచిత్తుడై యుండును అతని చిత్తము శీతోష్ణ సుఖదుఃఖ మానావమానాది ద్వంద్వము లందు సమత్వమును (balance) సాధించగలిగియుండును. ధ్యానముచే ప్రతివానికి అట్టి నిర్వికార స్థితి తప్పక ఉదయించ లదు

పూర్వకాలమున ఒకానొక గురువు తన శిష్యునకీ ప్రకారముగ బోధించెను నాయనా! నిందాస్తుతులు కేవలము మనస్సుయొక్క వికారములు మాత్రమే యని తెలిసికొనుము మఱియు ఈనాడు నిన్ను స్తోత్రము చేయువాడు తన స్వార్థము కొఱకై నీ వలన లోటు జరిగినచో రేపు నిన్ను దూష్య పట్టుటకు సిద్ధముకాగలడు అటిచో అతడు కావించిన స్తోత్ర మున కెట్టి విలువ యుండును? కావున స్తోత్రములకు పొంగి పోరాదు వందిమాగధులు చేయు స్తోత్రములకు అవివేకులగు రాజులే ఉబ్బిపోవుదురు కాని వివేకవంతులగు వారు కారు

అట్లే జనులు కావించు స్తుతి నిందలకు సామాన్యులే ప్రభావితులగుదురు కాని ఒకింత విచారణ జరుపువారు కాదు

కొందరు ఈ ప్రకారముగ చెప్పుదురు నేనేమియు తప్పుచేయలేదు వాడు అకారణముగ నన్ను తిట్టుచున్నాడు నాయనా! నీ వేమియు తప్పుచేయలేదా ఒక పెద్దతప్పు చేసియే యున్నావు క్రిందటి జన్మలో ఆత్మ సాక్షాత్కారము నకై నీవు ప్రయత్నము సల్పలేదు అదియే గొప్ప తప్పిదము నీను ప్రయత్నము చేయలేదని మీ కెట్లు తెలియును అని అందువేమో; క్రిందటి జన్మలో నిజముగా నీవు ఆత్మజ్ఞానమును సంపాదించి యుండినచో నీకు జన్మరాహిత్యమే సిద్ధించి యుండెడిది ఇప్పుడు పుట్టెడివాడవు కావు అట్లుకాక నీ విప్పుడు జన్మించినావు కాబట్టి పూర్వజన్మమున మోక్షప్రయత్నము నీవు చేయలేదనియే అర్థము అది ఎంత పొరపాటు|ఎంత తప్పిదము మరి నేనేమియు తప్పు చేయలేదే యని నీ వెట్లనగ వు? నీవు పూర్వజన్మలో బంధరాహిత్యమునకై ప్రయత్నము చేయక పోవుట బ్రహ్మాండమైన పొరపాటు కదా! కావున నీవు గొప్ప అపరాధమును చేసియే యున్నావు అని భావించుకొని వాడు నన్ను అకారణముగ తిట్టలేదు కారణ మున్నందు వలననే తిట్టినాడు కావున నే నిందలకు దానిచే శోకము పొవలెను! అని ఈ ప్రకారముగ నీలో నీవు సమాధానము పఱచుకొని శాంతి నొందుము

నమోఽపరాధః కిము కారణం నృణాం
మదర్థ్యసూయేత్యపి నైవ చిన్తయేత్
న యత్కృతా ప్రాక్ప్రబలంధనిష్కృతి
స్తతోఽపరాధ పరమో హి కిం భవేత్

అను ఈ శ్లోకము నేను చెప్పిన భావమునే స్పష్టీకరించు చున్నది కాబట్టి నాయనా! నిత్య వ్యవహారమందు బహు జాలువతో నుండుము జనులయొక్క పొగడ్తలకు దూషణ లకు నీ మాత్రము ప్రభావితుడవు కాకుము తగ్గక జాగ్రత్త! జాగ్రత!

పూర్వకాలము ఒకానొక గురువు తన శిష్యునకు గావించిన ఈ హితబోధ ఎంత అర్థవంతముగ ఉత్తేజకరముగ నున్నది ముముక్షువు సాధకులకు ఎంత ప్రయోజనకరముగ నున్నది! శ్రీవివేకానందులు తమ యతిగీతము (The song of the Sannyasin) నందిట్టి భావములనే స్పష్టీకరించి యున్నారు.

Few only know the Truth The rest will hate and laugh at the great one but pay no heed.

కొందఱే సత్యమెఱుంగుదు రందఱిలను
గాన తక్కినవారలు ఘనుదనిన్ను
జేరి నవ్విన లక్ష్యంబు సేయబోకు

Let one put garlands on another kick this frame say naught No Praise nor blame can be Where praiser praised and blamer blamed are one Thus be thou calm, sanyasin told I say

om tat sat Om !

కాయమే మైన లక్ష్యంబు సేయపోకు
దాని కగుపట్టి మంతపదంతనముల
నించుకేనియు నొంచకు మేమియనకు
పొగడబడువాడు మఱియును పొగడువాడు
తిట్టబడువాడు మఱియును తిట్టువాడు
నొక్కటై యుంట స్తుతినిందలున్న చెప్పు
స్వాంతమున నిర్విరోధంబుగ శాంతినుంచి
ఎత్తిపాడుము కంఠము ఎత్తిపాడు
యతివరా ధీర ఓమ్ తత్సదనుచు పాట

నిందాస్తుతులందు మనస్సును సమభావము(Equilibrium) నుంచుట ఒక గొప్పసాధన దీనినే యోగమనియు గీతాచార్యులు సెలవిచ్చియున్నారు (సమత్వం యోగ ఉచ్యతే) భగవద్గీతయందు మోక్షయత్నములం దియ్యది ప్రముఖమైనది అట్టి శ్రీకృష్ణభగవానులు గీతయందు పదే పదే అట్టి సాధనను గురించి చెప్పియున్నారు.

1) తుల్యనిందాస్తుతిర్మౌనీ—

2) మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః

8) నతశ్శ్య తా న మిగ్రేద తథామానావమానయోః

ఎవరైన నిందించినప్పుడు గాని పొగడినప్పుడు గాని చిత్తమునం దేవిధమైన వికారము కలుగనీయక సమభావమునం దుండవలెననియే పై వాక్యముల యొక్క సారాంశము

ఎవరైన నిందించినచో తిట్టినచో విమర్శ చేసినచో ప్రతివారును తమలో తాము బాగుగ విమర్శించుకొని తమ అంతఃకరణమును తీవ్రముగ పరిశోధించుకొని ఎదుటివాని విమర్శచే తమపైన దోషము తమయందేమైన నుండినచో దానిని వెంటనే తొలగించుకొనవలెను తన యందలి దోషములు పొరపాటులు ఎదుటివాడు ఎత్తి చూపినందులకు తద్ద్వారా తనకొనర్చు చరిత్ర నైర్మల్యత్వమునకు దోహదము కలుగజేసినందులకు అతనికి కృతజ్ఞులై యుండవలెను అట్లుకాక తనయం దేవిధమైన దోషము లేకయే అకారణముగ అతడు నింద మోపినచో దానిని గురించి ఏమాత్రము పట్టించుకొనక కించిత్తు కూడ దానిచే ప్రభావితుడు గాక విని విననట్లుగ తటస్థుడుగ నుండవలెను

ఈ విధముగ నిందలకు దూషణలకు అతీతుడుగ వర్తించుటకై మరియొక ఉపాయమున్న కలదు. అది యేమనగా ఎవరైన నిందించు నప్పుడు అతడు దేనిని నిందించుచున్నాడు ? శరీరమునా ? ఆత్మనా ? అని ప్రశ్నించుకొనవలెను

ఆత్మానం యది నిన్దన్తి నిన్దన్తి స్వయమేవహి
శరీరం యది నిన్దన్తి సహాయాస్తే మహా మమ

ఆత్మను నిందించినచో నిందింపు వాని ఆత్మయు నిందింప బడిన వాని ఆత్మయు ఒకటే కావున నిందించువాడు తన్ను తాను నిందించుకొని నట్లే కాగలదు ఇక శరీరమును నిందించి నచో అది రక్తమాంసాదులతో మల మూత్రాదులతో నిండి నిందార్హమై యుండుటచే అట్టి నింద సహేతుకమే యగుచు ముముక్షువు యొక్క సాధనపై పెద్ద సహాయభూతముగ కూడ నుండుచున్నది కాబట్టి రెండు విధములకూడ ముముక్షువు పరుల నిందలచే చిత్తవికారము నొందవలసిన అగత్యము లేకున్నది.

ఈ ప్రకారముగ సాధకుడు వివిధరీతుల యోచించి పరుల దూషణ భూషణములకు ఏ మాత్రము జంకక నిందా స్తుతులందు సమ భావమును వహించి ఇట్టి మహోన్నత సాధనము ద్వారా నిర్వికార నిశ్చలచిత్తమును సంపాదించి తత్ఫలితముగ ఆత్మ సాక్షాత్కారమును బ్రహ్మానుభూతిని బడయువలయును. ఆహార విహారములందును సాధకుడు బహు జాగరూకుడై మెలగవలెను ఆరోగ్యమును జాగ్రతగ కాపాడుకొనుచుండవలెను.

## 3 ఆహారనియమము

బ్రహ్మానందము కొఱకై మోక్షముకొఱకై ప్రయత్నములు సలుపు సాధకుడు తన ఆరోగ్య విషయమై అత్యంత జాగరూకత కలిగియుండ వలసియున్నది. ఆరోగ్యమే

మహాభాగ్యమనుసూక్తి అన్నిరంగములవారికిని అన్వయించు చుండును ఆరోగ్యములేనిదే మనుజుడు సాధన ఎట్లు చేయ గలడు? ఒక గంటసేపు ఆసనముపై కూర్చొనవలసియున్నచో ఆరోగ్యము లేని వానికి అది ఎట్లు సాధ్యపడును? కడుపు నొప్పి గాని, తలనొప్పిగాని పంటినొప్పిగాని యున్నచో ధ్యానమందు ఏకాగ్రత ఎట్లు కుదురును? అత్తరి ఆ బాధయే స్ఫురించుచుండును. ఆ నొప్పియే అనుభవమునకు వచ్చుచుండును ఆరోగ్యము ఎట్లున్న ఏమి? మనకు కావలసినది భక్తికదా వైరాగ్యము కదా ధ్యానము కదా విచారణకదా అని చెప్పినచో అది అనుభవరహిత మగు వాక్యమే కాగలదు

శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్ మొదట ఆరోగ్యము తరువాత ధర్మసాధనము అని పెద్దలు చెప్పిన దాని అంతర్యమిదియే అయియున్నది కాబట్టి ప్రతివారును ఏ క్షేత్రము దున్నను శరీరమే తమ ఆరోగ్యమునుగూర్చి పెక్కుజాగ్రతలను వహించవలసియుండును మొట్టమొదట ఆహారవిషయమున తగిన కట్టుబాటు కలిగియుండవలెను ఆహారనియమము మనమిది ఉపేక్షించతగిన అంశముకాదు ఆహారముచేతనే రక్తము ఏర్పడును రక్తము క్రమక్రమముగ పరిణమించి మేధస్సుగ మారును ఆహారము రజోగుణసంబంధమైనది అయినచో మనస్సున్ను రజోగుణాత్మకముగ మారును తస్మాదన్నమయః మనః (కాబట్టి మనస్సు

అన్న మయమైనది ) అని శ్రుతివర్తు ఈ సత్యమునే ఉద్ఘాటించు చున్నది ఒకవేళ ఎవరైన ఆహారమును చిన్నవిషయముగ భావించినను ఒకొక్కప్పుడు చిన్న విషయములందలి అజాగ్రతయే పెద్ద పెద్ద ప్రమాదములను తెచ్చిపెట్టుచుండును రైలుపట్టాలకు బిగించియుండబడు చిన్న చీలగాని బోల్టుగాని వదులుగా నున్నచో దానివలన పట్టాలు కదలి రైలంతయు పడిపోవు ప్రమాదముకలదు కనుకనే కొందఱు రైల్వే పని వారలు గంటగంటకు ఆ చీలలను తనిఖీ చేయుచు అవసర మైనచోట సుత్తితో కొట్టుచుందురు కావున ఆరోగ్యమునకు ప్రధాన హేతువైన ఆహారవిషయము త్రోసిపుచ్చదగినది కాదు దానిని గూర్చి ఎంతయో శ్రద్ధ వహించవలసియున్నది

ఆహారము అత్యంత పవిత్రముగా నుండవలెనని అది (1) సాత్వికాహారము (2) మితాహారము (3) దైవార్పితాహారము (4) న్యాయార్జితాహారము అయియుండవలెను ఈ నాలుగు విధముల శుద్ధముగా నున్నపుడు మాత్రమే ఆయ్యది శరీరమును ఆరోగ్యముగ తేజోవంతముగ బలవంతముగ నొనర్చుటయేకాక మనస్సును నిర్మలముగ నిశ్చలముగ ఆధ్యాత్మ జ్ఞాన సంపన్నముగ నొనర్చును ఆహార విషయమున పై నియమములు పాటించక అజాగ్రతగను తీ ఇష్టము వచ్చినట్లు తినివేయుచు, జిహ్వాచాపల్యమునకు లోనై ఇంద్రియములకు బానిసలై మెలగుచుండుట వలననే జనుల ఆరోగ్యము చెడిపోయి వైద్యశాలలందు మనస్సు

ప్రవర్తించక ఒక్క వేళ ప్రవర్తించినను సరిగా నిలువక నానా బాధలను పొందుచున్నారు

ఆహారనియమములలో మొట్ట మొదటిది సాత్వికాహారము శ్రీకృష్ణపరమాత్మ గీతలో 17 వ అధ్యాయమున మూడు విధములగు ఆహారమును గూర్చి (అనగా సాత్విక రాజసిక తామసికాహారమును గూర్చి) ప్రస్తావించి సాత్వికాహార సేవనమును ప్రోత్సహించెను. ఆయుస్సును, మనోబలమును దేహబలము ఆరోగ్యమును సౌఖ్యమును ప్రీతిని బాగుగ వృద్ధి నొందించునవియు, రసముగలవియు చమురుగలవియు దేహమందును చాలకాలము ఉండునవియు మనోహరములైనవి యునగు ఆహారములు సాత్వికములనియు చేదుగాను పులుపుగాను ఉప్పగాను మిక్కిలి వేడిగాను కారముగాను చమురులేనివిగాను మిగుల దాహమును గలుగజేయునవిగాను ఉండునవియు శరీరమునకు దుఃఖమును మనస్సునకు వ్యాకులత్వమును గలుగజేయునవి రాజసాహారములనియు పాచిపోయినవి దుర్గంధభూయిష్టములైనవి అసారములైనవి తామసాహారములనియు గీతావాక్యములు విశదముగ పేర్కొనిరి కావున ఆరోగ్యము నిమిత్తము ధ్యానాదులు చక్కగ కొనసాగు నిమిత్తము మనుజుడు రాజసిక తామసిక ఆహారములను వదలి పెట్టి సాత్వికాహారమునే సేవించుచుండవలెను

జంతువులలో ఆవు మేక మొదలైనవాటి సాత్విక ప్రవర్తనకు పులి సింహము మొదలైనవాటి రాజసిక క్రూర

ప్రవర్తనకు గల భేదము సర్వులు ఎఱింగినదే కదా అవి గైకొను ఆహార భేదముల వలననే వాటికి గుణభేదము ఏర్పడి నది కావున ధ్యానము చక్కగ జరుగవలెనన్న మనస్సు నిశ్చలముగ స్థిరముగ నుండవలెనన్న సాత్త్వికాహారము తప్పక సేవ్యమైయున్నది ఆరోగ్యసూత్రములలో ఇది ప్రధానమైనది

ఇక ఆహార నియమములలో రెండవది మితాహారము ఆహారము సాత్త్వికమైనప్పటికిని అమితముగ తినరాదు హితమైన ఆహారమును మితముగ స్వీకరించవలెను. నాత్యశ్నతస్తు యోగోஉస్తి అతిగా తినువారికి యోగమునందు నిలుకడ సంభవించదు[1] అని గీతాచార్యుడు చెప్పనే చెప్పెను యోగము మాట అటుంచి ఆరోగ్య దృష్ట్యా చూచినను అమితాహారము సమ్మతముకాదు దానివలన ఆరోగ్యము చెడుటయేకాక ఒక బీదవానికి పెట్టుటకై మిగులు ఆహారమును తస్కరించినట్లు కాగలదు మితాహారమును సేవించి మిగిలిన ఆ ముద్దను బీదవానికి పెట్టినచో దాని వలన ఆరోగ్యము పుణ్యము అను రెండు లాభములు చేకూరినట్లు కాగలదు.

ప్రపంచములో బాధపడువారు ఇద్దరు అతిగా భుజించి జీర్ణము కాక క్రిందపడి దొర్లుచు నానాబాధలు పడువాడు ఒకడు ఆకలితో అలమటించువాడు మఱియొకడు ఆకలి బాధకంటె అజీర్ణ బాధ చాల ఘోరము అదుపు తప్పి

తినసేల ? తరువాత అవస్థపడనేల ? కావున నాలుకపై ఒకింత సంయమము గలిగి మితముగా తక్కువగానే తిని ఆరోగ్యమును కాపాడుకొనుట శ్రేయస్కరము ఆహారమునకు సంబంధించి రెండు ఇంద్రియములు కలవు ఒకటి నాలుక రెండవది పొట్ట పొట్ట అమాయకమైనది నాలుక ప్రమాదకరమైనది భుజించునపుడు కడుపు నిండ బోవుచుండగా అది నాలుకను హెచ్చరించును ఓ నాలుకగారూ ! ఇక దయచేసి ఆపండి చోటులేదు. కాని నాలుక దాని మాటను ఖాతరు చెయ్యక ఈ ప్రకారముగ జవాబిచ్చును ఓ పొట్టగారూ ! మంచి మంచి భక్ష్యాహారములు ఎదుటగా నున్నవి. ఇప్పుడప్పుడే ఆపను ఈ ప్రకారముగ పొట్టయొక్క హితబోధను తిరస్కరించి అతిగా తిని జీర్ణము చేసుకొనలేక మనుజుడు నానాబాధలను పొందుచుండును గాన మన పొట్ట చేయు హితబోధను నాలుక పాటించినచో వ్యక్తియొక్క ఆరోగ్యము చక్కగా నుండి ఆధ్యాత్మికముగ ధ్యాన జప దైవచింతన యోగాభ్యాసములను, లోక వ్యవహార కార్య నిర్వహణకు అనుకూలత ఏర్పడ గలదు కాని జిహ్వాచాపల్యముచే మనుజుడు ఇంద్రియములకు బానిసయై తత్ఫలితముగ ఆరోగ్యమును చెడగొట్టుకొని దైవ ధ్యానమునకు కూడ దూరమగుచున్నాడు

శరీరము ఒక బస్సు బస్సులో ప్రయాణించు జనమును కూర్చుండ బెట్టి నడపినచో మార్గమధ్యమున ప్రమాదము

వాటిల్లవచ్చును కావుననే బస్సులోగాని కారులోగాని పరిమిత జనమునే తీసికొనిపోవు లాగున ప్రభుత్వము శాసనము చేసినది ఎక్కువగా తీసికొని వెళ్ళినచో ఓవర్ లోడ్ కేసు క్రింద వారిని అరెస్టు చేయుదురు అట్లే శరీరమును బండిలా అమిత బరువును చేయక జాగ్రతగా వహించుకొని పోవలెను ఆరోగ్యమే మహాభాగ్యమను సూక్తిని విస్మరించరాదు

ఒక గ్రామములో ఒక వైద్యుడు గ్రామాంతరము నుండి వచ్చి ఒక ఇంటిని అద్దెకు తీసికొని బోర్డు కట్టి అచట తన వైద్య వృత్తిని ప్రారంభించెను కాని సంవత్సరము గడచినను ఒక రోగి కూడ మందు కొఱకై అతని వద్దకు రాలేదు అతడు ఆశ్చర్యచకితుడై గ్రామవాసులను ఆ విషయమై అడుగగా వారిట్లు చెప్పిరి మహాశయా! దాదాపు రెండు సంవత్సరముల క్రిందట మా గ్రామమున కొక సాధువుగారు వచ్చి గ్రామస్థుల నందరిని పిలిపించి ఆహారమును గూర్చిన రెండు సూత్రములను వచించి వాటిని తప్పనిసరిగా జీవితములో ఆచరణయందుంచవలెననియు అట్లు పాటించినచో ఆయురారోగ్య సంపన్నులై విరాజిల్లగలరనియు బోధించి వెడలిపోయెను ఆ సూత్రము లేవియనిన — (1) భుజించునపుడు ఇక ఒక ముద్ద తినినచో కడుపు పూర్తిగ నిండునని తోచినపుడు ఆ ముద్దను తినరాదు అంతటితో భోజనమును ఆపివేయవలెను. అనగా ఒక ముద్ద తక్కువగనే తినుటమంచిది (2) భోజనమునకు భోజనమునకు మధ్య ఏమియు తినరాదు.

చిరుతిండి మానివేయవలెను - ఈ ప్రకారముగ ఆ సాధువు గారు పరోపకార బుద్ధితో బోధించిన ఆహార సంబంధమైన రెండు సూత్రములను మేము కడు శ్రద్ధతో పాటించు చున్నాము అప్పటినుండియు మా ఆరోగ్యము చాల చక్కగా నుండుచున్నది! గ్రామస్థుల ఆ వాక్యములను విని వైద్యుడు సాధువు గారి ఆరోగ్య సూత్రములను, గ్రామస్థుల పరిపూర్ణ విశ్వాసమును, అచంచల దీక్షా నిర్వహణ బుద్ధిని తలంచుకొని ఆనందపడెను కాబట్టి ఆరోగ్యమును జాగ్రతగ కాపాడుకొనదలంచువారు, ధ్యానా ద్యనుష్ఠానములను చక్కగ కొనసాగింపదలంచువారు ఆహార విషయమున సంయమశీలురై మెలగవలెను

ఆహారనియమములలో రెండవదియగు మితాహారము గూర్చి తెలిసికొనవలసిన అంశములు ఇంకను చాల కలవు. కొన్నిటిని ఇచట విచారించెదము. బ్రహ్మదేవుడు మానవుని శరీరమును సృష్టిచేసినపుడు అందలి ప్రధానాంగ మగు శిరస్సులో రెండు కండ్లు, రెండు చెవులు, రెండు ముక్కురంధ్రములు - ఈ ప్రకారము అన్నియు రెండు రెండుగ పెట్టి, నోరుమాత్రము ఒక్కటిగ ఏర్పాటుచేయుట గమనించదగినది నోళ్లు కూడ రెండుగ పెట్టవచ్చుగదా! అట్లు పెట్టలేదేమి ? దానికి కారణము కలదు. మితముగ తినుము, మితముగ మాట్లాడుము-అని దానిద్వారా భగవంతుడు బోధించుచున్నాడు

యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధః శంకరుల యొక్క వాక్యము వాగింద్రియమైన నోటి సంయమ ప్రాధాన్యతను వ్యక్తము చేయుచున్నది చెవికి వినుట అను ఒక్క పనియే కలదు కన్నుకు చూచుట అను పనిమాత్రమే కలదు. కాని నోటికి మాట్లాడుట తినుట అను రెండు పనులు కలవు కాబట్టి అది బలమైన ఇంద్రియము. దానిని జయించుటకై సాధకు ముగ ప్రయత్నము చేయవలెను. అదుపు తప్పి మితిమీరి మాట్లాడరాదు. మితభోజనము మితభా అలవాటు చేసికొనుట చాల శ్రేయస్కరము ఎక్కువ తి యోగము సిద్ధించదని ధ్యానము కుదరదని శ్రీ వాసుడు గీతయందు సెలవిచ్చియున్నారు (నాత్య యోగోఽస్తి) కాబట్టి ఆహారసేవనమందు పరిమితిని పాటించవలెను.

ఎక్కువగా గాలి ఉన్నదని ఎవరును ఎ గాలిని పీల్చుట లేదుకదా ఎంత అవసరమో అం పీల్చి శేషించినదానిని వదలి వేయుచున్నారుకదా బావిలోగాని నదిలోగాని చెరువులోగాని ఎక్కువ ఉన్నదని ఎవరును ఎక్కువ త్రాగుట లేదుకదా! ఎన్ని అవసరమో అన్నియే త్రాగుచున్నారుకదా! అట్లే ఆ కూడ ఈ శరీరనిర్వహణమునకు ఎంతఅవసరమో అం శ్రేయస్కరము ఒక ముక్క అన్నముపెట్టినచో

అవసరమైనంత మాత్రముతిని తక్కినదానిని వదలివేయును. అట్లే ఒకగోవుముందు గడ్డివేసినచో అవసరమైనంత తిని తక్కినదానిని వదలి వెళ్లిపోవును. కాని మానవుడు అట్లు చేయుచున్నాడా? ఎక్కువగాతిని రోగములు కొని తెచ్చుకొనుచున్నాడు.

## హితభుక్, మితభుక్

అని పెద్దలు బోధించినారు. సాత్వికాహారమును మితముగ సేవింపుమని దాని అర్థము

ఒక పడవలో ప్రయాణించునపుడు నావికుడు ఎక్కువ మంది యాత్రికులను దానిపై ఎక్కింపడు. అట్లు ఎక్కించినచో తాను, పడవ, పడవలోనివారు అందరు గంగార్పణమై పోవుదురు అట్లే విమానము మొదలైనవానియందు ప్రయాణించువారికి సామాను (luggage) ఎక్కువ ఉండ గూడదు ఉన్నను తీసికొనివెళ్ళుటకు అధికారులు అనుమతించరు అట్లే ఆధ్యాత్మగగన వీధులలో విహరించదలంచు సాధకులు అధికాహారముచే తమ దేహములను భారవంతములుగ చేసికొనరాదు. ధ్యానమునకు కూర్చుండి కండ్లు మూసికొనినపుడు దేహము ఏ మాత్రము స్ఫురించరాదు. దూది పింజవలె, బెండువలె అది తోచవలెను. అపుడు మాత్రమే మనస్సు ఊర్ధ్వముఖముగ జనుటకు అవకాశ ముండును. అట్లు కాక అధికాహారముచే శరీరము బరువుగ తోచినచో దేహభావన మఱచుట అసాధ్యము. అట్టి స్థితిలో

ధ్యానము జరుగనే జరుగదు కాబట్టి మితాహార సేవ ము సాధకులకు అత్యవసరము

మితాహారమువలన రెండు గొప్ప ప్రయోజనములు సాధింపబడగలవు ఒకటి ఆరోగ్యము తద్ద్వారా ధ్యాన విజయము. రెండవది పర ప్రాణికి వినియోగించుటకు ఒకింత ప్రసాదమును మిగిల్చుకొని తద్ద్వారా పరోపకారమును సిద్ధింప జేసికొనుట పుణ్యసంపాదనమును గావించుకొనుట అధికాహారముచే అనారోగ్యము కలిగియుండుట ద్వారా శరీర బాధను కొనితెచ్చుకొనుట పర ప్రాణికి సహాయము చేయుటకు అన్నదానమును గావించుటకు అవకాశము లేనందువలన దక్కవలసిన పుణ్యమును పోగొట్టుకొనుట సంభవించును కాబట్టి రెండువిధముల అతనికినష్టము సంభవించును

అతి సర్వత్ర వర్జయేత్

అని పెద్దలు ఏనాడో బోధించియున్నారు ఈ సూత్రము ఆహారవిషయమున ఇంకను చక్కగ అన్వయించును ఒక దీపమునకు వత్తి పెంచినచో గ్లాసు మసిపట్టిపోవును తగ్గించినచో ప్రకాశము మందమైపోవును మధ్యరకముగా ఉంచినచో రాత్రంతయు ప్రకాశమానముగ వెలుగుచుండును. అట్లే శరీరమునకు ఆహారమును మితిమీరి చేసినచో రోగగ్రస్తమగును. ఆహారము పూర్తిగ తగ్గించినచో శక్తిహీనమై ఏ కార్యము చేయుటకును వీలుపడకుండును కనుకనే గీతాచార్యులు యుక్తాహారవిహారములను గూర్చి సెలవిచ్చి మధ్య

మార్గమును అవలంబించువాడు ధన్యుడని బోధించిరి కాబట్టి ఆహార విషయమై సాధకుడు అతిజాగరూకుడై, అప్రమత్తుడై మెలగుచు మితము తప్పనీయక చూచుకొనుచు జిహ్వేంద్రియమును అదుపులో నుంచుకొనుచు ఆరోగ్యమును, ఆత్మశాంతిని బడయుగాక!

సంసారమను సముద్రమునందు దేహమను పడవపై జీవుడు ప్రయాణము సాగించుచున్నాడు సామాన్యముగ పడవ నడుపువాడు అతిజాగరూకుడై పడవ యొక్క స్థితిగతులను అనుక్షణము విచారించుచుండును దాని కేమైన పగులు వచ్చినదా, రంధ్రముపడినదా, మితిమీరిన బరువు మోయుచున్నదా, అదుపుతప్పి ప్రయాణించుచున్నదా, వేగ మెట్లున్నది మున్నగు విషయములను అహర్నిశము అతడు పర్యాలోచించుచుండును అట్లే మానవుడు తన శరీరమను పడవపై సంసార సాగరమున ప్రయాణించుచు మోక్షమను ఆవలి తీరమునకు పోవ నుద్యుక్తుడై యున్నాడు. కాబట్టి శరీరమను పడవ యొక్క రోగములను గూర్చియు ఆరోగ్యమును గూర్చియు పదే పదే జాగ్రత వహింపవలసియున్నది ఆహారసూత్రములను చక్కగ పాటించవలసియున్నది

ఆహార సూత్రములలో రెండవదియగు మితాహారమును గురించి ఇప్పుడు విచారించుచున్నాము. ఏకభుక్తి సదా రోగ ముక్తి ఏకభుక్తముకలవాడు రోగరహితుడై యుండునని పెద్దలు చెప్పుదురు ఒకవేళ అట్లుసాధ్యపడనిచో తక్కిన

రెండు పూటలు ఫలాదులను సేవించవచ్చును శరీరము ఆరోగ్యవంతముగను, ధ్యానాదిసాధనలు నిరాటంకముగ జరుపుకొనుటకు తేలికగను ఉండులాగున చూడవలయును

**Eat to live live not to eat**

జీవించుటకు తినుము తినుటకు జీవించకుము అను నానుడికలదు కొందరు ప్రొద్దస్తమానము ఏదిహో తినుచునే యుందురు మరికొందరు అప్పుడప్పుడు చిరుతిండ్లు తినుచునుం దురు. అట్టివారికి డబ్బు సెలవై పోవుట ఆరోగ్యము చెడి తినుట అను రెండు అనర్థములు వాటిల్లుచుండును ఆహార విషయము ఆధ్యాత్మిక సాధనలలో అతి ముఖ్యమైనది కాబట్టియే శ్రీకృష్ణపరమాత్మ దానిని గూర్చి గీతయందు అచటచట ప్రస్తావించుచుపోయెను యుక్తాహారుడు గీతను పరి సమాప్తము చేయు సమయమునకూడ లఘ్వాశీ (సాధకుడు మితాహారియైయుండవలెను) అని శ్లోకమున ఆహార సంబంధ మైన హెచ్చరికను చేసెను

ఆహారమును ముందు వలె వించవలెను —

భిక్షౌషధం భుజ్యతాం

అని శ్రీ శంకరాచార్యులవారు తమ సాధన పంచకమున చెప్పి యున్నారు ఔషధమును ఎవరును ఎక్కువగ తినరు మిత ముగ సేవించుదురు ఒక స్పూన్నుగాని రెండుస్పూన్నులుగాని ఒక చిన్న మాత్రగాని ఒక చిన్న మందు బొట్లము గాని ఒకటాబ్లెట్ గాని తీసికొందురు డాక్టరుగారూ! పెద్ద

మాత్రి ఇవ్వండి' - అని యెవరును అడగరు. ఈ ప్రకారము మందు విషయమై సహజముగనే మానవుడెట్లు మితిని కాపాడుచున్నాడో, అట్లే ఆహారవిషయమైకూడ పరిమితిని కాపాడుట ఉత్తమమని, సాధకులకేకాక ఎవరికైనను ఈ నియమము చాల శ్రేయస్కరమనియు అనుభవజ్ఞులైన మహనీయులు చెప్పుదురు

శాస్త్రములందు మితాహారమును గురించి ఈ ప్రకారముగ చెప్పబడెను—

ద్వౌభాగౌ పూరయేదన్నైః తోయేనైకం ప్రపూరయేత్
మారుతస్య ప్రచారార్థం చతుర్థ మవశేషయేత్

పొట్టయొక్క రెండుభాగములను అన్నము, కూర, పులుసు, మజ్జిగ మున్నగువానితోను, ఒక భాగమును మంచినీటితోను నింపి మిగిలిన ఒక భాగమును గాలి సంచారమునకై ఖాళీగా నుంచవలయును—ఇదియే మితాహార లక్షణము-అని ఈ శ్లోకము యొక్క అర్థము

ఆహారమును భుజించుటకై వచ్చి కూర్చొనునప్పుడు ఎను లెంత చురుకుగా నుందురో, ఆహారసేవనానంతరము కూడ అంత చురుకుగా నుండవలెను. మితాహారమును సేవించి నవుడే ఇట్టి స్థితి సాధ్యమగును ఎక్కువగ తినినచో అసలు పీటపైనుండి లేచుటయే చాల ప్రయాసగ నుండును అట్టి అమితభోజనప్రియులు భుక్తాయాసముచే బాధపడి నానాయాతనలు పొందుచుందురు. ఎక్కువగ తినరాదు, ఇట్టి అనర్థలు

ఎసనేల ? ఈ సందర్భమున భాగవతమున దు చెప్పబడిన ఓ శ్లోకమిచట ఉల్లేఖింపబడియున్నది—

యావద్భ్రియేత జఠరం తావత్స్వత్వం హి దేహినామ్
అధికం యోऽభిమన్యేత స స్తేనో దణ్డమర్హతి

పొట్టకు ఎంత అవసరమో అంత మాత్రమే సేవింపవలెను అంతమాత్రపు ఆహారముపైననే మానవునకు హక్కు కలదు అధికముగ సేవించువాడు దొంగయేయగును అట్టివాడు దండనకు అర్హుడు ఆ ప్రకారమే యోగవాసిష్ఠమందును శ్రీ వసిష్ఠమహర్షి ఆహారము ప్రాణసంరక్షణకొఱకే గాని భోగవిలాసముల కొఱకు కాదని స్పష్టీకరించి ఎట్లనిన—

ఆహారార్థం కర్మ కుర్యాదనిన్ద్యం
కుర్యాదాహారం ప్రాణసంధారణార్థమ్
ప్రాణాస్సంధార్యాస్తత్త్వజిజ్ఞాసనార్థం
తత్త్వం జిజ్ఞాస్యం యేన భూయో న జన్మ

ఈ ప్రపంచమున ఆహారసంపాదనముకొఱకై పాపరహితమగు కార్యమేదేని చేసికొనవచ్చును ఆహారము ప్రాణ సంరక్షణకొఱకు మాత్రమే సేవింపవలెను అనగా బ్రతుకుటకు మాత్రమే ఆహారమును గైకొనవలెను ఇక బ్రతుకుట దేనికొఱకనగా భగవత్తత్త్వమును తెలిసికొనుటకొరకు భగవత్తత్త్వమును దేనికొరకు తెలిసికొనవలెననగా ముక్తి నొందుటకు జన్మరాహిత్యము నొందుటకొఱకు

ఈ ప్రకారముగ దేహధారణమునకు తగినంత ఆహారము కాక, భోగపిపాసులకొరకు కాదు. తన్ను మహారుచిగనుంట పక్షముగ చెప్పవచ్చెను కొందఱు పిండివంటల కొఱకై, ఎంతయో ధనమును వెచ్చించుచున్నారు అవి వ్యాధిబాధల్యమును తీర్చుటకే కాని ఆరోగ్యమున కనుకూలమైన సహాయము చేయజాలవు పైపెచ్చు అధికసేవనముచే అనారోగ్యము నవి కలుగజేయును. కాబట్టి జిహ్వాపై ఒకింత అదుపు గలిగి అది కోరిన రుచులన్నిటకి దాసిక ఇవ్వక, అది వాంఛించిన వస్తువులను లన్నిటిని దానికి సమర్పించక, దేహధారణకు శరీర స్వాస్థ్యమునకు అవసరమైన ఆహారమునే సేవించుట ఉత్తమము

స్వాద్వన్నం న తు యాచ్యతాం
విధివశాత్ప్రాప్తేన సంతుష్యతామ్

అని శ్రీ శంకరులు ప్రస్తావించినట్లు రుచులు కోరక, అవసరములు తీర్చుకొని సాధకుడు వాగింద్రియ సంయమము గలవాడై ఆరోగ్యమును ఒక్రతగ కాపాడుకొనుచు అప్రమత్తుడై ఆధ్యాత్మిక పథమున ముందునకు కొనసాగిపోవలెను

జీవితములోని ఎక్కువ భాగమును ఇరువురు అపహరించుచున్నారు. వారే ఆహారము, నిద్ర, ఆ రెండిటిని వశము (Control) నందుంచుకొనని దైవధ్యానమునకు ఎంతయో సమయము మిగులుచుండును. ఆహారసేవనమందు, నిద్రయందు పరిమితిని అవలంబించినచో జీవుడు తరించుటకై ప్రయత్నము

యుటకు తోడ్పడు సమయము లభించుచుండును. జీవితములో ప్రధానమైనట్టి పుణ్యసంపాదనము నిర్వహించిన వానిని స్మరించి జనులు నశ్వరములగు ప్రాపంచిక విషయములంతో వెఱగిడుచున్నారు. కాబట్టి జీవునకు శాశ్వతముగ పకరించు పుణ్యము భగవద్భక్తి ఆత్మ విచారణ ముఖ్యమగుని కొఱకై సమయమును ఎంత మిగుల్చుకొనిన అంత మంచిది. పుణ్యము దారిబత్తెమువంటిది. దారిబత్తెమును ఖండుగనే జాగ్రతపఱచుకొనువాని ప్రయాణము వివిధమైన ఇడుములు లేక సవ్యముగా జరిగిపోవునట్లు పుణ్యము గడించువానికి ఎల్లెడల సద్గతులే కలుగుచుండును. కావున తమో శ్రేయమును కలుగచేయు పుణ్యసంపాదన పరులై జీవుడు కర్మానురాగుడై యుండి సమయమును దాసోహాదులందు వృథాగా గడిపివేయక క్రమశిక్షణతో నిద్ర ఆదుపునందుంచుకొని అవసరమైనంత మాత్రమే పడు అవసరమైనంత కాలమే నిద్రించుచు మిగతా సమయమును తన శ్రేయోభివృద్ధికై వినియోగించుచుండవలెను. లేనిచో అమూల్యమైన మానవజీవితము వ్యర్థమై పోవును.

మితాహారము వలన వైద్యాసనమునకు సమయము ఎక్కువగా మిగులుటయేకాక ఆరోగ్యమున్ను జనులకు చేకూరగలదు. మితాహారము ఉపవాసముతో సమానమని పెద్దలు చెప్పుదురు. అధికాహారముచే శరీరమునకు తరచు

కుగ్గతి ఏర్పడుచుండును. ఒక ఫాక్టరీ నిరంతరము పని చేయుచుండినచో చెడిపోవును గదా! కనుకనె వారమునకు ఒక రోజు దానికి విశ్రాంతి ఇచ్చుచుందురు. అటే శరీరమునకున్ను - పదునైదురోజుల కొకసారి ఉపవాసము ద్వారా విశ్రాంతి నొసంగుట ఉత్తమము. తక్కిన దినములందును మితాహారమునే దేహమునకొసంగ వలెనుగాని పొట్టను బరువెక్కునట్లు చేయరాదు. సాత్త్వికాహారము చేతను, మితాహారము చేతను శరీరమేకాక, మనస్సున్ను ఆరోగ్యవంతముగా నుండునని శాస్త్రములు పేర్కొనుచున్నవి.

'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః, స్మృతి లాభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః' అని ఉపనిషత్తులు ఈ భావమునే స్పష్టీకరించుచున్నవి. ఆహారశుద్ధిచే రక్తము శుద్ధమగును. రక్తశుద్ధిచే మెదడు శుద్ధమగును దానిచే భావములు శుద్ధపడును. ధ్యానాదులున్ను చక్కగ జరుగును.

పదార్థములు బాగుగానున్నవని కొందరు కక్కుర్తికి ఎక్కువగా తిని, జీర్ణించుకొనలేక, నానాయాతనలు పడుచుందురు. జిహ్వాచాపల్యమే వీనికి కారణము. పూర్వమొక రాజు జిహ్వేంద్రియమునకు పూర్తిగ వశుడై, ఎక్కువగా తిని, కక్కుకొని మరల తినుచుండువాడట! జాగరూకత లేనిచో నాలుక ఒనులకు ముక్కుకు త్రాడుకట్టి పశువునువలె వాడిచ్చి చేయుచుండును. కాబట్టి సంయమము చాల అవసరము.

ఒకచోట విందు జరుగుచుండెను నాలుకపై అదుపు తప్పిన యొకడు దానిలో పాల్గొని మితిమీరితిని తుదకు నడవలేక తడబడుచుండగా మరియొకడు అతని శోచనీయ పరిస్థితిని గమనించి అతని కివ్రకారముగ హితబోధ గావించెను "నా యనా! ఒక బండిలోగాని బస్సులోగాని ఎక్కువమందిని కూర్చొనబెట్టినచో అది నిషేధము కావున వారిపై ఓవర్ లోడ్ కేసు పెట్టి ప్రభుత్వమువారు శిక్షించెదరుగదా! అట్లే శరీరమును కూడ అతిశాహార సేవనము చే బరువెక్కించినచో దైవప్రభుత్వమువారు కూడ వారికి శిక్ష విధించుదురు రోగమే ఆ శిక్ష! అశాంతియే ఆ శిక్ష. కావున ఇక మీదటనైనను జాగరూకుడవై శరీరమును బాధింపక నాలుకపై సంయమము కలిగి మితముగనే భుజింపుము" అతని వాక్యములను విని తిండిపోతు క్షమాపణ వేడుకొని ఇకమీదట సక్రమముగ వ్యవహరించెదననియు నాలుకకు లొంగక యుండుననియు పలికి వెడలిపోయెను

కావున ముముక్షువులగువారు ఆహారవిషయమై సంయమమును కలిగియుండి సాత్త్వికాహార మితాహారములనే సేవించుచు జిహ్వాచాపల్యమునకు లోనుగాక ఇంద్రియములను అదుపాజ్ఞలలో నుంచుకొని సమయమును దైవధ్యాన ఆత్మచింతనాదులందు గడుపుకొనుచు జీవితమును పునీతము గావించుకొనవలయును

మగ్గుతి ఏర్పడుచుండును ఒక ఫాక్టరీ నిరంతరము పని చేయుచుండినచో చెడిపోవును గదా! కనుకనే వారమునకు ఒక రోజు దానికి విశ్రాంతి ఇచ్చుచుందురు అటే శరీరమునకున్ను-పదునైదు రోజుల కొకసారి ఉపవాసము ద్వారా విశ్రాంతి నొసంగుట ఈ క్రమము తక్కిన దినములందును మితాహారముచే దేహమునకొసంగ వలెనుగాని పొట్టను బరువెక్కునట్లు చేయరాదు. నా త్యాశాహారము చేతను, మితాహారము చేతను శరీరమేకాక, మనస్సున్ను ఆరోగ్యవంతముగా నుండునని శాస్త్రములు చేర్కొనుచున్నవి

'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః, స్మృతి లాభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః' అని ఉపనిషత్తులు ఈ భావమునే స్పష్టీకరించుచున్నవి. ఆహారశుద్ధిచే రక్తము శుద్ధమగును, రక్తశుద్ధిచే మెదడు శుద్ధమగును దానిచే భావములు శుద్ధపడును. ధ్యానాదులున్ను చక్కగ జరుగును.

పదార్థములు బాగుగానున్నవని కొందరు కక్కుర్తికి ఎక్కువగా తిని, జీర్ణించుకొనలేక, నానాయాతనలు పడుచుందురు జిహ్వాచాపల్యమే వీనికి కారణము. పూర్వమొక రాజు జిహ్వేంద్రియమునకు పూర్తిగ వశుడై, ఎక్కువగా తిని, కక్కుకొని మరల తినుచుండువాడట! జాగరూకత లేనిచో నాలుక మనలకు ముక్కుకు త్రాడుకట్టి పశువునువలె వాడ్చి చేయుచుండును. కాబట్టి సంయమము చాల అవసరము.

# 4 నిర్దుష్టకర్మ

జీవిత నిర్వాహణమునకై ఆహారము అవసరము కావున ఆహార సంపాదనార్థమై ఏదైన పని చేయవలసివచ్చుననియు ఏదైన వృత్తిని చేపట్టవచ్చుననియు పెద్దలు చెప్పుచున్నారు శాస్త్రములున్ను అందులకు అనుమతి నిచ్చినవి. అయితే ఆ చేపట్టుపని నింద్యము కానిదై యుండవలెనని శాసించిరి అధర్మము అన్యాయము అవినీతి—వీనితో గూడినపని శాస్త్ర సమ్మతముకాదు అది నింద్యమైనది పాపభూయిష్ఠమై ది అట్టి పని కర్తకు చేటు తెచ్చును. నరకమున బడద్రోయును కాబట్టి అట్టి నింద్యకర్మను ఎవరును అవలంబించరాదు ప్రోత్సహించరాదు

అక్రమముగ సంపాదించిన ధనముతో పంచభక్ష్య పరమాన్నము లారగించినను ఆ యాహారము జీర్ణముకాదు క్లేశమునే కలిగించును న్యాయముగ సవ్యముగ సంపాదించిన కొలది ధనముతో అటుకులు తినినను ఆ యాహారము పట్టు తరమై తిన్నవానికి శ్రేయమును చేకూర్చును

పూర్వకాలపుమాట అర్జునుని తీక్ష్ణబాణములచే భీష్ముడు పడిపోగా అతడు పరుండి విశ్రాంతి గైకొనుటకు గాను అర్జునునిచే అంపశయ్య ఏర్పాటు చేయబడెను స్వేచ్ఛామరణరూపవరము కలవాడగుటచే ఉత్తరాయణమునకు వేచియుండదలంచి భీష్ముడు ఆ అంపశయ్యపై పరుండి విశ్రాంతి

కుగ్గుతి ఏర్పడుచుండును ఒక ఫ్యాక్టరీ నిరంతరము పని చేయుచుండినచో చెడిపోవును గదా! కనుకనే వారమునకు ఒక రోజు దానికి విశ్రాంతి ఇచ్చుచుందురు అటే శరీరమునకున్ను-పదునైదు రోజుల కొకసారి ఉపవాసము ద్వారా విశ్రాంతి నొసంగుట ఈ త్రిమును లెక్కించ దినములందును మితాహారమునే దేహమునకొసంగ వలెనుగాని పొట్టను బరువెక్కునట్లు చేయరాదు. సాత్వికాహారము చేతను, మితాహారము చేతను శరీరమేకాక, మనస్సున్ను ఆరోగ్యవంతముగా నుండునని శాస్త్రములు ఘోషించుచున్నవి

'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః, స్మృతి లాభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః' అని ఉపనిషత్తులు ఈ భావమునే స్పష్టీకరించుచున్నవి. ఆహారశుద్ధిచే రక్తము శుద్ధమగును, రక్తశుద్ధిచే మెదడు శుద్ధమగును దానిచే భావములు శుద్ధపడును. ధ్యానాదులున్ను చక్కగ జరుగును.

పదార్థములు బాగుగానున్నవని కొందరు కక్కుర్తికి ఎక్కువగా తిని, జీర్ణించుకొనలేక, నానాయాతనలు పడుచుందురు. జిహ్వాచాపల్యమే వీనికి కారణము. పూర్వమొక రాజు జిహ్వేంద్రియమునకు పూర్తిగ వశుడై, ఎక్కువగా తిని, కక్కుకొని మరల తినుచుండువాడట! జాగరూకత లేనిచో నాలుక మనలను ముక్కుకు త్రాడుకట్టి పశువునువలె నాడించి వేయుచుండును. కాబట్టి సంయమము చాల అవసరము.

గుణ్యముగనే ప్రవర్తించవలెను కావట్టి ఆహారముతో అక్కై
నింద్యముకాని పనినే చేసికొనవలెను, గాని నింద్యమైనదానిని
కాదు ఏ క్షేత్రమందును పాపము పనికిరాదు, అపకారము
పనికిరాదు అన్యాయము, అధర్మము, అవినీతి పనికిరాదు
నిప్పులో వ్రేలుపెట్టి తరువాత పశ్చాత్తాపపడినచో ప్రయోజ
నము లేదు విశ్వాసమునకు తిలబగ్గి ప్రవర్తించువారను
సత్కర్మయే తనను రక్షించును.

## ధర్మో రక్షతి రక్షితః

ఈ ప్రకారములైన వివిధ సాధనలద్వారా మనుష్యుడు
తన చిత్తమును శుద్ధి మొనర్చుకొని, ఆత్మజ్ఞానమును సంపా
దించి ఆట్టి జ్ఞాననేత్రముచే తనయదార్థస్వరూపమగు సచ్చిదా
నందమును గుర్తెఱిగి అద్దానియందు నిలకడ కలిగి బ్రహ్మా
నందానుభూతిని బడయవలయును

చర్మనేత్రము లేనివాడు అంధుడు జ్ఞాననేత్రము లేని
వాడు మహాంధుడు భౌతికదృష్టి లోపించిన వాడు అంధుడు
జ్ఞానదృష్టి లోపించినవాడు మహాంధుడు కన్నులులేనివాడు
ఒక్క జన్మలో బాధపడును. జ్ఞానము లేనివాడు జన్మజన్మాం
తరము బాధపడుచు జనన మరణరూప సంసారచక్రము
నందు గగుల్కొని నానాయాతనల ననుభవించుచుండును
అంధులు తమ అంధత్వమును పోగొట్టుకొనుటకు ఎన్నియో
చికిత్సలను గావించుకొనుచుందురు కాని చిత్రమేమియో కాని
మహాంధులు తమ అజ్ఞానమును పోగొట్టుకొనుటకు చర్యలం

గ్గికొనకయేయున్నారు తత్ఫలితముగ వారు సంసారదు
దావానలమున బడి తీవ్ర దుష్పరిణామములకు లో
నున్నారు

తన్నుతాను తెలిసికొనక యుండుటయే గ్రుడ్డితన
తన ఆత్మ స్వరూపమును తాను చక్కగ తెలిసికొని తా
దేహముకాని మనస్సుకాని ఇంద్రియములుకాని కాదని
నిత్య శుద్ధ చిదాత్మయే తన యథార్థస్వరూపమనియు ఎవ
బాగుగ తెలిసికొనునో అట్టివాడు తన గ్రుడ్డితనమును పోగొ
ట్టుకొనినవాడగును అట్టివాడే వాస్తవముగ నేత్రములు క
వాడగును

యః పశ్యతి స పశ్యతి

అని గీతాచార్యుడీ సత్యమునే ప్రస్ఫుటముగ తెలిపియుండె.
సమస్త ప్రాణులందును సమముగ నున్నట్టి పరమాత్మను
యా ప్రాణుల దేహాదులు నశించినను నశింపనివానిగ ఎవ
చూచుచున్నాడో అతడే నిజముగ చూచువాడగును. అని భ
గవానుడు గీతయందు వాక్రుచ్చియున్నాడు అనగా ఆత్మశాశ్వ
తమని దేహాది దృశ్యపదార్థములు అశాశ్వతములని యెఱు
వాడు ఇట్లెఱిగి ఆత్మస్వరూపమున నిలకడ గలిగి దృశ్
వస్తువులందు వ్యామోహము లేనివాడు జనులలో నేత్రము
కలవాడని భావము ఇదియే జ్ఞానదృష్టి ఈ వ్యావస్తువులు
జూడగల్గు భౌతికదృష్టి యున్నప్పటికిని ఎవరికి జ్ఞానదృ
యుండదో అట్టివారిని దుఃఖములు వెన్నంటుచునేయుండును

గుణ్యముగనే ప్రవర్తించవలెను కాబట్టి ఆహారముతో అక్కై నింద్యముకాని పనినే చేసికొనవలెను, గాని నింద్యమైనదానిని కాదు ఏ క్షేత్రమందును పాపము పనికిరాదు, అపకారము పనికిరాదు అన్యాయము, అధర్మము, అవినీతి పనికిరావు నిప్పులో వ్రేలుపెట్టి తరువాత పశ్చాత్తాపపడినచో ప్రయోజనము లేదు విశ్వాసమునకు తిలబగ్గి ప్రవర్తించువారిని సత్కర్మయే తనను రక్షించును.

## ధర్మో రక్షతి రక్షితః

ఈ ప్రకారములైన వివిధ సాధనలద్వారా మానవుడు తన చిత్తమును శుద్ధి మొనర్చుకొని, ఆత్మజ్ఞానమును సంపాదించి ఆట్టి జ్ఞాననేత్రముచే తనయదార్థస్వరూపమగు సచ్చిదానందమును గుర్తెరిగి అద్దానియందు నిలకడ కలిగి బ్రహ్మానందానుభూతిని బడయవలయును

చర్మనేత్రము లేనివాడు అంధుడు జ్ఞాననేత్రము లేనివాడు మహాంధుడు లౌకికదృష్టి లోపించిన వాడు అంధుడు జ్ఞానదృష్టి లోపించినవాడు మహాంధుడు కన్నులులేనివాడు ఒక్కజన్మలో బాధపడును. జ్ఞానము లేనివాడు జన్మజన్మాంతరము బాధపడుచు జనన మరణరూప సంసారచక్రము నందు తగుల్కొని నానాయాతనల ననుభవించుచుండును అంధులు తమ అంధత్వమును పోగొట్టుకొనుటకు ఎన్నియో చికిత్సలను గావించుకొనుచుందురు కాని చిత్రమేమియో కాని మహాంధులు తమ అజ్ఞానమును పోగొట్టుకొనుటకు చర్యలం

పశ్యన్తి జ్ఞానచక్షుషః (15-10)
అన్తరం జ్ఞానచక్షుషా (13-35)
దివ్యం దదామి తే చక్షుః (11-8)

జ్ఞాననేత్రముయొక్క ఆవశ్యకతను పరమాత్మ పై వాక్యద్వారా లోకమునకు స్పష్టమొనర్చెను. జ్ఞానదృష్టిలేనివా అవిద్యను ఆశ్రయించువారు, అంధకారపూరితములగు తమోమయ లోకములను బొందవల వచ్చునని యీ ప్రబలతరదముల ననుభవింపవలసి వచ్చునని యీ ఉపనిషత్తులు వేనో పలుకుచున్నవి.

కావున అంధత్వమునకు చికిత్స నొనర్చుటకై కలువులాగున మహాంధత్వ నివారణమునకు మహాత్ముల కలిసి జనులు తమ్ముని జ్ఞానదృష్టిని బడసినవారై జ్ఞాననేత్రములచే భగవద్దర్శనము గావించుకొని జీవితమును పరమార్థమయముగ నొనర్చుకొనవలయును. అట్టి జ్ఞానదృష్టి కలిగియుండుటయే వాస్తవమగు పాండిత్యము

విద్యలందు నేర్పరితనము కవిత్వాదులందు చతురత్వము గ్రంథరచనా నైపుణ్యము కావ్య నాటకాదుల పరిజ్ఞానము కళాకౌశల్యము విద్యావైదుష్య కలిగియుండుటయే పాండిత్యమని సామాన్యముగ జన తలంచుచుందురు అట్టి పాండిత్యము కలవానిని పండితుడనియు చెప్పుచుందురు

కాని శ్రీకృష్ణపరమాత్మ గీతయందు ఎవరినిగూర్చియు, దేనిని గూర్చియు శోకింపనివారే పండితులనియు (నానుశోచన్తి పండితాః), జ్ఞానాగ్నిచే సమస్తకర్మలు దగ్ధమొనర్చుకొనినవారే పండితులనియు (జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః), సమస్త చరాచర ప్రాణికోట్లయందును సమదృష్టికలవారే పండితులనియు (పండితాః సమదర్శినః) వక్కాణించెను. మృత్యువును జయింపగల్గుటయే యథార్థమగు పాండిత్యము. అట్టి పాండిత్యమును అలవరచుకొనని వాడు ఎట్టి లౌకికవిద్యలం దారితేరినప్పటికిని, శాంతిని నోచుకొనలేడు, మృత్యువును తప్పించుకొనలేడు. జనన మరణ ప్రవాహమును దాటలేడు, కర్మ బంధనమును ఉచ్ఛిన్న మొనర్చుకొనలేడు.

నిరక్షరస్యాపి తు యస్య కుక్షౌ
బ్రహ్మైవ చాభాతి స ఏవ సాక్షరః
సర్వాక్షరస్యాపి తు యస్య చిత్తే
బ్రహ్మైవ నాభాతి స వై నిరక్షరః

చదువు లేనప్పటికిని, ఓనమాలు రానప్పటికిని, ఎవని హృదయమందు పరబ్రహ్మము సదా భాసించుచుండునో, ఎవడు ఆత్మానుభూతి చక్కగ కలిగియుండునో అతడు సమస్త విద్యలను నేర్చుకొనినవాడే యగును. సమస్త విద్యలయందును ఆరితేరినప్పటికిని ఎవడు దైవానుభవము చేయకుండునో అతడు వాస్తవముగ నిరక్షరకుక్షియే యగును. కావున లౌకిక పాండి

త్వముతోపాటు పారమార్థిక పాండిత్యమును కూడ కలిగి యుండుట శ్రేయస్కరము

శ్రీ వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు పెక్కు ధర్మ రహస్యములను ఉద్బోధించుచు సంసారకూపమునుండి లేవ నెత్తి తిరిగి అట్టి కూపమున బడకుండ చేయునట్టిదే పాండిత్య మనియు అద్దానిని యత్నపూర్వకముగ సంపాదించవలయు ననియు ఉద్ఘాటించెను.

తావన్మయా భవభయకరీ పండితత్వం న యావ
త్తత్పాండిత్యం పతసి న పునర్యేన సంసారచక్రే
యత్నం కుర్యాదవిరతమతః పండితత్వేఽమలాత్మ
జ్ఞానోదారే తదమితరథా నైవ వః శాన్తిమేతి

(వసిష్ఠగీత)

కావున ముముక్షువగువాడు సంసారతారకమగు ఈ పాండిత్య మును సద్గురు సచ్ఛాస్త్ర సహాయముచే తప్పక బడయవలసి యున్నది. నహి నహి రక్షతి డుకృఞ్కరణే అని శ్రీ శంకరా చార్యులు నుడివినట్లు వ్యాకరణాది విద్యలు అంత్యకాలమున జీవుని బాధను తొలగించనేరవు మృత్యుపాశమునుండి అతనిని తప్పించలేవు కాబట్టి ఇతరవిద్య లెన్ని నేర్చి నప్పటికిని ఎంతటి లౌకిక పాండిత్యప్రకర్షము కలిగి యున్నప్పటికిని ఆత్మజ్ఞానము పాండిత్యమును బడయనిచో జీవుడు దుఃఖ మును తప్పించుకొనజాలడు

అక్షరుడును పరమాత్ముడునగు పరిజ్ఞానమునకు నారో అత్యం జ్ఞానము కలవాఁడని యెఱుఁగవలెను. శ్రోత్రియుల కొఱకై ప్రాసలాడుటలోనే జీవితమంతయు వెచ్చించువాడు అక్షరమగు సచ్చిదానందాత్మ స్వరూపమునుగూర్చి ఒకింతైనను ప్రయత్నము సలుపనివాడు తుదకు పశ్చాత్తాపమునకు వచ్చును. ఎన్నివిద్యలు గడించినప్పటికిని, సంసార సముద్రమును తరింపజేయునట్టి ఆత్మవిద్యను అభ్యసింపనిచో, జన్మ మృత్యు జరా వ్యాధియుక్తమగు ఈ దుఃఖోదధియందు మరల మరల గ్రుంకులిడక తప్పదు. కావున, ప్రాపంచిక విద్యా వైదుష్యముతోబాటు బ్రహ్మజ్ఞానరూప పాండిత్యమును జీవుడు యత్నపూర్వకముగ బడసి అనాదికాలమునుండి తనను తరుముకొని వచ్చుచున్న మాయయను పెనుభూతముయొక్క బెడదను తప్పించుకొని బంధవిముక్తుడై పరమానంద మనుభవించవలయును. జ్ఞాననేత్రమును చక్కగ వికసింపజేసికొనవలెను.

## 5. జ్ఞానదృష్టి

చర్మనేత్రము దృశ్యపదార్థములను చూచును. జ్ఞాననేత్రము దృశ్యరూపమగు పరమాత్మను వీక్షించును. భౌతికనేత్రము నశించు వస్తువులనే చూచును. జ్ఞాననేత్రము శాశ్వతమగు దేవదేవుని గాంచును. 'యద్దృశ్యం తన్నశ్యం' - తోలుకన్నుతో చూడబడునది యంతయు కాలగర్భమున ఏనాటికైనను విలుప్తమైపోవును. చూచునట్టి కన్ను, చూడబడు

ప్రపంచము రెంటను అనంతకాలవాహినిలో కొట్టుకొనిపోవును కాని జ్ఞాననేత్రముతో అవలోకింపబడు ఆత్మదేవుడు కాలమునకు లోబడక కాలముచే ప్రకాశితుడుకాక కాలకాలుడై కాలమును దిగ్రమింగి కూర్చొనియున్నాడు అట్టి ఆత్మను దర్శించువాడు ధన్యుడు దర్శించుట కుపకరించు జ్ఞానచక్షువు కలవాడు కృతకృత్యుడు

చర్మనేత్రము మానవులకే కాదు దానవులకునుకలదు జంతువులకునుకలదు పశుపక్ష్యాదులకును కలదు, చీమలకును కలదు దోమలకుకలదు అది యొక పెద్ద విశేషమేమియును గాదు మానవుడై పుట్టి జ్ఞాననేత్రమును సంపాదించుటలోనే కలదు విశేషము జ్ఞానచక్షువును సంపాదించుటకే అసలు మానవజన్మ యేర్పడినది. దేవతలుకూడ వారి వారి భోగవిలాస వాతావరణమందు జ్ఞాననేత్రమును సంపాదించజాలక ఎప్పుడు మానవజన్మ లభియించునా ఎప్పుడు బ్రహ్మావలోకధిషణ సంయుతమగు అద్భుత మనుష్యత్వమును బొందుదుమా యని ఉవ్విళ్లూరుచుందురు

ఇట్టి స్థితిలో అపూర్వమగు మానవజన్మ లభించియు తోలుతిత్తులలో తృప్తిపడియుండుట భావ్యమా? ఆహా ర్వాత్రకములు నశ్వర పదార్థములనే వీక్షించుచు కాలము గడపుట యుక్తమా? వచ్చిన పని యేమి? మనము చేయుచున్నదేమి? మన గమ్యస్థానమేది? దానిని పొందుటకై స్పష్టమైన ఆచరించుచున్నామా? అని ఆలోచించక విలువ

గలిగిన శిష్యుడయి యిప్పటిని మంటగలిపివేయుట న్యాయమా? సద్గురూపదేశముచే దివ్యనేత్రమును, జ్ఞాననేత్రమును ప్రయత్నపూర్వకముగ బడసి జీవితమును చరితార్థమొనర్చుకొనుట ఎల్లర ధర్మము.

భౌతిక నేత్రము పంచభూతములచే ఏర్పడినది అది జడమైనది. కావున అది స్థూలపదార్థములనే చూడగల్గును. ఆత్మయో అతి సూక్ష్మమైనది. అతి సూక్ష్మమగు ఆత్మను స్థూలమగు చర్మచక్షువు చూడజాలదు

### సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం

అని గీతాచార్యుడే స్వయముగ వెల్లడించి యున్నాడు. కావున పరమాత్మను వీక్షించుటకు ఈ చర్మనేత్రములకు సామర్థ్యము లేదని స్పష్టమగుచున్నది

కొందఱు ఈ ప్రకారముగ ప్రశ్నించుచుందురు - 'అయ్యా! దేవుండనువాడు ఉన్నచో మాకేల కనిపించడు ప్రపంచములోని అన్ని వస్తువులు కనిపించుచున్నవి కదా! మఱి దేవుడు మాత్రము ఎందులకు కానరాడు కనిపించినచో దేవునిపై మాకు ఎంతయో విశ్వాసము కలుగునుగదా కనుపించని దేవునిపై మాకు విశ్వాసము ఎట్లు కుదురును!' - దీనికి సమాధానము—ప్రపంచములో కనుపించని వస్తువు లెన్నియో ఉన్నను వానిపై జనులు విశ్వాసము కలిగి యున్నారు. గాలి కనిపించదు. ఆకాశము కనుపించదు. ఎవరి

కన్ను వారికి కనుపించదు ఎవరి నీవు వారికి కనుపించదు ఈ ప్రకారముగ స్థూలమైన వస్తువులే కొన్ని కనరావుగా అతి సూక్ష్మాతి సూక్ష్మమై సూక్ష్మతరమైన మనస్సునకును అవలోకించునట్టి ఆత్మభాతిక నేత్రమునకు ఎట్లు గోచరించగలదు అట్లు గోచరించనంతమాత్రమున అది లేదని ఎట్లు చెప్పగలదు ?

దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా
సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః

అతి సూక్ష్మమైన విజ్ఞాననేత్రముచే ఏకాగ్ర బుద్ధిచే మహనీయులు పరమాత్మను వీక్షింపగల్గుచున్నారని శ్రుతి భగవతి ఘోషించుచున్నది

అర్జునుడు రణరంగమున విశ్వరూపమును చూపుమని శ్రీకృష్ణమూర్తిని ప్రార్థింపగా —

న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే రూపమైశ్వరమ్

ఓ అర్జునా! ఈ చర్మనేత్రముచే నీవు విశ్వరూపమును చూడజాలవు నీకు దివ్యనేత్రమును ఒసంగుచున్నాను దానిచే నీవు అద్దానిని వీక్షించగలవు అని వచించి భక్తునిపైగల వాత్సల్యాతిశయముచే దివ్యచక్షువును ప్రసాదించెను. అట్టి దివ్యనేత్రముచే ధనుంజయుడు భగవానుని అద్భుత విశ్వరూపమును చూడగల్గెను కాబట్టి దైవదర్శనము (ఆత్మసాక్షా

అ (?) భౌతిక నేత్రముద్వారా బిలుపబడు జానికి దివ్య నేత్రము, జ్ఞాన నేత్రము అతి ప్రవర్తి యున్నారలమన్న సూక్ష్మ వస్తువులను ఎన్నటికిని చూడజాలదు. అట్టి చోస్థూలాస్థమగు భౌతిక నేత్రము సూక్ష్మతర, సూక్ష్మతమమగు పరమాత్మను ఎట్లు చూడగలుగును? కాబట్టి భగవద్దర్శనముగోరే జీవుడు జ్ఞాన నేత్రమును తప్పక సంపాదించవలయున్నాడు.

జ్ఞాననేత్రము భౌతిక ఎడార్థ యిలవలె బయట లభించు వస్తువు కాదు. అది లోనివస్తువు. నిత్యానిత్య వివేకమే జ్ఞాన నేత్రము, ఆత్మ నాత్మ వివేకమే జ్ఞాననేత్రము పుష్పమాలలో పుష్పములను చర్మనేత్రము చూచుచున్నది. లోని దారమును జ్ఞానచక్షువు అవలోకించుచున్నది. ఒకానొక వ్యక్తిని చూచి నపుడు శరీరమునొక్క బాహ్య స్వరూపమును అనగా రక్త మాంసమయమగు బాహ్య ఆకృతిని కన్ను చూచుచున్నది కాని లోన వెలుగుచున్న శాశ్వత పరమాత్మను, దివ్యమగు ఆత్మస్వరూపమును జ్ఞాననేత్రము వీక్షించుచున్నది. భౌతిక నేత్రములకు అగోచరమగు అతి సూక్ష్మమగు అధ్యాత్మ పదార్థములు తెలిసికొనగలుగు వివేకమే జ్ఞాననేత్ర మన బడును.

ఇట్టి జ్ఞాననేత్రమునొక్క ప్రస్తావన ఉపనిషత్తులందు భగవద్గీత యందును, ఇతర శాస్త్ర గ్రంథములందు అచటచట కానవచ్చుచున్నది. ఓ జనులారా! ప్రయత్నపూర్వకముగ జ్ఞాననేత్రమును సంపాదించుకొని విశ్వమును సాక్షాత్ భగ

సత్స్వరూపముగ వీక్షించుచు జీవితఫలమును కృతకృత్యము చేసికొనుడు అని శాస్త్రములందు మహనీయులు ఉద్బోధించుచున్నారు

ఆవృత్త చక్షురమృతత్వమిచ్ఛన్

అని కఠోపనిషత్తు గంభీరముగ పలుకుచున్నది అనగా మరణ రహిత ఆత్మస్థితిని బడయుదలంచువాడు తన చూపును బయటనుండి లోనికి త్రిప్పవలసియుండునని భావము దృష్టిని బాహ్య విషయముల నుండి మరలించి అంతర్ముఖ మొనరించి చక్కగ ధ్యానించునప్పుడే ఆత్మానుభూతి కలుగగలదని ఉపనిషత్తు పేర్కొనుచున్నది అట్టి ధ్యానజనిత వివేకమే జ్ఞాన నేత్రము దానిచే చూచునపుడు ప్రపంచమంతయు ఒకే చైతన్య స్వరూపముగ ఒకే ఆత్మస్వరూపముగ గోచరించును

తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః

అచట వైర మెచట! దుఃఖ మెచట! అజ్ఞాన మెచట! అంతయు శాంతి యుండు నిక శత్రు మిత్రాది భేదముగాని స్వకీయ పరకీయ భేదముగాని అచట ఉండనేరదు సర్వం ఖల్విద బ్రహ్మ—నేహ నానా స్తి కించన — ఈ ప్రపంచ మంతయు పరబ్రహ్మ స్వరూపమే ఇచట అనేకత్వము లేనే లేదు అను ఉపనిషత్సిద్ధాంతము ఈ శ్రుతి కార్యాన్వితమగును

మరియు జ్ఞాననేత్రముచే వీక్షించునపుడు జడమేదియో చైతన్య మేదియో క్షేత్రమేదియో క్షేత్రజ్ఞుడెవడో సర్వేశ్వర

మేదియో శాశ్వత మేదియో జీవునకు విస్పష్టముగ గోచరించును.

'క్షేత్ర క్షేత్రయో రేవమన్తరం జ్ఞానచక్షుషా' జ్ఞానచక్షువుచేత క్షేత్ర క్షేత్రజ్ఞుల భేదమును చక్కగ తెలిసికొని జీవుడు పరమాత్మ పదమును బడయ గల్గుచున్నాడని గీతాచార్యులున్న వచించియున్నారు

'దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేత్ బ్రహ్మమయం' జగత్ 'ఓయీ' నీ దృష్టిని జ్ఞానమయముగ నొనర్చుకొని, జ్ఞాననేత్రమును సంపాదించుకొని ప్రపంచమునంతను బ్రహ్మమయముగ గాంచుము' అని శ్రీ శంకరభగవత్పాదులు ఉద్ఘోషించిరి.

ఈ ప్రకారముగ ఉపనిషత్తులేమి, భగవద్గీత యేమి, సమస్త శాస్త్రములేమి, శంకరాచార్యాది మహనీయులేమి— ముక్తకంఠముగ జ్ఞాననేత్రావలంబనమును గూర్చి ఉద్బోధించి యున్నందున దాని నెట్లైన ఈ జీవితములో సాధించి తెచ్చుకొనుట ముముక్షువుల కర్తవ్యమైయున్నది.

ఎఱుపు అద్దములు గల కళ్లజోడు పెట్టుకొని చూచినచో ప్రపంచ మంతయు ఎఱ్ఱగా కనిపించును నలుపు అద్దములు పెట్టుకొనినచో నల్లగా కనిపించును, తెలుపు అద్దములు పెట్టుకొనినచో తెల్లగా కనిపించును అట్లేజ్ఞానదృష్టితో వీక్షించినచో సమస్తము బ్రహ్మమయముగ గోచరించును

అజ్ఞానముచే దృష్టి అపవిత్రమైపోయి నందువలన జనులకు ప్రపంచము వక్రముగా కనిపించుచున్నది. ఆ దృష్టిని శుద్ధ పఱచుకొనినచో గురు శాస్త్రోపదేశముల చేతను స్వానుభవము చేతను నిర్మల మొనర్చుకొనినచో ప్రపంచము ప్రపంచరూపమున గాక దైవరూపముగ గోచరమగును. అట్టి స్థితి సాధించుటకే మానవజన్మ ఏర్పడినది. జ్ఞాననేత్ర సంపాదనకొరకే మహోన్నతమగు మనుష్యత్వమును భగవానుడు జీవులకు ప్రసాదించెను. అట్టి మనుష్యత్వమును సార్థక పఱచుకొనుట ప్రతివానికర్తవ్యము విద్యుక్తధర్మము.

అయితే ముందుగా భక్తిని చక్కగ అభివృద్ధి పఱచుకొనవలెను పూజా జపధ్యానాదుల ద్వారా భగవంతుని శ్రద్ధగ ఉపాసించవలెను. అట్టి జీవుల భక్తికి మెచ్చి కరుణామయుడగు పరాత్పరుడు బుద్ధియోగమును వారికి ప్రసాదించును (దదామి బుద్ధియోగం) ఆ బుద్ధి యోగమే జ్ఞాననేత్రము అదియే దివ్యనేత్రము అట్టి దివ్యనేత్రముచేతనే అర్జునుడు విశ్వరూపమును చక్కగ చూడగల్గి భగవంతుని దివ్యావతారమును శ్రద్ధగ అవగాహనము చేసికొనగల్గెను

భక్త్యాత్వనన్యయాశక్య అహమేవంవిధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ పరన్తప

ఆ నేత్రమును ఒక్క అర్జునుడే కాదు ఎవరైనను పొందవచ్చును. అనన్యభక్తి కలిగియుండిన చాలును—అని

శ్రీకృష్ణ భగవానులు సెలవిచ్చియున్నారు. కాబట్టి అతి సులభమైన భక్తిని జేబట్టి భగవత్కృపకు పాత్రులై, భగవదనుగ్రహముచే జ్ఞాననేత్రమును బడసి ఏది సత్యమో ఏది అసత్యమో తెలిసికొని, ఏది బింబమో ఏది ప్రతిబింబమో అవగతము చేసుకొని, ఏది నిత్యమో ఏది క్షణికమో అనుభూత మొనర్చుకొని నిత్యమైన ఆత్మయందు మనస్సు నిలిపి క్షణికమైన దృశ్యపదార్థములందు వ్యామోహమును వదలి నిరతిశయ ఆత్మానందానుభూతిచే జీవితమును చరితార్థ మొనర్చుకొనవలయును

చర్మనేత్రములు అందరికిని కలవు జ్ఞాననేత్రములు మాత్రము అందరికిని లేవు. జంతువులకును పక్షులకును, క్రిమికీటకాదులకును, దేవతలకును, రాక్షసులకును వేయేల, సర్వులకును చర్మచక్షువులు కలవు అవి తోలు కండ్లు, వాని ద్వారా ప్రాణి బాహ్యవస్తువును మాత్రము చూడగల్గు చున్నాడు నశించు నామరూపములను మాత్రము పరికించ గలుగుచున్నాడు అంతియేకాని ఆత్మను కాదు ఆత్మదర్శనమునకు జ్ఞాననేత్రము ఆవశ్యకమైయున్నది అట్టి జ్ఞాననేత్రము లేనివాని జీవితము అంధుని జీవితము వగిది దుర్భర యాతనలతో గూడియుండును. సూర్యుడు దేదీప్యమానముగ ప్రకాశించుచున్నను, గ్రుడ్డివాడు చూడలేకున్నట్లు పరమాత్మ సర్వవ్యాపకుడై సర్వత్ర వెలయుచున్నను అజ్ఞాని గాంచజాల

లను తెలిసికొనుచుందురు. అట్లే జ్ఞానులగు మహనీయులు జ్ఞానకిరణములను ప్రసరింపజేసి ప్రతివస్తువునందును పరబ్రహ్మమును అవలోకింతురు

దృష్టిం జ్ఞానమయీం కృత్వా
పశ్యేద్బ్రహ్మమయం జగత్

దృష్టిని జ్ఞానవంతముగ నొనర్చుకొని జగత్తును బ్రహ్మమయముగ వీక్షించవలెనని ఉపనిషత్తు బోధించుచున్నది. ఉపాధులన్నిటియందును అనుస్యూతమై వ్యాపించియున్న అంతరాత్మను విచారణచే దర్శించుటను మానవుడు లెస్సగా అభ్యసించవలసియున్నాడు

అజ్ఞానులు బాహ్యమును మాత్రమే చూచుదురు. వారి దృష్టి అంతవరకే పోవును. ఎటువంటి మహాపండితుడైనను బాహ్యమును ఉపాధిని మాత్రమే చూచుచో, లోనున్న పరమాత్మను చూడనిచో అతడు అజ్ఞానియేయగును. కావున 'X' కిరణములచే వస్తువుయొక్క అభ్యంతరవిశేషములు గోచరించునట్లు వివేకమను కిరణములను ప్రసరింపజేసి ప్రతి జీవియందును, ప్రతి [illegible] నున్న ఆత్మను దర్శించవలెను. అప్పుడు [illegible] ప్రేమ, దయ, కరుణ, పరోపకారము వెల్లివిరియుచుండును

యస్మిన్సర్వాణి భూతాని
ఆత్మైవాభూద్విజానతః

తత్ర కో మోహః కః శోక
ఏకత్వ మనుపశ్యతః

అని ఉపనిషత్తులు ఘోషించినవిధముగ సర్వభూతములందును తనయందలి ఆత్మయే ప్రకాశించుచుండ ఇక ఒకడు ఇంకొకనికి అపకారమెట్లు చేయగలడు ? అప్పుడిక ద్వేషమెందుకు ? కోపమెందుకు ? అసూయయెందుకు ? కాబట్టి అట్టి జ్ఞానదృష్టిచే దుర్గుణములన్నియు నశించిపోయి విశాల హృదయమేర్పడగలదు ప్రేమ దయ హెచ్చి పొరలగలవు. వసుధయంతయు తన కుటుంబమే యను భావము కలుగగలదు.

ఒక వ్యక్తిని చూడగనే దేహమును మాత్రము పరికించువాడు అధముడు మనస్సును జూచువాడు మధ్యముడు ఆత్మను గాంచువాడు ఉత్తముడు వివేకవిచారణాదుల చేతను భక్తి వైరాగ్యాది సాధనల చేతను జ్ఞాననేత్రమును చక్కగ వికసింపజేసికొని ప్రతి వస్తువునందును ప్రతి ప్రాణియందును సచ్చిదానందపరబ్రహ్మమును దర్శించుచు జీవితమును ఆనందమయముగ నొనర్చుకొనవలెను. భేదదృష్టియే సంసారము అభేదదర్శనమే మోక్షము

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్

అని గీతాచార్యుడు ఘోషించిన చందమున విభజింపబడియున్న ఈ జగద్వస్తువులందు విభజింపబడకయున్న పర

మాత్మను దర్శించుటను చేయ్యకొనవలెను. అదియే నాత్మీక జ్ఞానము, అదియే ఉత్తమజ్ఞానము.

అనవరత సాధనచే ఇట్టి జ్ఞాననేత్రము తప్పక లభ్యము కాగలదు "దదామి బుద్ధియోగమ్" అని భగవానుడు స్పష్టముగ పేర్కొనియుండుటబట్టి భక్తిని చక్కగ అభివృద్ధి బొందించుకొనినచో ఆ పరాత్పరుడే తగిన బుద్ధిబలమును, విచారణాశక్తిని, జ్ఞానదృష్టిని ప్రసాదించగలడు. కాబట్టి అట్టి మహోన్నతలక్ష్యము కొఱకై సహృదులను యత్నశీలురై, దృష్టిని పవిత్రవంతముగ నొనర్చుకొని, జ్ఞాననేత్రముచే విశ్వమంతయు తన స్వరూపమేయను అనుభూతిని బడసి బ్రహ్మానందమును బడయవలెను. లక్ష్యమును పొందువఱకు ప్రయత్నమును విడనాడరాదు అజాగ్రతను పోమరితనమును దరికి చేర్చరాదు.

కొంత ఎక్కుటకు ప్రారంభించినవాడు శిఖరము తప్పక చేరగలడను హామీగా ఏమియులేదు మధ్యలోనే నిలిచి పోవచ్చు మూడు భాగములు ఎక్కియు ఆగిపోవచ్చు. శిఖరమునకు దరిదాపులలో కాలుజారి క్రిందకు పడిపోవచ్చు. ఎక్కుటకు ప్రారంభించిన కొద్ది సేపటికే నిరుత్సాహపడి వెనుకకు మరలవచ్చు ఎవ్వరో రోహణము నకు బయలుదేరిన వారిలో ఏకొద్దిమందో, శీఘ్ర [illegible] శిఖరమును అధిరోహించి అఖండజ్యోతిని బడయుదురు, ఎంతకష్టములు పట్టినను,

ధైర్యము కష్టసహిష్ణుత కార్యదక్షత గల వారు మాత్రమే ఆ
ప్రకారముగ లక్ష్యము చేరగల్గుదురు

అట్లే మోక్షసౌధ మధిరోహింపవలెనను తలపుండియు
ప్రయత్నమును ప్రారంభించువారు ఏ కొద్దిమందిరో ఉందురు
అట్లు ప్రారంభించినవారిలో సౌభాగ్యమును చేరి లక్ష్యము
కరతలామలక మొనర్చుకొనువారు ఏ ఒకరిద్దరు మాత్రమే
యుందరు

ఈ సత్యమునే గీతాచార్యులు

మనుష్యాణాం సహస్రేషు
కశ్చి ద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం
కశ్చిన్మాం వేత్తి తత్త్వతః

అను శ్లోకముద్వారా చక్కగ నిరూపించెను కా॥
లక్ష్యముచేరుటకు ఎంతయో సాహసము ధైర్యము పట్టు
అవసరము

సంసారక్షేత్రమున ఎన్నియో ఇడుములపాలై, జీవ
వాణివన్నింటిని అధిగమించుటకును శాంతిలోని సుఖము
అనుభవించుటకును ప్రయత్నము సలుపుచున్నాడు అట్టి
పూర్ణ సుఖము ఆత్మయందేకలదు దృశ్యమందు లే
కావుననే పరమాత్మ సాక్షాత్కారము కొరకై జీ
అహర్నిశలు పాటుపడుచున్నాడు అయితే గమ్యస్థానము

చేరగలుగుచున్నాడా ? లేదు కారణమేమి ? మాయా ప్రభావముచేతను, జన్మాంతర వాసనా ప్రాబల్యముచేతను ఒకింత అజాగ్రత వానియందున్నందు చోటుచేసుకొని వెనుకకు లాగుచున్నది. దానిని జయించెనా, విజయలక్ష్మిని వరింపగలుగుచున్నాడు. దానిచే నిర్జితుండయ్యెనా, దిగజారిపోవుచున్నాడు. లక్ష్యము నుండి పరాఙ్ముఖుడై పోవుచున్నాడు.

రాక్షసులెవరు ? వారున్న పూర్వము దేవతలే కాని అజాగ్రతవలన ఉన్నతస్థానమునుండి దిగజారి క్రిందకు పడిపోయినారు. అమరకోశమునందు రాక్షసులనుగూర్చి చెప్పునపుడు ఈ క్రింది వివరణము గావింపబడినది

అసురా దైత్య దైతేయా
దనుజేంద్రారి దానవాః
శుక్రశిష్యా దితిసుతాః
పూర్వదేవాః సురద్విషః

ఈ పేర్లలో 'పూర్వదేవాః' - అని కలదు అనగా రాక్షసులు పూర్వము దేవతలేయనుభావము ఇచట చక్కగా స్ఫురించుచున్నది

కాబట్టి గొప్పవారైనను వారి గొప్పతనమును కాపాడుటకు ప్రయత్నము చేయుచుండనిచో, అజాగ్రతకు, సోమరితనమునకు, తమోగుణమునకు, మాయకు అవకాశము నొసంగినచో ఆ గొప్ప స్థితినుండి దిగజారి అధఃపతనమును పొందిపోవుదురు. దేవతలు పూర్వ దేవతల (రాక్షసుల) స్థితికి జారిపోవుదురు.

కనుకనే పరమార్థసాధకునకు ప్రమత్తత అనగా సోమతనము అజాగ్రత మృత్యువుతో సమానమని పెద్దలు పలికిరి (ప్రమాదో వై మృత్యుః) కావున మోక్షాపేక్షగల సాధకుడు జాగరూకుడై సాధనను ఏకాలమందును విడనాడక పూర్ణత్వమును బడసినను గూడ చాల అప్రమత్తుడై యుండవలెను ఏలయనిన ప్రతి క్షణము మాయ మహాబలవతియైనది సాధకుడు ఏకొంచెము అజాగ్రతగ నున్నను వానిని తిరిగి సంసారసముద్రమున ముంచివేయుటకై అదికాచుకొని యుండును చరిత్రయొక్క పుటలను ఒకసారి తిరుగవైచిన ఉన్నతస్థితిని అధిరోహించి ఎందరో మహనీయులును ఒక్కొక్కప్పుడు మాయయొక్క ఎదురుదెబ్బలుతిని దానియొక్క పన్నాగములకులోనై కాలుజారి పడిపోయిన సందర్భములెన్నియో కలవు

కనుక ముముక్షువగువాడు తన సాధనయందు అజాగ్రత ఏమాత్రము కానీయగరాదు శత్రువు వచ్చి రాకము వానిని హృదయస్థానము నుండి బయటకు గెంటి పారవేయవ సముద్రములో పడిన కట్టెపుల్లలను చెత్త చెదారః తరంగములు పిల్లపిల్లగ నెట్టి ఒడ్డుకు ఎట్లు చేర్చివేయునో అట్లే ముముక్షువు తన హృదయ సాగరమున ప్రవేశించు దుస్సంకల్పములను, కామాది వికారములను వివేక విచారమను తరంగములచే బయటకు త్రోసివేయవలెను జాగరూకుడై యుండవలెను